# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

## ఇది నమ్మలేని నిజం! షుగర్‌కు ఇక శెలవ్!!

షుగర్ (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) వ్యాధి బాధితులకు శుభవార్త!! 35 సం॥రాల సుదీర్ఘకాల పరిశోధనా ఫలితం! అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE-II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDN) 30 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE-1 DIABETES. INSULIN DEPEN-DENT DIABETES MELLITUS. (IDDN) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును.

(PER MONTH Rs. 2000/-) TYPE-II COURSE 3 MONTHS. TYPE-1 COURSE 6 MONTHS.

## త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును అల్కహాల్‌ను (Alcohol), గంజాయి (Bang), నల్లమందు (0pium) (Morphine), బీడీ, సిగరెట్, గుట్కా కల్లు, సారాయి, మైకం పొగ (Cannabis), (Heroin) మొదలగు మత్తుమందులు (Tobacco-Pipe) పొగాకు పొగ పీల్చుట మా ఆయుర్వేద మందు ద్వారా మానవచ్చును, లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. Course: 2months.

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టురాలుట, పేను కొరుకుడు, జలుబు, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడుపోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపకశక్తిని వృద్ధిపరచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడవుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును శాశ్వతంగా నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100 ml, 250 ml; Kerala Herbal Shampoo 100 ml; 250 ml; Herbal Hair capsules 60 - Course: 6 Months.

## సంతానం లేని (Infertillity - Sterillity) దంపతులకు శుభవార్త!!

సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens) Course: 3 months, స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు మూసుకొనిపోవుట (Fallopian Tubes Block), గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రోలాక్టిన్ హార్మోన్ ఎక్కువ శాతములో ఉన్నా లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా వున్నా ఎండోమెట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా రసాయన వాజీకరణ పద్ధతుల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. Course: 3 months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కళ్లు, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇస్నోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, ఐస్‌వాటర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200 ml Course: 9 months.

❖ నూతన యవ్వనశక్తికి, శీఘ్రస్కలనము, హస్తప్రయోగము (Masturbation): నపుంసకత్వము (Impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొనిపోవుట, వృషణములు కుష్కించి పోవుట (Atrophy of Tests), ప్రోస్టేటు గ్రంధి వాపు (Enlarge Prostate) Course: 3 months ❖ సుఖవ్యాధులు (Venereal Diseases): వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్లీట్, షాంక్రాయిడ్, Course: 3 Months: ❖ హెర్పిస్ సింప్లెక్స్ (Herpes Simplex) హెర్పిస్ జోష్టర్ (Herpes Zoster) Course: 3 months. ❖ స్తనముల బిగువుకు: జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా వున్న స్తనములను సైజును పెంచి, గట్టిగా గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును, స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) Course: 3 months ❖ స్త్రీలకు పొత్తికడుపు మీద గోకిన గీతలు, చారలు పోవుటకు (Screch Marks) Course: 3 months ❖ మలబద్ధకము (Constipation): Course: 1 month. గ్యాస్ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై చాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) Course: 3 months ❖ రక్తమొలలు, అర్శమొలలు (Piles) Haemoroids, ఆసనములో చీలిక పుండ్లు (Fissers) (ఆపరేషన్ లేకుండా) Course: 3 months ❖ పులిపిర్లు (Warts), ఆనెలు (Corns) ❖ సోరియాసిస్ (Psoriasis) Course: 3 months: ❖ బొల్లి (Leucoderma), Course: 3 months. ❖ స్థూలకాయము (Obesity): అధిక బరువును, లావును తగ్గించుటకు (No Diet, No Exercise) Course: 3 months ❖ సన్నగా బలహీనముగా నుండువారు, బరువు పెరిగి, లావు కావటానికి ఎత్తు పెరుగుటకు, (21 సం॥లోపు వారు) Course: 3 months ❖ కీళ్ళు కండరాల నొప్పులకు: (Rheumatis arthritis) నరముల వాపు (Neuritis) (Backache), నడుము నొప్పి (Lumbago), మెడనొప్పి వెన్నునొప్పి (Spinalcord), తుంటి నొప్పి సయాటిక ఆపరేషన్ లేకుండా Course: 3 months ❖ పక్షవాతము (Paralysis) Course: 3 months. ❖ మూర్ఛ అపస్మారకము (Fits) (Epliepsy) పిచ్చి ఉన్మాదము (Mania) హిస్టీరియా (Hysteria) జ్ఞాపకశక్తి తగ్గిపోవుట (Loss of Memory) నిద్రపట్టకపోవుట (Insomnia), Course: 3 months. ❖ చెవిపోటు (Ear ache): చెవి నుండి చీము కారుట, చెవుడు, చెవిలో హోరు శబ్ధము ఆపరేషన్ లేకుండా, Course: 3 months. ❖ నత్తిని తగ్గించుటకు (Stammering): Course: 3 months ❖ స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు: Course: 1 month.

**HIV/ AIDS, CANCER/LUKEMIA, MAIGRANE, HEPATITIS, HERPES.**

అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.




## కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రేమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20. ఫోన్: 65526109, 9866155109, 9392355590

Note: పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ॥ 80/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10A.M. - 2P.M. & 5P.M.-8P.M.



# కాప్షన్ మీదే - 6




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

నెలరోజులు పుట్టింటికెల్తావా?
అంతవరకిక్కడ నేనెలా చచ్చేదే తాయారూ?

-ప్రభాకర్ తల్లాప్రగడ,
మదీనాగూడ, హైదరాబాద్



## కాప్షన్ మీదే - 5

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

అమ్మయ్య ఎన్నికలైపోయాయి..
ఎంచక్కా నా 'నీడ'ను నమ్మచ్చు.

-జి.ద్వారకానాథ్, కోట, నెల్లూరుజిల్లా

ఛీ.. నా నీడకు కూడా
చులకనైపోయా.

- నేమాన సుభాష్ చంద్రబోస్ శ్రీకాకుళం

నీ నీడను కూడా నువ్వు
నమ్మవద్దంటారు..! ఇందుకే కాబోలు!!

- పి.సూర్యనారాయణ రాజు,
బంజారా హిల్స్, హైదరాబాద్

బాత్‌రూమ్‌లో బాస్
కాలు జారిపడ్డారా? మై గాడ్ ఫ్రాక్చరా?

-టి.ప్రభాకరం, హైదరాబాద్



# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

## చతుర


**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

సంపుటి -32
సంచిక - 05
జూన్ 2009
377వ సంచిక

# చతుర





ముఖచిత్రం : స్వాతి
ముఖపత్రాలంకరణ : రాజుయాట

'నీ కొడుకు డాక్టరు కాకుండా కాంపౌండరవ్వాలి' అన్నాడు భూపతి.
'నీ పగ నామీద చూపించు. నా పిల్లల్ని వేధించకు?' బతిమాలాడు సీతారామయ్య.
'ఏం చేయను? మాలతికి నీ పిల్లలు కూడా నిన్ను తిట్టుకోవాలని కోరిక'
'మధ్యలో మాలతినెందుకురా ఈ రొంపిలోకి లాగుతావు?'
'ఒక్కసారి మా ఇంటికొచ్చి మాలతిని తిట్టు.. నిజం తెలుస్తుంది. నీ సంతానానికీ ప్రగతి ఉంటుంది.'
ఇంతకీ భూపతిని చూస్తే సీతారామయ్య ఎందుకంత భయపడతాడు?
ఈ మాలతికి వారితో సంబంధం ఏమిటి?
ఆద్యంతం ఆసక్తికరంగా సాగే **వసుంధర** నవల

**మోహినీ భస్మాసుర**

10 వ పేజీలో

బొమ్మలు: భాస్కర్

అపార్ట్‌మెంటాలజీ -17

# సీరియల్ పెళ్ళిచూపులు

యర్రంశెట్టి శాయి



ఆ రోజు మా అపార్ట్‌మెంట్స్‌లో ఉదయం నుంచే హడావుడి మొదలయిపో యింది. 'సి' బ్లాక్‌లో ఉండే కోటేశ్వర్రావ్ వాళ్లమ్మాయికి ఆ రోజు పెళ్ళిచూపులు!

ఆ తతంగం చాలా గ్రాండ్‌గా జరపాలని కోటేశ్వర్రావ్ కోరిక. అందుకు మా కమిటీ మెంబర్స్ సహాయ సహకారాలు కావాలని అడగటం వల్ల మేమంతా కూడా ఆ ఫంక్షన్‌లో పార్టిసిపేట్ చేయాలని డిసైడ్ చేశాం. ఎందుకంటే ఆ పెళ్ళికొడుకు తల్లిదండ్రులు మా అపార్ట్‌మెంట్స్‌లోనే ఉండే హనుమంతు బంధువులు. పెళ్ళికొడుకు, అతని తరపువారు అమ్మాయిని చూడ్డానికి సాయంత్రం ఆరుగంటల సమయంలో రాబోతున్నట్లు ఎస్ఎంఎస్ వచ్చింది కోటేశ్వర్రావ్‌కి.

కోటేశ్వర్రావ్ షాకయ్యాడు.

"అదేంటి సార్- సాయంత్రం ఆరింటి కొస్తానంటారేంటి? ఆరింటి నుంచీ, ఏడింటి వరకూ వర్జ్యం కదా-" అన్నాడు కంగారుగా.

వెంటనే అందరం మధ్యవర్తి హనుమంతుడిని పిలిచాం.

హనుమంతు వాళ్ళకు ఫోన్ కొట్టాడు.

"ఆరు నుంచి ఏడుదాకా వర్జ్యం ఉంది కదండీ! ఆ టైములో వస్తే ఎలా? పోనీ ఏ నాలుగింటికో, అయిదింటికో రండి-" అన్నాడతను.

"అలా కుదరదండీ!" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి పద్మారావ్.

"ఎందుక్కుదరదు?"

"నాలుగింటి నుంచీ అయిదింటి వరకూ మా రెండోవాడు స్పోర్ట్స్ చానెల్ చూస్తాడు. చాలా ఇంపార్టెంట్ మ్యాచ్ అది."

"స్పోర్ట్స్ చానెల్ చూస్తాడా? చూస్తే చూడనీండి- మీరు రావచ్చు కదా-"

"మా రెండోవాడు లేకుండా మేమెలా వస్తామండీ! వాడిక్కాబోయే వదినను తనూ చూడాలని ఉంటుంది కదా!"

"అవునవును ఉంటుంది" ఒప్పుకున్నాడు హనుమంతు.

"పోనీ ఏడు తర్వాత రమ్మనండి!" అడిగాడు కోటేశ్వర్రావ్.

ఆ మాటే పద్మారావ్‌తో చెప్పాడు హనుమంతు.

ఆ సజెషన్ వింటూనే పద్మారావ్ భార్య బిగ్గరగా అరవటం- ఆ ఫోన్ ద్వారా మా అందరికీ వినబడుతూనే ఉంది.

"ఏడింటికెలా వెళ్తామండీ! 'మొగుడి పెళ్ళి- పెళ్ళాం నిశ్చితార్థం' సీరియల్ వచ్చే టైమ్ కదా! ఆ టైమ్‌లో ఎవరయినా ఇల్లు వదలి వెళ్తారా? " అంటూ తనే ఫోన్ లాక్కుని మాట్లాడింది.

"చూడయ్యా హనుమంతూ -'మొగుడి పెళ్ళి - పెళ్ళాం నిశ్చితార్థం' సీరియల్ వచ్చే టైమ్‌లో ఎవరయినా పెళ్ళిచూపులకెళ్తారా? అక్కడ పెళ్ళి కూతురి తల్లి మాత్రం ఆ సీరియల్ చూసే టైమ్ కాదూ? వాళ్ళను ఇబ్బంది పెట్టడం మంచిది కాదుగదా-"

"కానీ ఆవిడ ఆ సీరియల్ చూడరంటమ్మా! వేరే చానెల్లో ఎనిమిదింటికొచ్చే 'మంగళ సూత్రం అలజడి- పారాణి సవ్వడి' సీరియల్ చూస్తారంట!"

"ఛీ - అదేం బావుంటుందీ? తలా తోకా లేని కథ-"

"ఆవిడకలాంటి కథలే ఇష్టమేమో-"

"సరే- నేనయితే ఏడింటికి రాలేను. కావాలంటే ఎనిమిదింటికొస్తాం-" అందామె తెగేసి చెప్తూ-

ఆ మాట వింటూనే కోటేశ్వర్రావ్ కంగారుపడ్డాడు.

"ఎనిమిదింటికి మా మిసెస్ సీరియల్ చూసే టైమ్ కదా- ఆటైమ్‌లో పిడుగులు పడినా టి.వి. ముందునుంచి లేవదు" అన్నాడు గాబరాగా.

దీంతో చర్చల్లో ప్రతిష్టంభన తప్పలేదు.

సాయంత్రం వరకూ హనుమంతు రెండు వేపులా సరిపోయే టైమ్‌కోసం నానా తంటాలూపడ్డాడు. చివరకు రాత్రి తొమ్మిదింటికి ప్రోగ్రాం ఫిక్స్ చేశారు అందరూ కలసి.

సరిగ్గా అప్పుడే ఎ బ్లాకువేపు 108 వాహనం పెద్దగా శబ్దం చేసుకుంటూ వచ్చింది. అక్కడ ఏవరికేమయిందో అర్థంకాక




అందరం అటువేపు పరుగెత్తాం.

"ఎవరు కాల్ చేశారు? " అడిగాం డ్రైవర్ని-

ఎ బ్లాక్‌లో ఫ్లాట్ నెంబర్ త్రీ జీరో టూ నుంచి సార్"

అందరు రాజారామ్ ఫ్లాట్ వేపు పరుగెత్తాం.

రాజారామ్ భార్య ఏడుస్తూ బయటికొచ్చింది.

"ఏమిటి మేడమ్? ఏమ్ జరిగినయ్" అడిగాడు మా ప్రెసిడెంట్ హమీద్‌మియా.

"ఆయనకు సడెన్‌గా గుండెనొప్పి వచ్చిందండీ! హార్ట్ ఎటాకేమోనని భయంగా ఉంది-"

షైనీ ఆమెను ఓదార్చింది.

"మీరేం బాధపడకండి! ఆయనకేం జరగదు- మేము కూడా హాస్పిటల్‌కొస్తాం-" అందామె.

అందరూ రాజారామ్‌ని అంబులెన్స్‌లోకి చేర్చాం.

షైనీ, విజయ్ యాదవ్, కృష్ణమూర్తి కూడా వాన్‌లో కెక్కారు. తీరా అంబులెన్స్

స్టార్ట్ చేసేసరికి వాన్‌లో రాజారామ్ భార్య జాన్సీ లేకపోవటంతో మళ్ళీ వాన్ ఆపేసింది షైనీ.

"ఇదిగో హమీద్‌గారూ! రాజారామ్‌గారి మిసెస్ జాన్సీని త్వరగా తీసుకురండి-" అంటూ అరిచింది.

వెంటనే నేనూ, శంకరమూర్తి మళ్ళీ రాజారామ్ ఫ్లాట్ దగ్గరకు పరుగెత్తాం. ఆ ఫ్లాట్ డోర్‌వేసి ఉండడంతో డోర్‌బెల్ మోగించాము. వెంటనే కన్నీళ్ళతో తలుపు తెరిచింది జాన్సీ-

"ఏమిటి మేడమ్? మీరింకా బయల్దేరలేదేం? అంబులెన్స్ వెయిట్ చేస్తోంది" అడిగాడు శంకరమూర్తి ఆదుర్దాగా.

ఆమె దుఃఖం ఇంకా ఎక్కువయింది.

ఇంకో అరగంటవరకూ నేను బయల్దేరలేనండీ! దయచేసి మీరే వెళ్ళి హాస్పిటల్లో అడ్మిట్ చేసేయండి-" అంది బ్రతిమాలుతూ.

"సరే అలాగే వెళ్తాంకానీ- అరగంటదాకా మీరెందుకు రాలేరు? ఎనీ హెల్త్ ప్రాబ్లెమ్? " అడిగాను జాలిగా.

"అబ్బే- అదేం కాదండీ! ఇప్పుడు నేను రోజూ చూసే టి.వి. సీరియల్ వచ్చేటైమ్- అది చూడకపోతే నేను బ్రతకలేను- అందుకని ఏమీ అనుకోకుండా మీరెళ్ళండి- అదిగో సీరియల్ స్టార్టవుతోంది" అంటూ తలుపు దభేల్‌మని వేసేసింది.

మేము షాకయి కిందకు పరుగెత్తుకెళ్ళి ఆ విషయం షైనీతో చెప్పాం- షైనీ కూడా షాకవుతూండగానే అంబులెన్స్ వెళ్ళిపోయింది.

వెనుకే మేము కూడా స్కూటర్ల మీద హాస్పిటల్‌కి చేరుకున్నాం.

డాక్టర్లు రాజారామ్‌ని పరీక్షించారు.

"హార్ట్ ఎటాకే- మైల్డ్‌గా వచ్చింది కాబట్టి బ్రతికిపోయాడు- అడ్మిట్ చేసేయండి" అన్నాడు డాక్టర్.

"డాక్టర్‌గారు- ఒక రిక్వెస్ట్" అన్నాడు రాజారామ్ ఇంకా బాధపడుతూనే.

"ఏమిటి? "

"టీవీ ఉన్న రూమ్ టీవీఇవ్వండి! లేకపోతే సీరియల్స్ మిస్సయిపోతాను-"

మాకు మతిపోయింది.

డాక్టర్ చిరునవ్వు నవ్వాడు.

"భలేవారే! ఆ సంగతి వేరే చెప్పాలా! అదివరకు టీవీలేని రూమ్స్‌లోని పేషెంట్స్- సీరియల్స్ చూడలేకపోయామే అన్న టెన్షన్‌తో చచ్చిపోతూండటం చూసి- ఇప్పుడు అన్ని రూమ్స్‌లో టీవీలు పెట్టాం! హ్యాపీగా చూసుకోండి-"

అప్పుడు రాజారామ్ మొఖంలోకి కళ వచ్చింది.

"థాంక్యూ డాక్టర్‌గారూ- అన్నట్లు అడగటం మర్చిపోయాను. నాకేమీ ప్రమాదం లేదు కదా? "

"లేదుగానీ- ఎందుకయినా మంచిది- కొత్తగా స్టార్టయ్యే టీవీ సీరియల్స్ చూడకండి! ఎందుకంటే సగం చూశాక మీకేమయినా అయిందనుకోండి! మీ ఆత్మకు శాంతి ఉండదు- ఆ రూమ్ నెంబర్ ఫోర్ సిక్స్ సెవెన్‌లో ఉండే పేషెంట్ ఇలాగే వద్దని చెప్పినా వినకుండా కొత్తగా స్టార్టయిన సీరియల్ చూడటం మొదలుపెట్టాడు. నూట పదహారో ఎపిసోడ్ వచ్చేసరికి సడెన్‌గా పోయాడు. పాపం ఆ కుటుంబం వాళ్ళు ఎన్నిరకాల శాంతులు చేసినాగానీ అతని ఆత్మశాంతిస్తేనా? అదిగోచూడండి! ఆ కాకి అతనే! రోజూ ఈ టైమ్‌కొచ్చి ఆ రూమ్ కిటికీమీద వాలి, ఆ రూమ్‌లో ఉన్న టీవీలో ఆ సీరియల్స్- యాడ్స్‌తో సహా- మొత్తం చూస్తుంది. సీరియల్ అయిపోయిన మరుక్షణం ఎగిరిపోతుంది-"

మా అందరికీ ఆ కాకిని చూస్తే జాలేసింది.

ఆ కాకి మాత్రం మమ్మల్నెవర్నీ పట్టించుకోకుండా కిటికీ రెక్కమీద వాలి లోపల టీవీలో వస్తోన్న సీరియల్ చూస్తోంది.

"నిజానికి ఆ రూమ్‌లో పేషెంటెవరూలేరు. అయినాగానీ ఆ కాకికోసం ఈ టైమ్‌కి టీవీఆన్ చేసి కిటికీ తెరచి ఉంచుతాం" చెప్పింది నర్స్.

సరిగ్గా అప్పుడే జాన్సీ హడావుడిగా వచ్చింది.

"థాంక్సండీ! సీరియల్ అయిపోగానే పరుగెత్తుకొచ్చాను- ఏమండీ! డాక్టర్లేమంటున్నారు? " రాజారామ్‌నడిగిందామె.

"కొత్తగా స్టార్టయ్యే సీరియల్స్ చూడొద్దంటున్నారు-"

"అలాగా- అలా చూడకుండా ఎలావదిలేస్తాం? ప్రాణం ఉసూరుమనదూ? "

"ఆ సంగతలా ఉండనీగానీ- ఇవాళ సీరియల్లో ఏమయింది? శ్రీకాంత్ మొదటి భార్య, అతను ఉంచుకున్న అమ్మాయీ కలుసుకున్నారా? శ్రీకాంత్ తండ్రెవరో- అతని తల్లికి నిజం తెల్సిందా? ఆమె కాలేజ్ డేస్ నాటి ప్రియుడు ఆమె ఇంటికొచ్చాడా? " అంటూ ప్రశ్నలతో ముంచెత్తాడు.

మేమిక మెల్లగా అక్కడినుంచి జారుకున్నాం-

ఎందుకంటే కోటేశ్వర్రావ్ ఇంట్లో పెళ్ళిచూపుల తతంగం ఒకటి ఉందికదా-

మేము మా అపార్ట్‌మెంట్స్ చేరుకునేసరికి అప్పటికే పెళ్ళివాళ్ళు కారు దిగుతూ కనిపించారు.

హమిద్‌మియా వారికి స్వాగతం చెప్తున్నాడు.

"మీరన్నీ పెళ్ళీ సూపుల్‌కీ వచ్చినయ్యని మాకెరుక ఉన్నయ్! వెల్‌కమ్. పదండి! కోటేశ్వర్రావ్ ఇంటికి వెళ్తావ్-" అన్నాడతను. అందరం కోటేశ్వర్రావ్ అపార్ట్‌మెంట్‌ని చేరుకున్నాం.




ఇంటి తలుపు బార్లా తెరచి ఉంది.

అందరం లోపలికెళ్ళాం.

హాల్లో ఎవరూ కనిపించకపోయేసరికి పెళ్ళివారిని సోఫాల్లో కూర్చోబెట్టి "కోటేశ్వర్రావ్! ఇలారా! వాళ్ళొచ్చేశారు" అన్నాడు శంకరమూర్తి.

రెండు నిమిషాలయినా ఎవరూ రాకపోయేసరికి హనుమంతు ఇంట్లో కెళ్ళాడు కోటేశ్వర్రావ్ కోసం-

అతనటు వెళ్ళగానే పని మనిషి హాల్లో కొచ్చింది మంచి నీళ్ళగ్లాసులతో-

"సార్, మంచినీళ్ళు తీసుకోండి. మీరు కాఫీ, టీ, కూల్‌డ్రింక్స్‌లో ఏది తాగుతారో చెప్తే తీసుకొస్తాను-" అంది పనిమనిషి.

పెళ్ళికొడుకు తండ్రి పద్మారావ్ మండిపడ్డాడు.

"ఆ సంగతి నువ్ చెప్పటమేంటమ్మా! కోటేశ్వర్రావ్‌గారూ, ఆయన మిసెస్ బయటకు రారేం? "

(మిగతా వచ్చేనెల )

# మోహినీ భస్మాసుర

- వసుంధర



సీతారామయ్య, భూపతి చిన్ననాటి స్నేహితులు. పేదవాడైనా గుణవంతుడైనందున సీతారామయ్యను మాలతి ప్రేమిస్తుంది.. అది భరించలేని భూపతి మిత్రుడిని వేటాడటమే లక్ష్యంగా పెట్టుకుంటాడు. ముందుగా సీతారామయ్యను ప్రేమించిన మాలతిని తనదారికి వచ్చేలా చేసుకుంటాడు. తర్వాత అతడి సంతానంపై కక్షగడతాడు. సీతారామయ్య, మాలతిల జీవితంలో అనేక సంఘటనలు భూపతి వాంఛించినట్లుగానే జరుగుతాయి. అయితే ఆశ్చర్యకరంగా తను సర్వనాశనం చేయాలనుకున్న సీతారామయ్య భూపతికి కొరకరాని కొయ్యలా మారతాడు. మిత్రుల సమరంలో చివరకు గెలిచేది ఎవరు? మనస్తత్వ చిత్రణకు అద్దంపడుతూనే ఎత్తుకు పైఎత్తులతో, ఆసక్తికర సంభాషణలతో సమ్మోహితుల్ని చేసే వసుంధర **మోహినీ భస్మాసుర** జూన్ చతురలో!

అది లంకంత కొంప. లంకలాంటి కొంప. దానికి యజమాని భూపతి. ఆగడాల్లో రావణాసురుణ్ణి మించిన ఆయన శక్తి సామర్థ్యాలలోనూ రావణుడికి తీసిపోడు. అందుకు ఆ ఇల్లే సాక్ష్యం.

ఇంటిని అద్దంలా ఉంచడానికి, ఇంట్లో అన్నీ అమర్చి పెట్టడానికీ చాలామంది పని వాళ్లున్నారు. వాళ్లందరికీ ఎప్పుడూ చేతి నిండా పని. ఇంటిచుట్టూ చెట్లు, పూలమొక్కలు, కాయగూరల పాదులు వగైరాలతో నిండిన పెద్దతోట. ఇంట్లోవాళ్లని తోటలోకి అనుసంధిస్తూ నాలుగువైపుల నుంచీ దారులు. తోటలో రెండు వాటాల ఔట్‌హౌస్. ఓ పోర్షన్లో తోటమాలి. రెండో దాంట్లో మొత్తం పనివాళ్లందరికీ చేతినిండా పనుండేలా చూసే సూపర్‌వైజరులాంటి కోటయ్య.

తోటలో ఓ పెద్దసైజు ఆల్సేషియన్ పహరా తిరుగుతుంటుంది. మొరగనప్పుడు సింహంలా ఉండే దానిని ముద్దుగా పుస్సీ క్యాట్ అంటాడు భూపతి. నిజంగా పిల్లి అనుకుంటారనేమో అది తరచుగా మొరుగుతుంటుంది. మొరిగే కుక్క కరవదని భ్రమపడి అపరిచితులెవరైనా గోడదూకి తోటలో ప్రవేశిస్తే వాళ్లని చీల్చి చెండాడే మర్యాద దానిది. దొరల్లా గేటునుంచి రావాలనుకునే వాళ్లు కూడా కొన్ని మర్యాదలు పాటించకపోతే దాని మర్యాదనుంచి తప్పించుకోలేరు.

అచ్చం అలాంటిదే మరో ఆల్సేషియన్ ఇంట్లో తిరుగుతుంటుంది. అన్ని మర్యాదలూ పాటించి లోపలికొచ్చినా సరే- ఇంట్లో కొత్తవాళ్లు అడుగిడితే చాలు పెద్దగా మొరిగి ఫస్ చేస్తుందని భూపతి దాన్ని ఫస్సీ క్యాట్ అంటాడు. మర్యాదల విషయంలో ఫస్సీ పుస్సీకి తీసిపోదు.

పుస్సీ, ఫస్సీలను దృష్టిలో ఉంచుకునే భూపతి ఆ ఇంటి గేటు వద్ద పటిష్ఠమైన సెక్యూరిటీ ఏర్పాటు చేసాడు. అడ్డమైన వాళ్లూ ఇంట్లో అడుగుపెట్టకుండా చూడ్డం మాత్రమే కాదు- గేటు దాటిన వారి క్షేమానికి సెక్యూరిటీదే బాధ్యత.

ఇంటి సెక్యూరిటీకి ఇన్ని ఏర్పాట్లున్నా- ఇంట్లో యజమానులనదగినవారంతా ఎక్కువగా ఇంటి బయటే ఉంటారు. కాబట్టి రక్షణ ఇంటికే అనుకోవాలి. లేదా భూపతికి పాపభీతి ఎక్కువనుకోవాలి. పాపభీతి ఉన్నవారికే దైవపూజలూ, రక్షణ ఏర్పాట్లూ అని తెలుసుకుందుకు రాజకీయ నాయకుల్నే కాదు, భూపతినీ చూడొచ్చు

భూపతి భార్య మాలతి. మధ్యతరగతికి చెందిన ఆమెను ఆయన ఏరికోరి చేసుకున్నాడు. కొన్నాళ్లామె కొంగుముడిలో ఉండి- తర్వాత ఆమెకి తనింట్లో తన హోదాకి తగినట్లు మసిలేలా శిక్షణనిచ్చాడు. అలా మాలతి పనివాళ్లపై అజమాయిషీ నేర్చుకుంది. ముగ్గురు పిల్లలకి జన్మనిచ్చినా వాళ్ల సంరక్షణ బాధ్యతలో ఎక్కువభాగం పనివాళ్లకే అప్పజెప్పింది. తమ హోదాకి తగినట్లు ఎక్కువ సమయాన్ని క్లబ్బుల్లోనూ, వాటిద్వారా సమాజసేవా కార్యక్రమాల్లోనూ వినియోగిస్తుంది. అందుకని ఆమె క్రమంగా ఇంటికంటే బయటే ఎక్కువ సమయం గడుపుతుంది.

తన కొడుకులయిన ఈశ్వర్, త్రినాథ్‌ల పెంపకంలో భార్యకి పూర్తి స్వేచ్ఛనిచ్చాడు భూపతి. చదువు విషయమెలాగున్నా- వారి లక్ష్యం తండ్రి వ్యాపారాల్లో భాగస్వామ్యమే. గ్రాడ్యుయేట్లనిపించుకుని వ్యాపారంలో దిగారు. తండ్రి ఎన్నిక చేసిన పిల్లల్నే పెళ్లి చేసుకున్నారు.

ఈశ్వర్ భార్య లత, త్రినాథ్ భార్య గీత- చదువు, తెలివి, వ్యక్తిత్వం ఉన్నవారే. ధనం, హోదా ఇచ్చిన అహంతో తమ పరిధిలో వేరే వ్యాపారాలు ప్రారంభించి తమ

సామర్థ్యాన్ని నిరూపించుకున్నారు. అందుకని భూపతి కొడుకులూ, కోడళ్లు కూడా ఎక్కువగా ఇంటి బయటే ఉంటారు. భూపతి కూతురు ఉమ. ఆమె భర్త ఉమేష్ ఇల్లరికపుటల్లుడుగా వచ్చి పేరు సార్థకం చేసుకున్నాడు. భార్యకొంగు పట్టుకుని వదలడు. ఇంటిల్లిపాదినీ అనుసరించకపోవడం చిన్నతనమని తనూ ఇంటి బయటే ఉంటుంది ఉమ. భర్త ఆమె కొంగుననుసరించాడు. ఆ విధంగా వాళ్లూ ఇంటి బయటే ఉంటారు. బయట వాళ్లేం చేస్తారో వాళ్లకే తెలియదని మాలతి అనుకుంటుంది. అయినా ఏం చేస్తున్నారని ఎవరూ వాళ్లని అడగరు. డబ్బు విషయంలో ఆ ఇల్లొక అక్షయపాత్ర.

బయట భూపతికి వినబడేవి వందిమాగధుల స్తోత్రాలు, పాదాక్రాంతులైన శత్రువుల హాహాకారాలు. కనబడేవి అస్మదీయుల ముఖాల్లో అభివందనలు, తస్మదీయుల ముఖాల్లో భయాందోళనలు. వ్యాపార రంగంలో దిగేక- పరాజయం, పరాభవం తననించే తప్ప, తనకీ అవి ఉండొచ్చన్న ఊహకూడా రాని విధంగా యాభైఆరో ఏట అడుగుపెట్టిన భూపతి ఆలోచనల్లో ఒక్కసారిగా మార్పొచ్చింది- ఉన్నట్టుండి ఒకరోజు ఛాతీలో ఎడమవైపు నొప్పిగా అనిపించడంతో!

ఆ రోజు భూపతి తన ఆఫీసులో ఫోన్లో మాట్లాడుతూ నొప్పి అనిపిస్తే మామూలుదే అనుకుని అలక్ష్యం చేసాడు. అది క్షణాల మీద పెరిగి పెద్దదై నోటమాట కూడా రాకపోతుంటే - అది కనిపెట్టిన చప్రాసీ- ముందు అయినవాళ్లకీ, తర్వాత హాస్పిటల్‌కీ ఫోన్లు చేస్తే అయినవాళ్లకంటే ఆంబులెన్సే ముందొచ్చింది. అప్పటికి భూపతికి స్పృహలేదు.

భూపతి హాస్పిటల్లో ఓ రోజంతా ఉన్నాడు. ఆ ఒక్కరోజులో ఆయన్ని చూడవచ్చిన జనాన్ని చూసి హాస్పిటల్‌కి విజిట్‌కొచ్చిన ఆరోగ్యవంతులక్కూడా కళ్లు తిరిగాయి. ఓ డాక్టర్‌కి స్పృహ తప్పింది. భూపతి కుటుంబం ఆ రోజంతా హాస్పిటల్లోనే ఉంటే వాళ్లందర్నీ ఒక్కచోట చూసిన అద్భుతానికి బంధువర్గంలోనూ కొందరికి స్పృహ తప్పింది.

పరామర్శ భూపతికి కొత్త అనుభవం. తన ఆరోగ్యం గురించి పట్టించుకునేవారు- ఇంటా బయటా ఇంతమందున్నారని గ్రహించి ఆయన మనసులో తెగ మురిసిపోయాడు.

డాక్టర్లాయనకు గుండెజబ్బని శంకించి కొన్నాళ్లు హాస్పిటల్లోనే ఉండమన్నారు. వాళ్ల నిర్ణయానికి తన స్థితిగతులు కూడా కారణం కావచ్చని అనుమానించిన భూపతి- నిర్ణయాన్ని మాలతికి వదిలేసాడు. ఇలాంటి విషయాల్లో ఆమె నిర్ణయాలపై ఆయనకి విపరీతమైన నమ్మకం.

పరిస్థితేమిటని మాలతి డాక్టర్లనడిగింది. వాళ్లాయనకి పని ఒత్తిడి ఎక్కువైందని, కొన్నాళ్లు ఇంటి పట్టునే ఉండి ఇతర విషయాలు పట్టించుకోకుండా మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలన్నారు. లేకుంటే ప్రాణ ప్రమాదమన్నారు. ఇంటి దగ్గర విజిటర్స్‌ని అదుపుచేయడం - కష్టం కాబట్టి కొన్నాళ్లాయన్ని హాస్పిటల్లో ఉంచడమే మంచిదన్నారు.

"విజిటర్స్‌ని అదుపు చేయడం ఇంట్లోనే సులభం" అంటూ మాలతి తమ ఇంటి సెక్యూరిటీ గురించి వివరించింది. తమ ఫామిలీ డాక్టర్ జయశంకర్ పర్యవేక్షణలో భూపతికి ఏ లోటూ జరగకుండా చూసుకోగలమని, ప్రతిరోజూ హాస్పిటల్‌తో కాంటాక్టులో ఉంటామనీ నచ్చజెప్పింది. డాక్టర్లు సరేనని, భూపతికి బెడ్‌రెస్ట్ కావాలని మరీ మరీ హెచ్చరించారు.

మామూలుగా రెస్ట్ అన్న మాట వింటేనే

మండిపడే భూపతికి బెడ్‌రెస్ట్! ఇప్పుడు భూపతి దానికొప్పుకున్నందుకు ప్రాణభయ మొక్కటే కారణం కాదు. ఇంట్లో పనివాళ్ళు, సుఖాన్నీ, వినోదాన్నీ ఇచ్చే బోలెడు సదుపాయాలు.. ఇవన్నీ అనుభవించే యోగం ఇప్పటికొచ్చిందని మురిసాడాయన.

ఇంట్లోకి మారేక భార్య దగ్గరుండి కంటికిరెప్పలా చూసుకుంది. మిగతా పెద్దలు వంతులవారీగా పక్కనుంటూ ధైర్యం చెప్పారు. మనుమలు, మనుమరాండ్రు తమ పరిధిలోని ఆహ్లాదకరమైన విశేషాలెన్నింటినో పంచుకున్నారు.

భూపతికి తన కుటుంబంతో అంతవరకూ లేని అసలుసిసలు సాన్నిహిత్యమేర్పడింది. తనవారి మాటలు, భావాలు, విజయాలు, ఆత్మీయత అన్నీ ఆయన్నీ రంజింపజేసాయి.

"అదృష్టమంటే నాది. నా వాళ్లంతా నా అంతటివాళ్లయ్యారు. నన్ను అమితంగా ప్రేమిస్తున్నారు" అనుకున్నాడు ఆయన. ఆ తృప్తితో ఆయన ఆరోగ్యం తొందరగా మెరుగుపడింది. డాక్టర్ జయశంకర్ రోజూ రెండుపూటలా వచ్చి ఆయన్ని చూసి వెడుతున్నాడు. ఇంటికొచ్చిన మూడో రోజే, "మీరిక ఇంటిపట్టునే ఎక్కువగా గడపాలేమో" అన్నాడు నవ్వుతూ.

తన ఆరోగ్యం దిగజారిందేమోనని కలవరపడ్డ భూపతి- తల అడ్డంగా ఊపి, "నాకిప్పుడు మునుపటికన్నా ఆరోగ్యంగా అనిపిస్తోంది. మనసైతే మరింత ప్రశాంతంగా ఉంది" అన్నాడు.

"అదే నేనూ చెప్పేది. వయసుని బట్టి మనిషి మనసూ మారుతుంది. మీరిక ఇంటి బయట కాక ఇంట్లో గడపడం వల్ల ఎక్కువ సంతోషంగా ఉంటారనిపిస్తోంది. గుండెపోటు రాకముందు కూడా మీ బ్లడ్ ప్రెషర్ ఇంత నార్మల్‌గా లేదు" అన్నాడు జయశంకర్.

డాక్టర్ అంతరార్థం తెలియగానే భూపతి తేలిగ్గా నిట్టూర్చాడు. జయశంకర్ తనని ఉల్లాసపర్చడానికే అలాగనుండొచ్చనిపించినా- ఆ మాటల్లోని నిజమిప్పుడాయనకి స్వానుభవం. గతంలో ఎన్నోసార్లు వేదిక మీద పూలదండలు, శాలువలు వగైరాలతో సన్మానాలందుకున్నా- అప్పుడు కలగని ఉత్సాహానందాలు ఈ కొద్ది రోజుల్లోనే ఆయన అనుభూతికి వచ్చాయి.

"ఇది నా జీవితంలో కొత్త మలుపు. మాలతికి చెప్పాలి" అనుకున్నాడు. మలుపుమాట నిజమే కానీ అది తాననుకున్నది కాదని అప్పుడాయనకు తెలియదు.

★ ★ ★

"ఇలా బాగుంది. కొన్నాళ్లిలాగే మీరు నాతో ఉండాలి" అన్నాడు భూపతి తనవారితో. మామూలుగా ఆ ఇంట్లో భూపతి మాట శిలాశాసనం. కానీ అందరికీ రొటీన్ వ్యవహారాలు, ఏవేవో కమిట్‌మెంట్సు, అలవాట్లు, సరదాలు. ఎంత ప్రయత్నించినా, భూపతికోసమే అయినా మూర్రోజులకి మించి వాటికి దూరం కాలేరు వాళ్లు. అదే ఆయనకు చెప్పాలనుంది. పిల్లిమెడలో గంటెవరు కడతారని చూస్తుంటే- మాలతి ముందుకొచ్చి, "నెల్లూరు వరద బాధితులకి సహాయం అర్జంటు. అంతా నా కోసమే వెయిటింగు. ఇప్పటికే మూర్రోజులు లేటు. నేను వెళ్లక తప్పదు" అంది.

"సరే కానీ- ఒక్కరోజులో వచ్చేయాలి" అన్నాడు భూపతి ఆజ్ఞాపిస్తున్నట్లు.

"అబ్బే- కుదరదు. కనీసం నాలుగురోజులు" అంది మాలతి కృతనిశ్చయం ధ్వనించేలా.

అగ్నిసాక్షిగా పెళ్లాడి, వేదమంత్రాల నేపథ్యంలో కలిసి ఏడడుగులు నడిచి, అయినవాళ్లందర్నీ శాశ్వతంగా విడిచి, భర్తే శాశ్వతమనుకుని వచ్చిన మాలతే అలా అనగానే- మనుమలు, మనుమరాండ్రతో సహా

మిగతా వాళ్లకీ ధైర్యమొచ్చేసి- తమకున్న కారణాలింకా బలమైనవని తేల్చారు. తనతో ప్రారంభమైన కథలో ఇంటిల్లిపాదీ పాత్రధారులైనందుకు నొచ్చుకున్న మాలతి, "ఇంతమందిముండి ఆయనను ఒంటరిగా వదిలేస్తామా? " అంది.

"మంచం దిగకుండా టీవీ చూడొచ్చు. సంగీతం వినొచ్చు. పుస్తకాలు చదవొచ్చు. ఎవరక్కడ అంటే చాలు అడుగులకు మడుగులొత్తే సేవకులున్నారు. ఆయనకి మన అవసరం లేదు. ఏదో మన తృప్తికోసం మూడ్రోజులు దగ్గరున్నామంతే!" అన్నాడు ఈశ్వర్.

వెంటనే త్రినాథ్, "నాన్నకి సమయం విలువ తెలుసు. మనమంతా తన చుట్టూ ఉంటే- అది మన వ్యాపారానికి నష్టమను కోడూ" అంటూ తన అభీష్టాన్ని తండ్రి అభీష్టంగా మార్చాడు.

నిజమనుకున్నాడు భూపతి. తనకోసం ఎవరూ ఎవరి పనులూ మానకూడదు. అయినా కాలక్షేపానికి తనకున్నవి ఒకటా రెండా- ఎన్నో ఉపకరణాలు.

సరేనన్న భూపతికి- ఒంటరిగా ఓ గంట గడిపేసరికి- తన రుచులు, అభిరుచులు లలితకళలు సరిపడవని తెలిసిపోయింది. అలా రెండ్రోజులు గడిచేసరికి మరో విషయం స్పష్టమయింది. ఎన్ని ఆధునిక సదుపాయాలున్నా, ఎంతమంది సేవకులున్నా తనవాళ్లకు తనవాళ్లే సాటి!

తన మూడ్రోజుల అపూర్వానుభూతిని శాశ్వతం చేసుకునేలా- జీవన విధానం మార్చుకోవాలనుకున్న భూపతి, "ఇన్నాళ్లూ నేనో యంత్రాన్ని.. ఇక మనిషిలా జీవించాలి" అనుకున్నాడు.

నిజానికి మనిషితో సహా ఈ సృష్టిలోని జీవులన్నీ యంత్రాలే. యాంత్రికతని పరిమితం చేస్తేనే మనిషి మనిషనిపించుకుంటాడు. లేకుంటే మనిషీ జంతువే!

ఇది గ్రహించిన భూపతిలో- నేనెందుకు జంతువునయ్యానన్న తర్కం మొదలై- గత జీవితంలోని యాంత్రికతతోపాటు- ఇంకేవేవో కూడా గుర్తుకు రాసాగాయి.

జంతువు- దానికి ఆశయాలుండవు. ఆదర్శాలుండవు. మనుగడ- అదొక్కటే దానికి ముఖ్యం. మనుగడ కోసం ఏమైనా చేస్తుంది. ఆహారం దొంగిలిస్తుంది. మరో జంతువును హింసిస్తుంది.

హింస - హింసకు పాల్పడే జంతువుని క్రూరజంతువంటారు. క్రూరజంతువు ఆహారాన్ని వేటాడి సంపాదించుకుంటుంది.

వేట- సాధు జంతువునీ, క్రూరజంతువునీ విడదీసే పదమది.

నాగరికత మనిషికి వేట అవసరం లేకుండా చేసింది. అయినా మనిషి వేటాడ్డం మానలేదు. వేటాడే మనిషిని నిర్వచించడానికి క్రూరజంతువు అన్నది చాలా చిన్నపదం.

క్రూరజంతువు... వేట...

ఒంటరితనం భూపతికి ఏమేమో గుర్తు చేసే ప్రయత్నాలు చేస్తోంది. ఆ జ్ఞాపకాల దొంతరను కదపడం ఆయనకిష్టం లేదు. అందుకని పుస్తకం తీసాడు.

భగవద్గీతపై వ్యాఖ్యానం- అది కాస్సేపు పనిచేసింది.

'చేసేది నువ్వు. చేయించేది నేను' అన్న భగవానువాచ చదివి ఇదేదో బాగానే ఉందని తృప్తిపడ్డా అంతలోనే దేవుడు చెప్పినవే చేసినా అర్జునుడు తప్పులకి శిక్ష అను

## కొత్తగాలి...

**సెలయేరు**
**అడవి కన్నె వేసుకున్న**
**తెల్లని పైట**

-అద్దంకి శ్రీనివాస్,
సెంట్రల్ యూనివర్సిటీ

## కొత్తగాలి...

**మనస్సు చిగుళ్లు తొడిగింది మధుమాసమని**

– ఆత్రం శశికిరణ్,

రాజారాంపల్లి, కరీంనగర్ జిల్లా

భవించడానికి కారణం కర్మఫలం అని స్ఫురించింది. అందుకే ప్రతి మనిషీ, 'దేవుడా! నా చేత మంచి చేయించు. చెడు చేయించకు' అని కోరుకోవాలి.

భూపతి పుస్తకం మూసి రిమోట్‌తో టీవీ ఆన్ చేస్తే- చిరంజీవి. చిన్నప్పుడు తనకన్యాయం చేసినవాణ్ణి పెద్దయ్యేక వెతుక్కుంటూ వెళ్ళి సర్వనాశనం చేసాడు.

ఛానెల్ మార్చితే- భాష మారి అమితాబ్ బచ్చన్ కనిపించాడు. థీమ్ అదే- అన్యాయానికి ప్రతీకారం. న్యాయానికి అంతిమ విజయం. తప్పు చేసినవాడికి శిక్ష తప్పదని సందేశం.

భూపతి టీవీ ఆఫ్ చేసి- సంగీతాన్నాశ్రయిస్తే- నిధి చాల సుఖమా..త్యాగరాజు..

నీ పాపం పండెను నేడు... పాత సినిమా పాట.

భూపతి ఆడియో ఆపి అప్రయత్నంగా "మాలతీ!" అన్నాడు.

ఆయనకి తెలుసు ఆమె ఇంట్లో లేదని. ఐనా పిలవాలనిపించింది. అలాగే తనవాళ్ళని ఒకొక్కరినే పేరు పేరునా పిలిచాడు. తన పుణ్యాలకి ప్రగతి సాధిస్తున్న తన వాళ్ళు కనబడితే తనలో పాపభీతి ఉండదని ఆయనకి అనిపిస్తోంది.

ఒంటరితనం ఆయనకిచ్చిన అనుభూతి పాపభీతి! అది నాలుగు రోజులు వేధించేక మాలతి వచ్చింది. ఆమెని చూస్తూనే, "నిన్ను చాలా మిస్సయ్యాను మాలతీ!" అన్నాడాయన.

"నేనూ మిమ్మల్ని మిస్సయ్యాను. కానీ మన పాపాల్ని పూర్తిగా మిస్ చేసేటన్ని పుణ్యకార్యాలు నా చేతులమీదుగా జరిగాయి నాలుగు రోజుల్లో. మీరు త్వరగా కోలుకుంటారు" అందామె.

"అంటే మనం పాపాత్ములమంటావ్!" అసంతృప్తిగా అన్నాడు భూపతి.

"ఈ ప్రపంచంలో పాపాలు చెయ్యనిదెవరు? పాపం చేయడం తప్పుకాదు. దాన్ని కడగాలనుకోకపోవడం తప్పు" అంది మాలతి.

"నీ అభిప్రాయంలో నేను చేసిన పాపమొక్కటి చెప్పు" గుచ్చి గుచ్చి చూస్తూ అడిగేడాయన.

"అయ్యో! నేను మీ గురించి కాదు. నా గురించి అంటున్నా" అంది నొచ్చుకుంటూ.

"నువ్వు పాపం చేసావా? ఐతే మరి గుండెపోటు నాకొచ్చిందేం?" అన్నాడు భూపతి.

"మగాడి తప్పుకి అతడి భార్యను అవమానిస్తారు రాక్షసులు- ఆడదాని అవమానమే ఆమె భర్తకి శిక్షని! దేవుడైతే ఆడదాని తప్పుకి ఆమె భర్తని శిక్షిస్తాడు- ఆ శిక్షే ఆమెకి అవమానమని".

"ఎంత బాగా చెప్పింది?" అనుకున్నాడు భూపతి. తను పోతే మాలతి విధవ. ఆపైన జీవితమంతా ఆమెకి అవమానం. అందుకే భర్త శ్రేయస్సుకి తన జీవితాన్నే అంకితం చేస్తుందామె.

"నా గుండెపోటుక్కారణం నా పాపమే ఎందుక్కాకూడదు?" అన్నాడు భూపతి.

"పాపం ఎవరిదైనా శిక్ష నాకే! కాబట్టి మీ శ్రేయస్సు కోరి పుణ్యకార్యాలు చేస్తున్నా"

ఈ సమాధానానికి నిరుత్సాహపడ్డ భూపతి "మీరేం పాపం చేసారండీ- అంటావనుకున్నాను. నీ భర్త పాపం చేసాడంటే ఒప్పుకోవనుకున్నాను" అన్నాడు.

మాలతి తమాషాగా నవ్వి, "మీరేం

పాపం చేసారండీ- అనాలనీ అనుకున్నాను. కానీ మీరొప్పుకుంటారా? గతంలోకెళ్ళి ఏమేమో ఏకరువు పెడతారు. నాకది నచ్చదు. అందుకే మాట తప్పించాను. ఐనా ఇప్పుడీ విషయమై వాదనలెందుకు? మీ వంట్లో ఎలా ఉంది? " అంది.

"ఇప్పుడు నేను పూర్వంకంటే ఆరోగ్యంగా ఉన్నాను. అందుకే పూర్వంలా ఒక్కణ్ణీ ఉండలేకపోతున్నాను. ఇక మీదట రోజూ మనమంతా కలిసి ఇంట్లో సరదాగా గడపాలి" అన్నాడు భూపతి.

"బెడ్ రెస్ట్ మీచేత అలా అనిపిస్తోంది" అంది మాలతి నమ్మలేనట్లు.

"లేదు మాలతీ! కూర, పచ్చడి పులుసు మొహం మొత్తొచ్చు. కానీ అన్నం మొహం మొత్తదు కదా. ఆత్మీయత అలాంటిది"

"అయితే ఏమంటారు? "

"హాస్పిటల్నించి ఇంటికొచ్చేక మూడు రోజులు స్వర్గం చూసాను. అదే స్వర్గం రోజూ కావాలి"

"అది అనుకోకుండా జరిగింది"

"నువ్వనుకుంటే అదిప్పుడు జరుగుతుంది"

మాలతి ముందాయన మాటలు తేలిగ్గా తీసుకుంది. కానీ ఆజ్ఞాపించడం తప్ప అర్థించి ఎరుగని ఆయన వేడుకోలు ఆ మాటల బరువు పెంచగా తనవాళ్ళందరికీ విషయం చెప్పిందామె.

భూపతి ఆ ఇంటి నియంత. అంతవరకూ ఎవరి స్వేచ్ఛనీ హరించకపోయినా కావాలంటే చండశాసనుడు కాగలడు. ఆయన మాటకు విలువివ్వకపోతే ఇంట్లో ఎమర్జెన్సీ వచ్చినా రావచ్చు. అందుకని అంతా కలిసి ఓ అవగాహనకొచ్చారు. ఆ ప్రకారం రోజూ ఉదయం ఓ గంటా, రాత్రి ఓ గంటా కలిసి గడపడానికి కుటుంబసభ్యులంతా వీలు చేసుకోవాలి. కానీ ఎవరి కమిట్‌మెంట్సు వారికున్నాయి కాబట్టి ఈ నిర్ణయాన్ని అమల్లోకి తేవడానికి కనీసం నెలరోజుల గడువు అవసరం.

మాలతి భర్తకీ విషయం చెప్పి, "ఎందరికో జీవితాన్నిచ్చారు. కానీ ఇంతకాలం మీకంటూ జీవితం లేదు. తనవాళ్ళతో గడిపేదే అసలు సిసలు జీవితమని మీరు గ్రహించడం నా అదృష్టం. నేనూ త్వరగా బయటి కమిట్‌మెంట్సునించి బయటపడతాను. ఎల్లకాలం మనమందరం కలిసి గడిపేందుకు ఏర్పాట్లౌతున్నాయి. కొన్నాళ్ళు ఓపిక పట్టండి" అంది.

వ్యాపారవేత్తగా నిదానానికి పెట్టింది పేరనిపించుకున్న భూపతికీ విషయంలో ఆత్రాన్నాపుకోవడం కష్టమనిపించినా- మాలతి మాటలు చాలా ఊరటనిచ్చాయి.

మాలతి పతివ్రత. భర్త పుణ్యాత్ముడని నమ్ముతూ, తను పాపాత్మురాలినని శంకిస్తూ, పాపాల్ని కడగడం భర్త శ్రేయస్సుకి అవసరమనుకుని- సమాజసేవ చేస్తోంది. అలాంటి ఇల్లాళ్ళవల్లనే ఎన్నో కుటుంబాలు సుఖంగా ఉంటున్నాయి.

మాలతి గురించి ఆలోచిస్తూంటే మళ్ళీ తన గురించిన ఆలోచనలూ వచ్చాయాయనకి. మాలతి తనని పుణ్యాత్ముడంది. నిజంగా తను పుణ్యాత్ముడేనా?

ఆమె తను పాపాలు చేయలేదంది. నిజంగా తను పాపాలు చేయలేదా?

"మూర్ఖుడా! నువ్వేకాదు. ప్రతి మనిషీ పాపాలు చేస్తాడు. కానీ నువ్వు మనిషివి కాదు. రాక్షసుడివి. ఎందుకంటే నువ్వు సగటు మనిషికంటే చాలా ఎక్కువ పాపాలు చేసావు, చేస్తున్నావు. అది నీకు తెలుసు" అంది అంతరాత్మ.

అంతరాత్మకీ, మనసుకీ ఉన్న భేదమిదే. మనసు- మనిషిలో అణుమాత్రం మంచి ఉన్నా ఎలాగో వెతికిపట్టి వెలికితీసి భూతద్దంలో చూపిస్తుంది. అదేపని చెడు విషయంలో చేస్తుంది అంతరాత్మ. సాధార

ణంగా మనిషి మనసుకు ప్రాధాన్యమి స్తాడు. అంతరాత్మని పట్టించుకోడు.

"నేను పాపాత్ముణ్ణా? " మనసునడిగాడా యన.

"కాదు" అంది మనసు వెంటనే.

"మనసుని కాదు, నన్నడుగు చెబు తాను" అంది అంతరాత్మ.

"నేను రాక్షసుణ్నన్నావ్. రాక్షసులకి అంతరాత్మ ఉంటుందా? " అన్నాడు.

"అంతరాత్మ అందరికీ ఉంటుంది. దాని మాట వింటే మనిషి, లేకపోతే రాక్షసుడు. నువ్వెప్పుడెప్పుడు నా మాట వినలేదో గుర్తు చేయనా? " అంది అంతరాత్మ పట్టు దలగా.

"వద్దు" భయంగా అన్నాడు భూపతి. తర్వాత నెమ్మదిగా అంతరాత్మని అణచి వేసి, "పోనీ నేను పాపాలు చేసానే అను కుందాం- వాటి నుంచి బయటపడే మార్గ మేమిటి? " అన్నాడు మనసుతో.

"నీ భార్య మాలతి నడిచే మార్గాన్ననుస రించు" అంది మనసు.

మనసుకీ తన వ్యవహారం నచ్చలేదనీ, అంతరాత్మలా కాక అది కాస్త సున్నితంగా చెప్పిందనీ గ్రహించిన భూపతికి మాలతి మంచిదనీ, మంచి పనులు మాత్రమే చేస్తుందనీ తెలుసు.

"మంచికి శ్రీకారం ఎలా చుట్టాలి? " భూపతిలో ఆలోచన మొదలైంది.

ఆ విషయంలో తనవంటివారికున్న మార్గాలు రెండు. ఒకటి- చేసిన తప్పులు దిద్దుకోవడం. రెండు- కొత్తగా మంచి పనులు మొదలెట్టడం.

"చేసిన తప్పులు దిద్దుకోవడానికి గతం తవ్వాలి. గతం తవ్వితే- అంతరాత్మే కాదు మనసు కూడా తనని రాక్షసుడనగలదని ఆయనకి గతం తవ్వడం ఇష్టం లేదు. అదీ కాక మనసు మాలతి మార్గాన్ననుసరించ మంది. మరి మాలతి తప్పులు దిద్దుకోదు. కొత్త కొత్త మంచి పనులు చేస్తుంది.

ఐతే మాలతి విషయం వేరు. తప్పు చెయ్యదు కాబట్టి దిద్దుకోవాలన్న ఆలోచనే రాదామెకి.

మరి తను చాలా తప్పులు చేసాడు. అసలు మాలతి విషయంలోనే తప్పు చేసాడు.

"మైగాడ్! నా ఆలోచనలీ దారికి మళ్ళా యేమిటి? "అనుకున్నాడు అసంతృప్తిగా.

"కాసేపు నీ ఆలోచనలు ఆపి ఏదైనా పుస్తకం తీయ్" అంది మనసు అతడికి వేరేదారి చూపిస్తూ.

"మనిషికి మంచి పుస్తకానికి మించిన మందులేదు. అది మనిషి ఆలోచనల్లో ఆరోగ్యాన్ని నింపుతుంది. ఆలోచనే మనిషి శరీరారోగ్యాన్ని శాసిస్తుంది" అంటూ మాలతి తన అభిరుచికి తగిన కొన్ని మంచి పుస్తకాలాయన పక్కన పెట్టింది. వాటిలో కొన్ని వేదాంత గ్రంథాలు. కొన్ని ప్రణయ కావ్యాలు. కొన్ని పిల్లల కథలు. కొన్ని జీవితానుభవాన్ని కాచి వడబోసిన వారి అనుభవాలు.

భూపతికి సాహిత్యంపై అభిరుచి లేదు. కానీ మాలతి అభిరుచిపై గౌరవముంది.

మనసు చెప్పిందని అనాసక్తంగా ఓ పుస్తకం తీస్తే- అదేమిటో చూసేలోగా పక్కనున్న టెలిఫోన్ మోగింది. పుస్తకాన్ని తీసినచోటే ఉంచి, చేయిజాపి రిసీవరందు కుని, "హలో!" అన్నాడాయన.

"హలో భూపతీ- నువ్వేనా? నేను- సీతారామయ్య"

"సీతారామయ్యా అంటే ఎవరు? " అన్నాడు భూపతి.

"నన్నే మర్చిపోయావా? "

"ఎందుకంత ఆశ్చర్యం? గుర్తుండడానికి నువ్వేమైనా మినిస్టరువా? గవర్నరువా? " అహం ధ్వనించింది భూపతి గొంతులో.

"ఆశ్చర్యమా? నిజంగా నువ్వు నన్ను

మర్చిపోతే- నాక్కలిగేది ఆనందం"

"ఇంతకీ ఎవర్నువ్వు? "

"అంటే నువ్వు నన్ను మర్చిపోవడం నిజం. ఆనందపారవశ్యం నన్నావహించింది. ఇప్పుడు టైం తొమ్మిదిన్నర కదా! ఓ అరగంట తర్వాత మళ్ళీ ఫోన్ చేస్తాను. అప్పటికి నేను గుర్తొస్తే సరేసరి. లేకుంటే ఇంకెప్పుడూ ఫోను చేయను" కట్టయింది ఫోను.

"హలో హలో..." అన్నాడు భూపతి. తర్వాత నిట్టూర్చి ఫోన్ పెట్టేసాడు.

"సీతారామయ్య..." అనుకున్నాడు భూపతి. ఆ పేరు తనెలా మర్చిపోతాడు.

★ ★ ★

"నాకిక చదవాలని లేదు" అన్నాడు భూపతి.

"నీకేం- అయినింటి బిడ్డవి. ఏం చదివినా దిగేది వ్యాపారంలోకే కదా" సీతారామయ్య నవ్వాడు.

"చదువు మానాలని అనుకుంటున్నది వ్యాపారం కోసం కాదురా, ప్రేమకోసం!"

"ప్రేమా? నువ్వెవర్నో ప్రేమించడమా- నేను నమ్మను" అన్నాడు సీతారామయ్య.

"నిజం చెబుతున్నా. నేనో అమ్మాయిని ప్రేమించా"

"అమ్మాయిని కాకపోతే నన్ను ప్రేమిస్తావనుకుంటానా? ఆ అమ్మాయి కూడా ఎవరో చెప్పగలను. ఏ పెద్ద భూస్వామికో, పారిశ్రామికవేత్తకో ఏకైక గారాల పుత్రిక అయ్యుంటుంది. గాలమేస్తున్నావ్. అమాయకురాలేమో- నీ మాటలకు పడిపోయుంటుంది. ఆల్ ది బెస్ట్!"

"థాంక్స్. ఆల్ ది బెస్ట్ చెప్పినందుకు" అన్నాడు భూపతి.

"చూడరేయ్- ఐదోతరగతి నుంచీ క్లాస్‌మేట్స్‌మే మనం. అంతస్తు పెరిగిన కుటుంబం నీది. అంతస్తు పెంచాలనుకుంటున్న కుటుంబం నాది. అంతస్తులతో నిమిత్తం లేకుండా పెరుగుతున్న స్నేహం మనది. ఏ విషయంలోనైనా నీకు నేను ఆల్ ది బెస్ట్ చెబితే అందుకు థాంక్స్ చెప్పాలా? "

భూపతి వెంటనే బదులివ్వలేదు. సీతారామయ్య భూపతినే చూస్తూ ఆలోచనలో పడ్డాడు.

భూపతి అసలు సిసలు వ్యాపారి. మాటలు కూడా పెట్టుబడే అన్నట్లు తూచి తూచి వాడతాడు.

భూపతి తనకి థాంక్సు చెప్పడాన్ని తేలిగ్గా తీసుకుందుకు లేదనకుని, "చెప్పరా- ఏ విషయంలోనైనా నీకు నేను ఆల్ ది బెస్ట్ చెబితే అందుకు థాంక్స్ చెప్పాలా? " రెట్టించాడు సీతారామయ్య.

భూపతి మిత్రుడి భుజం తట్టి, "నీ

## ఆరుద్ర చతురోక్తులు



అంత్య ప్రాసల ముద్ర, నవ్యతలో నయాగరా అనిపించుకున్న ఆరుద్ర వర్ధంతి జూన్ 4ను పురస్కరించుకుని ఆ సరస చమత్కారి చతురోక్తులు కొన్ని మీకోసం...

**వర్జించతగింది!**

అలవాటుగా మారిన ధూమపానాన్ని కొన్నేళ్ళ తర్వాత మానేశారు ఆరుద్ర. కారణమేంటని ఎవరో అడిగితే 'వర్జీనియా (పొగాకు) అంటే ఏమిటి? వర్జించ తగింది అనే కదా. అందుకే దాన్ని వదిలేశా' అని బదులిచ్చారాయన.



**మరో సందర్భంలో-**

ఆరుద్ర: నేనిప్పుడు సిగరెట్లు మానేశాను.

ముళ్ళపూడి: నేనైతే చాలాసార్లు మానేశా.

**కొత్తగాలి...**

**కొందరి తెలివి**
**ఇసుకలో విత్తనం**
**ఖర్జూరమై పండు రోజు**
**రాక పోదు...**

*- కె.ఆర్.వి.వి. రత్నకుమారి, హైదరాబాద్*

సంగతి నాకు తెలుసు. నువ్వు నాకంటే తెలివైనవాడవనీ, ఆలోచించకుండా ఏ పనీ చేయవనీ నా నమ్మకం. నువ్వనే ప్రతి మాట వెనుకా ఎంతో ఆలోచనుంటుంది. అలాంటి నీ శుభాకాంక్షలు నా ప్రేమకీ బలాన్నిస్తాయి థాంక్స్ చెప్పినందుకు" అన్నాడు.

"కానీ నీ ప్రేమకు కావలసింది నా శుభాకాంక్షలు కాదు. మీ పెద్దల ఆశీస్సులు"

"కానీ ముందు నా ప్రేమ ఫలించాలి కదా!" అన్నాడు భూపతి.

సీతారామయ్య సాలోచనగా, "అంటే- నువ్వో అమ్మాయిని ప్రేమించావు. కానీ ఆ విషయమింకా ఆ అమ్మాయికి తెలియదు. ఔనా? " అన్నాడు.

"ఊఁ"

"ఇలాంటి విషయాల్లో ఆలస్యం కూడదు. వెంటనే ఆ అమ్మాయిని కలిసి నీ ప్రేమ గురించి చెప్పేసేయ్" అన్నాడు సీతారామయ్య.

"ఏం చెబుతాన్రా- నేనింకా పియ్యూసీ. ఆ అమ్మాయేమో టెన్తు క్లాసు..."

"టూ బాడ్! కొన్నాళ్లు... కాదు కాదు... కొన్నేళ్ళాగడం మంచిది..."

"బీ సీరియస్! నేను పియ్యూసీ అని నీకింతవరకూ తెలియదా? నేను ప్రేమించే అమ్మాయి టెన్తుకెక్కువుండదని నేను చెప్పేదాకా నీ బుర్రకు తట్టలేదా? "

"ఇదే ప్రశ్న నేను నిన్నడిగితే? "

భూపతి స్వరం తగ్గించి, "పెళ్ళికి నాకేం తొందర్లేదురా- కానీ ఇప్పట్నించి చెప్పక పోతే ఆ అమ్మాయి నా చెయ్యి దాటిపోతుందని అనుమానంగా ఉంది" అన్నాడు.

"అది నిజం. గొప్పింటి పిల్లలకు గాలాలేసేవాళ్లు చాలామంది ఉంటారు"

"ఆ అమ్మాయి గొప్పింటి కాదు"

"వ్హాట్!"నోరు తెరిచాడు సీతారామయ్య.

"అదేమిట్రా- అంత ఆశ్చర్యపోయావు? " తెల్లబోయాడు భూపతి.

"ఆశ్చర్యపోక- నీతోసహా మీ ఇంట్లో ప్రతి ఒక్కరూ ప్రయోజనాన్నే తప్ప ప్రేమని నమ్మరని నా అణువణువుకీ తెలుసు"

"మరి మన స్నేహం? "

"నేను క్లాసులో ఫస్టు- నాతోవుంటే నీకూ ప్రయోజనమని మీ వాళ్ళనుకున్నారు"

"వాళ్ళ సంగతి సరే- మరి నా సంగతి? " అడిగాడు భూపతి.

"ఉన్నమాట చెబుతాను. ఏమీ అనుకోకు. నువ్వు అయినింటి బిడ్డవి. మధ్యతరగతివాణ్ణి నేను. నీకు అణిగి మణిగి ఉంటాననే నువ్వు నేనంటే ఇష్టపడుతున్నావు"

"ఒరేయ్- అంటే నేను నిన్ను బానిసలా చూస్తున్నానా? " అన్నాడు భూపతి చిన్నబుచ్చుకుని.

"అలాగని నేనన్నానా? నాకు నీ దగ్గర స్వతంత్రముంది. కానీ నువ్విష్టపడే మేరకే దాన్నుపయోగించుకోగలను"

భూపతి నిట్టూర్చి, "తెలిసిపోయిందిరా- నీకు నేనంటే ఇష్టంలేదు" అన్నాడు.

"ఇన్నేళ్ళ మన స్నేహంలో అలాగని ఒక్కసారైనా అన్నానా? "

"పోనీ- నీకు నేనంటే ఇష్టమే అనుకుందాం. అందుక్కారణముండాలి కదా! నీకూ నావల్ల ఏదైనా ప్రయోజనముందా? తెలివైన కుర్రాడి స్నేహం మంచిదని మావాళ్ళనుకున్నట్లు- ఉన్నవాడితో

స్నేహం మంచిదని మీవాళ్ళనుకున్నారా? ” సూటిగా అడిగాడు భూపతి.

“ఉన్నవాళ్ళకి దూరంగా ఉండాలని మా వాళ్ళంటారు. ఇక నా సంగతంటావా? కొన్ని ఇష్టాలకు కారణముండదు. నువ్వంటే నాకిష్టం- అంతే!”

“కారణం చెప్పకుండా ఇష్టమంటే నమ్మే స్తాననుకున్నావా? ” చిరుకోపంతో అన్నాడు భూపతి.

“నీ నమ్మకంతో నాకేం పని? ఉన్నమాట చెప్పాను. నమ్మడం నమ్మకపోవడం నీ ఇష్టం”

“అది కాదురా- బొత్తిగా కారణం లేకుండా నన్నిష్టపడవు కదా! అదేమిటో చెప్పి నన్ను సంతోషపెట్టొచ్చుగా” తనను పొగుడుతాడన్న ఆశతో అడిగాడు భూపతి.

“చెబితే నువ్వు సంతోషిస్తావనుకోను”

“అది తెలియదు కానీ చెప్పకపోతే మాత్రం బాధపడతాను”

“ఐతే, విను. చిన్నప్పుడు మా నాన్న పళ్ళు తోముకుందుకు వేపపుల్లిచ్చాడు. అది చేదని గోలపెట్టాను. తప్పలేదు. క్రమంగా అది అలవాటైంది. ఇప్పుడు వేపపుల్ల వాడకపోతే పళ్ళు తోమినట్లే ఉండదు. తినగ తినగ వేము తీయనగును- అని వేమన ఊరికే చెప్పలేదనిపిస్తుంది”

భూపతి నవ్వాడు, “మన స్నేహాన్ని చక్కగా విశ్లేషించావు. నాకు చాలా సంతోషంగా ఉంది. నమ్ముతాన్రా- నేనంటే నీకిష్టమని. మరి ఆ ఇష్టం ఆల్ ది బెస్ట్ చెప్పడంతో ఆగిపోకూడదు”

“అంటే? ”

“నా ప్రేమ విషయంలో నీ సాయం కావాలి”

“నా సాయమా- ఇలాంటి విషయాల్లో నాకేం అనుభవం లేదే!” సీతారామయ్య తెల్లబోయాడు.

“అనుభవానికి నేనేమైనా నిన్ను ప్రేమించమన్నానా? నువ్వా అమ్మాయిని కలుసుకో. నా ప్రేమ గురించి చెప్పు. ఆమె ఇష్టాయిష్టాలు తెలుసుకో. అదిచాలు నాకు”

“ఆ పని నువ్వే చెయ్యొచ్చుగా? ”

“యుద్ధానికైనా ప్రేమకైనా ముందు రాయబారముండాలి”

“ఆ రాయబారమేదో పెద్దలు చేస్తే బాగుంటుందేమో? ”

“అంటే మా అమ్మనీ, నాన్ననీ ఆ అమ్మాయి దగ్గరకెళ్ళి- అమ్మాయ్ నువ్వు మావాణ్ణి ప్రేమిస్తున్నావా అనడగమంటావు. బాగుందిరా- ఇది ప్రేమ రాయబారం, పెళ్ళి రాయబారం కాదు”

“కబుర్లు బాగా నేర్చావు కానీ- ఇది నావల్ల కాదు. నాకూ అమ్మాయిలకీ ఆమడ దూరం...”

“అంటే మాలతి అమ్మాయి కాదంటావా? ” అదోలా చూస్తూ అడిగాడు భూపతి.

“మాలతి... మాలతి అంటే? ” ఉలిక్కిపడ్డాడు సీతారామయ్య.

“అం నీకు తెలిసిన మాలతే!” అన్నాడు భూపతి.

సీతారామయ్య మొహం అదోలా అయిపోయింది. ఆలోచనల బరువుకేమో కళ్ళుకిందకి వాలాయి.

ఆ ఆలోచనల బిగువునే సూచించడానికన్నట్లు అతడి భృకుటి ముడతలు పడింది.

“ఏమిట్రా... ఆలోచనలో పడ్డావ్. సాయం చెయ్యననడానికి కొత్తదార్లు వెదుకుతున్నావా? ”

“నేను దార్లు వెదకడం కాదు. నువ్వే ఇంకో అమ్మాయిని వెదుక్కో” అన్నాడు సీతారామయ్య.

భూపతి చిరాగ్గా, “నేను నిన్నడిగింది- సాయం. సలహా కాదు” అన్నాడు.

“సారీరా- మాలతి నిన్ను ప్రేమించదు”

అన్నాడు సీతారామయ్య నెమ్మదిగా.

"ఎందుకని? "

"ముసుగులో గుద్దులాటెందుకు? మాలతి నన్ను ప్రేమిస్తోంది" అన్నాడు సీతారామయ్య.

"ఆ అమ్మాయి టెన్త్‌క్లాసు. నువ్వేమో పియ్యూసీ. అప్పుడే మీ ఇద్దరికీ ప్రేమే మిటి? నేన్నమ్మను"

"నా మాట నాకు బాగానే అప్పగించావు కానీ- మాలతి నాకు నాలుగేళ్ళుగా తెలుసు. చాలా మంచమ్మాయి. ఎవరి తోనూ ఎక్కువ మాట్లాడదు. నేను బుద్ధి మంతుణ్ణని ఆమె తల్లిదండ్రులు నన్నా మెతో మాట్లాడనిచ్చారు"

"అది అవకాశంగా తీసుకుని నువ్వా మెతో ప్రేమ కబుర్లు మొదలెట్టావా? "

"అది అవకాశంగా తీసుకున్న మాట నిజం. కానీ నేను కాదు, ఆమె. అదీ ప్రేమ కబుర్లకు కాదు. పరీక్షలనాడి తెలుసుకుం దుకు క్లాస్ సబ్జక్ట్సులో డౌట్సడిగేది"

"అప్పుడు నువ్వు చెయ్యి పట్టుకుని నాడి చూసేవాడివా? "

"ఏమిట్రా నువ్వనేది? నేనెలాంటివాణ్ణో నీకు తెలియదా? "

"నువ్వెలాంటివాడివో తెలుసు. కానీ నీలాంటివాడు ప్రేమలో ఎలా పడతాడో, అమ్మాయిల్ని ముగ్గులోకెలా దింపుతాడో తెలియదు"

"నీ మనసులో ఏముందో తెలియదు కానీ- మా ఇద్దరి మధ్యా ప్రేమ ఎలా మొదలైందో చెబుతాను..." గొంతు సవ రించుకున్నాడు సీతారామయ్య.

★ ★ ★

పక్కన ఫోన్ మోగింది. భూపతి ఉలి క్కిపడ్డాడు. ఆ ఫోను సీతారామయ్యదా?

టైము చూస్తే ఇంకా తొమ్మిదీ నలభై.

సీతారామయ్యకి టైమంటే టైమే. ఫోనంటూ మళ్ళీ చేస్తే పదింటికే చేస్తాడు.

కానీ భూపతి మనసులో అనుమానం. ఫోన్ తియ్యలేదు. అది మోగిమోగి ఆగి పోయింది.

భూపతి ఆలోచనలో పడ్డాడు. అది సీతారామయ్య ఫోన్ కాదేమో?

అసలిందాకా తనతో ఫోన్లో మాట్లాడింది ఆ సీతారామయ్యేనా?

ఆ గొంతు తనకి గుర్తే. ఐతే సాధార ణంగా వినయం, వేడుకోలు ఉండే ఆ గొంతులో- ఈరోజు ధైర్యం, ఇంకా చెప్పా లంటే- కాస్త పొగరు ధ్వనించింది. కారణ మేమిటి?

అసలు సీతారామయ్య తనకెందుకు ఫోన్ చేసినట్లు?

"నేను సీతారామయ్యని" అనగానే ఆ ఫోనెవరిదో గుర్తుపట్టాడు తను. కానీ అత డలా ఫోన్ చేస్తాడని ఊహించక కలిగిన తడబాటు కప్పిపుచ్చుకుందుకు కావాలనే గుర్తుపట్టనట్లు నటించాడు. కానీ సీతారా మయ్య తక్కువ తిన్నాడా? ఏదో పెద్ద గవర్నరైనట్లు తనని గుర్తు చేసుకోమని చెప్పి అందుకో అరగంట టైం కూడా ఇచ్చి ఫోన్ కట్‌చేసాడు.

అన్న ప్రకారం అరగంటలో మళ్ళీ ఫోన్ చేస్తాడా? చేస్తే ఏం మాట్లాడతాడు?

భూపతి ఆలోచిస్తుండగా మళ్ళీ ఫోన్ మోగింది.

"వాడే- సీతారామయ్యే అయ్యుంటాడు" అనుకుంటూ రిసీవర్ తీసి, "హలో!" అన్నా డాయన.

"బామ్మని పిలుస్తారా? " అందో అమ్మాయి గొంతు.

"బామ్మెవరు? " చిరాగ్గా అడిగేడాయన.

"బామ్మెవరూ అని అడిగేంతలా తాగేవా" తిట్టిందా అమ్మాయి గొంతు.

తడబడిన భూపతి కాస్త సహనం వహించి ఆమెకి తన వివరాలు చెప్పాడు.

"సారీ- రాంగ్ నంబర్" అని ఫోన్ పెట్టే



సిందామె.

రాంగ్ నంబర్- ఆ మాట భూపతి చెవుల్లో ఫోన్ మోతలా గింగురుమంది.

ఆ మాట తనెలా మర్చిపోతాడు? సీతా రామయ్య కారణంగా మాలతినుంచి తనకు లభించిన బిరుదు- రాంగ్ నంబర్...

★ ★ ★

సీతారామయ్య భూపతికి తన ప్రేమకథ చెప్పాడు.

మాలతి తరచుగా అతడివద్దకొచ్చి అన్ని సబ్జక్ట్సులోనూ డౌట్సడిగి తీర్చుకునేది. ఇలా చెబితే అలా అర్థం చేసుకునే ఆమెకసలు డౌట్సు రావడమే ఆశ్చర్యమని

## కొత్తగాలి...

ప్రేమలో ఎంత ప్రేయసో
కోపంలో అంత రాక్షసి
రెండు ముఖాల ప్రకృతి

–వై.సుభాషిణీ,
హబ్సీగూడ, హైదరాబాద్

పించేది అతడికి. ఆ మాటందామంటే రావడం మానేస్తుందని భయం. ఎందుకంటే ఆమెకి పాఠం చెప్పడంవల్ల అతడికి రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి- తనకి క్లాసు సబ్జక్ట్సులో టచ్ పోకుండా ఉంటుంది. రెండు- ఆమె సాహచర్యంలో ఏదో తెలియని ఆనందముంది.

అప్పుడు మాలతి నైన్త్‌క్లాసు చదువుతోంది. ఒకరోజామె వాళ్ళ క్లాసు టీచరుక్కూడా లొంగని లెక్క అడిగితే సీతారామయ్య అవలీలగా సాల్వ్ చేసాడు. మాలతి అతణ్ణి ఆరాధనపూర్వకంగా చూసి, "టీచర్స్ కంటే థరోగా ఉన్నావు. ఇదెలా సాధ్యం?" అంది.

సీతారామయ్య ఛాతీ పొంగింది, "నేను తీరిక సమయాల్లో కూడా క్లాస్ సబ్జక్ట్స్ గురించే ఆలోచిస్తూంటాను" అన్నాడు గొప్పగా ముఖంపెట్టి.

మాలతి తల అడ్డంగా ఊపి, "ఏమో- మరి నేను తీరిక సమయాల్లో నీ గురించి బోలెడాలోచిస్తాను. అయినా నీ గురించి బోలెడు డౌట్సున్నాయి" అంది.

"నా గురించి డౌట్సా?" ఆశ్చర్యపడ్డాడు సీతారామయ్య.

"నువ్వేమీ అనుకోనంటే నా డౌట్సు చెబుతాను" అంది మాలతి. అతడు బుద్ధిగా తలూపాడు.

మాలతి చేతులు కట్టుకుంది. కళ్ళు మూసుకుంది. పాఠం అప్పజెబుతున్నట్లు,



"నేను నీ గురించి బోలెడాలోచిస్తాను. మరి నువ్వు నా గురించి ఆలోచిస్తావా? ఇది డౌట్ నంబర్ వన్. ఆలోచిస్తే నీకేమనిపిస్తుంది? ఇది డౌట్ నంబర్ టూ. నేను నిన్ను ప్రేమించాననుకో- నువ్వూ నన్ను ప్రేమిస్తావా? ఇది డౌట్ నంబర్ త్రీ. మన ప్రేమని పెద్దలొప్పుకపోయినా నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా? ఇది డౌట్ నంబర్ ఫోర్..." అని ఆగింది.

అతడివి నూనూగు మీసాలు. ఆమె విరిసీ విరియని మొగ్గ.

తెల్లబోయిన సీతారామయ్య కాసేపాలోచించేక, "మనది ప్రేమంటే అవగాహన లేని వయసు. అసలా ఆలోచనే తప్పనే వయసు. చదువుపట్ల ఏకాగ్రత చూపాల్సిన వయసు. జీవితమనే భవన నిర్మాణానికి పునాదులు పడే వయసు" అన్నాడామెతో.

"ఇవన్నీ నాకూ తెలుసు. కానీ నా మనసుకే తెలిసినట్లు లేదు. దానికి నీమీద ప్రేమ పుట్టేసింది మరి" అంది మాలతి నిస్సంకోచంగా.

సీతారామయ్యకి ఏమనాలో తెలియక, "అలా ఎందుకు జరిగింది?" అన్నాడు అమాయకంగా.

"ఏమో- నాకు మాత్రమేం తెలుసు? క్లాసులో అంతా నిన్ను పొగుడుతారు. మీ ఇంట్లోనూ మా ఇంట్లోనూ కూడా అంతా నిన్ను మెచ్చుకుంటారు. నీతో మాట్లాడినపుడల్లా నువ్వు చాలా గొప్పవాడివనిపిస్తుంది. ఇంకా ఇంకా మాట్లాడాలనిపిస్తుంది. నువ్వు దగ్గర లేనప్పుడూ నీ గురించిన ఆలోచనలే నాకు. వాటిలోంచి నిన్ను తీసేయాలని చూసాను. కానీ నువ్వుంటేనే నా ఆలోచనలు బాగుంటున్నాయి. ఏంచేయాలో నువ్వే చెప్పు?" అందామె అతడిలాగే అమాయకంగా.

ఆమె చెప్పింది శ్రద్ధగా విన్న సీతారామయ్య అదే అనుభవం తనకీ అవుతున్నదని గ్రహించాడు. ఐతే ఆమె చెప్పేదాకా

ఆ విషయం లోతుగా ఆలోచించలేదు.

"ఐతే అదే ప్రేమంటావా? " అన్నాడతడు సాలోచనగా.

"అదే ప్రేమ" అందామె తనకంతా తెలిసినట్లు.

"ఎలా చెప్పగలవు? ".

"పుస్తకాల్లో చదివాను"

"పుస్తకాల్లో జ్ఞానాన్ని వెదికే వయసు మనది. ప్రేమని వెదకడం తప్పుకదూ" హెచ్చరించాడతడు.

"మనం ఒకరినొకరు తాకాలనుకోవడం లేదు. తప్పేం చేయాలనుకోవడం లేదు. ఎలాగూ స్నేహితులం. ప్రేమికులౌదామనుకుంటే అది తప్పెందుకవుతుంది? " అంది మాలతి.

"మనం స్నేహితులుగానే కొనసాగొచ్చుగా. ప్రేమికులుగా మారడమెందుకు? "

"ఇలా ఆలోచిస్తే డౌట్సు పెరుగుతాయే తప్ప తీరవు. నీకు నాతో స్నేహం కావాలా, ప్రేమ కావాలా అన్నది ప్రోబ్లమ్. దాన్ని సాల్వ్ చేయ్. నీ సొల్యూషన్ నాకు శిరోధార్యం" అంది మాలతి. అప్పుడు సీతారామయ్య మాలతి గురించి ఆలోచిస్తే అతడి మనసులోనూ ప్రేమ పుట్టింది. ఆ ప్రేమభావం స్నేహభావం కంటే మధురంగా ఉంది. ఆ భావాన్ని అదుపు చేయాలని అతడెంతో ప్రయత్నించాడు కానీ అది బలిచక్రవర్తి ముందు వామనుడిలా ఇంతింతై అంతైంది.

అప్పట్నించీ వాళ్ళిద్దరూ కలుసుకున్నప్పుడల్లా భావిజీవితం గురించి అరమరికలు లేకుండా మాట్లాడుకునేవారు. పెద్దయ్యేక ఈ ప్రపంచానికే ఆదర్శదంపతులు కావాలనుకున్నారు. ఆలోచనల్లో శృంగారానికి తావులేని వారి స్నేహమనే బంగారానికి తావిగా మారింది వాళ్ళ ప్రేమ. ఇదంతా భూపతికి చెప్పి, "అలా మా ప్రేమ వర్ధిల్లుతోంది..." అన్నాడు సీతారామయ్య.

భూపతి అతణ్ణి అసూయగా చూసాడు. ఓ ఆడపిల్ల, అదీ అందమైన ఆడపిల్ల- తనంత తానే వచ్చి ప్రేమిస్తున్నాననే గొప్ప అదృష్టం- సీతారామయ్యకి అతి సులభంగా దక్కింది.

"ప్రేమ మాలతిది. నీది ఫక్తు స్వార్థం. మా ప్రేమ అనకు మరి" వెంటనే అన్నాడు భూపతి తన అసూయని విశ్లేషణగా మార్చి.

"నేను చెప్పేకనే కదా మా ప్రేమ గురించి తెలిసింది- అప్పుడే దానిమీద వ్యాఖ్యానం మొదలెట్టావేమిటి? " అన్నాడు సీతారామయ్య నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"అందమైన అమ్మాయి ప్రేమించాలంటే డబ్బుండాలి, హోదా ఉండాలి. నీకా రెండూ లేవు. ఐనా అమాయకత్వంకొద్దీ ప్రేమించింది కాబట్టి ఆమెది అసలుసిసలు ప్రేమ అనొచ్చు. దానికి వెంటనే ఒప్పేసుకుని నువ్వూ ప్రేమించేస్తే అది స్వార్థం. కాదంటావా? " అన్నాడు భూపతి.

సీతారామయ్య నవ్వి, "స్వార్థం కాదు, ప్రేమ అంటాను. కాదంటావా? " అన్నాడు అదే స్టైల్లో.

"కాదంటాను. నీ ప్రేమ నిజమైతే అన్ని విధాలా నీకంటే అధికుణ్ణయినా నేనామెను ప్రేమిస్తున్నానని తెలియగానే- నీ గురించి కాక ఆమె గురించి ఆలోచించాలి. నీ ప్రేమ త్యాగంచేసి మమ్మల్ని దగ్గిరచేసి ఆమె బంగారు భవిష్యత్తుకి బాట వేయాలి. అలా చెయ్యనంటావూ- నీది ఫక్తు స్వార్థం"

"నా స్వార్థం మాటటుంచు. మాలతి, నేను ఒకర్నొకరు ప్రేమించుకుంటున్నామని తెలిసీ నీకోసం నా ప్రేమని త్యాగం చెయ్యమంటున్నావు. అది నీ స్వార్థం కాదా? "

"ఏ మాత్రం కాదు. నిన్ను పెళ్ళాడితే మాలతికి ఒరిగేదేముంది? నన్ను పెళ్ళా

డితే ఆమె జీవితమే మారిపోతుంది. నిజానికి నా కోసం మాలతిని మించిన అమ్మాయిలు క్యూలు కడతారు. వాళ్ళందర్నీ వదులుకుని ఆమెకోసం ఆరాటపడే నాది స్వార్థం కాదు, అసలు సిసలు ప్రేమ"

"సరే- ఇప్పుడు నన్నేం చేయమంటావ్? " అడిగాడు సీతారామయ్య.

"మాలతిని కలుసుకో. నా గురించి చెప్పు. నిన్నూ నన్నూ పోల్చి- నాముందు నువ్వెంత అల్పుడివో వివరించు. నీ ప్రేమలో బలముంటే ఆమెప్రేమ తప్పక నామీదకు మళ్ళుతుంది"

సీతారామయ్య భూపతితో వాదించ లేదు. అతడు మాలతిని కలుసుకుని జరిగిందంతా చెప్పాడు. నీకిప్పుడు చెప్పాడా- భూపతి తన ప్రేమ విషయం. నాకెప్పుడో చెప్పాడు" అందామె తాపీగా.

సీతారామయ్య ఆశ్చర్యపోయాడు. అంటే భూపతి ఈ ప్రేమ విషయాన్ని తన దగ్గర దాచిపెట్టాడు. అతడే కాదు, మాలతి కూడా తన దగ్గర ఈ విషయం దాచిపెట్టింది.

"ఏం జరిగిందో చెప్పు" అడిగాడు సీతారామయ్య.

"చెప్పేదేముంది- అతడొచ్చాడు. ప్రేమిస్తున్నానన్నాడు. నేను నిన్ను ప్రేమిస్తున్నట్లు చెప్పాను. అప్పుడతడు మాటల్లో నిన్నెంతలా చిన్నబుచ్చాడో చెప్పలేను. నాక్కోపమొచ్చింది. మాటల్లో నిన్నాకాశానికెత్తేసాను. అంతే- నీచేతే తన ప్రేమ సందేశాన్ని వినిపిస్తానని సవాలు చేసి వెళ్ళాడు"

"ఇదంతా నాకెందుకు చెప్పలేదు? "

"నీతో మాట్లాడే సమయం నాకెంతో విలువైనది. టైం వేస్టనిపించేవి నీకు చెప్పను. ఇప్పుడైనా తప్పనిసరై చెప్పాను"

"తప్పు చేసావేమో మాలతీ!" అన్నాడు సీతారామయ్య సాలోచనగా.

"మరి ఒప్పేమిటో చెప్పు" అంది మాలతి.

"ఇప్పుడు మనకి ప్రేమ, పెళ్లి విషయంలో తొందరేం లేదుకదా! భూపతిని ప్రేమించాననో, నన్ను ప్రేమించడం లేదనో ఒప్పేసుకుంటే తాత్కాలికంగా సమస్యలుండేవి కావు"

"ఇలా అంటావనే నేను నీకు భూపతి విషయం చెప్పలేదు"

"చెప్పకూడదనుకున్నా చెప్పేసావుగా. అలాగే వినకూడదనుకుంటూనే నా మాట విని- భూపతిని ప్రేమిస్తున్నానని చెప్పేసేయ్" అన్నాడు సీతారామయ్య.

"అబద్ధం చెప్పడం నాకిష్టముండదు" అంది మాలతి.

"పోనీ- నీ తరఫున నేను చెప్పనా? " అన్నాడు సీతారామయ్య.

"నీ గురించి నువ్వెలాంటి అబద్ధాలు చెప్పినా అది నీ ఇష్టం. నా గురించి చెబితే మాత్రం అబద్ధాల్ని ఖండిస్తాను. లేకుంటే ఆ అబద్ధాలు నేను చెప్పినట్లే అవుతుంది. అది నాకిష్టముండదు"

"ఐతే నా మాటవిని నన్ను మర్చిపో. భూపతిని పెళ్లి చేసుకుందుకు ఒప్పుకో"

మాలతి అతడివంక అదోలా చూసి, "నువ్వడిగావని నిన్ను ప్రేమించివుంటే- నువ్వు చెప్పావని భూపతిని పెళ్లి చేసుకునేదాన్ని. అయినా ఇలా మాట్లాడ్డానికి నీకు నోరెలా వచ్చింది? " అంది.

"ప్రేమకి పెళ్ళి భవిష్యత్తు. పెళ్ళికి డబ్బు, హోదా ప్రధానం. అవి నాకు లేవు. భూపతికున్నాయి. మనం భవిష్యత్తులోకి చూసి నిర్ణయాలు తీసుకోవాలి" అన్నాడు సీతారామయ్య.

"మరి భవిష్యత్తులోకి చూసి నిర్ణయాలు తీసుకున్నాను. అక్కడ నువ్వు భూపతి కంటే చాలా ఎత్తులో ఉన్నావు. అంతా నిన్ను సీతారామయ్య, ది గ్రేట్ అంటు

# నీ ఘటం ఎవరికి కావాలి?



మహాత్మా గాంధీ హత్య జరిగిన రోజులు అవి. ప్రభుత్వం నెల రోజుల జాతీయ శోక దినాలను ప్రకటించింది. అందు చేత ఆకాశవాణిలో ఆ కాలంలో సంగీత కార్యక్రమాల్లో శోక, భక్తి రసాలకే ప్రాధాన్యత. ఇతర రసాలకు తావులేదు.

మైసూరు ఆకాశవాణి కేంద్రంలో చెల్వపిళ్లె అయ్యంగార్ సంగీత విద్వాంసులనంతా సమావేశపరచారు. డోలు, తబల, మద్దెల, కంజీరం, ఘటం కళాకార్లను ఉద్దేశించి, 'ఇక నెల రోజులు మీ వాద్యాలతో పని ఉండదు. అన్నీ వాటి స్థానాలలో భద్రపరచి మీరు మీ ఇళ్ళల్లో విశ్రాంతి తీసుకోండి' అని చెప్పారు.

ఆ కళాకారుల్లో ఘటం కళాకారుడు ఓ ఔత్సాహిక యువకుడు. అతను లేచి నిలబడి, 'నా ఘటమూ వద్దంటారా, సార్' అని అమాయకంగా అడిగాడు. అయ్యంగార్ విసుగుతో 'ఏమండి మీ ప్రత్యేకత? గాంధీజి వంటి పెద్ద ఘటమే కూలిపోయిందని అందరూ చింతిస్తుంటే మధ్యలో మీ ఘటం ఎవరికి కావాలి? పొండి, పొండి!" అని అరిచారు. ఈ మాటలకు కళాకారులందరూ గట్టిగా నవ్వితే ఆ ఘటం కళాకారుడు మాత్రం మౌనందాల్చారు.

**విన్నాటి నిజం**

న్నారు" అంది మాలతి.

ఆ ఊహ భూపతికి చేరితే ఎంత ప్రమాదమో అప్పుడామెకు తెలియదు. బహుశా సీతారామయ్యకీ తెలియదు. మాలతి మాటలకి మురిసిపోతూనే, "భవిష్యత్తులో నన్ను గొప్పగా ఊహించుకోవడం బాగానే ఉంది. కానీ భూపతి గొప్పతనం ఇప్పటి వాస్తవం" అన్నాడు.

"నాకు నీ మీద గౌరవమూ, భూపతి అంటే విముఖతా కూడా ఇప్పటి వాస్తవం"

"నీకు అబద్ధం చెప్పడం ఇష్టముండదన్నావ్. ఇప్పుడు చెప్పావేం? " అన్నాడు సీతారామయ్య.

"నేనేమబద్ధం చెప్పాను? " అంది మాలతి ఆశ్చర్యంగా.

"నామీద గౌరవమన్నావ్. భూపతంటే విముఖతన్నావ్, నీ మాటలు పరస్పర విరుద్ధంగా లేవూ? "

"నీకు నిజంగా నామీద గౌరవముంటే నా మాట మన్నించి భూపతిని ప్రేమించాలి? "

"భలేవాడివే- నా గౌరవం నీమీద- నీ మాటమీద కాదు" అంది మాలతి.

"రెండింటికీ తేడా ఏమిటి? "

"బోలెడు తేడా. నువ్వు నీ శత్రువుని కూడా ప్రేమించగలవు. అందుకని నాకు నీమీద గౌరవం"

"మరి నీ మాట నన్నో చెడ్డవాణ్ణి ప్రేమించమంటోంది. దాన్ని నేను గౌరవించలేను"

"నువ్వు ప్రేమించనంత మాత్రాన భూపతిని చెడ్డవాడనడం న్యాయం కాదు"

"ఐతే నీకు భూపతి గురించి తెలియదనుకోవాలి. భూపతికి మీరంటే అసూయ. గట్టి దెబ్బతీయాలనే భూపతి మీతో

## కొత్తగాలి...

**పొంగిపోడు**
**కుంగిపోడు**
**లొంగిపోడు**
**ఉత్తముడు**

– పెరుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

స్నేహాన్ని కొనసాగిస్తున్నాడు. మిమ్మల్ని వెయ్యికళ్ళతో గమనిస్తూ అతడు నన్ను ప్రేమించినట్లు తెలుసుకున్నాడు. ఆ ప్రేమను భగ్నం చేయాలన్న తపనే తప్ప నాపై ప్రేమలేదు అతడికి".

"ఇదంతా నీ ఊహ" అన్నాడు సీతారామయ్య బాధగా.

"భూపతెలాంటివాడో నీకు తెలుసు. అతడి ఊహలూ నీకు తెలుసు. నాది ఊహ కావచ్చు కానీ అది నిజమనీ నీకు తెలుసు" అంది మాలతి.

"నాకు తెలుసు మాలతీ- భూపతి డిఫరెంటని! కానీ నువ్వనుకున్నట్లు అతడు చెడ్డవాడు కాదు. అతడికి మాయ తెలియదనను కానీ మర్మంలేదని కచ్చితంగా చెప్పగలను. మనసులో చెడు ఊహ ఉన్నా సరే- నిస్సంకోచంగా చెబుతాడు. నేనతణ్ణి మంచి మిత్రుడిగానే భావిస్తాను"

"మనసులో చెడు ఊహ ఉన్నాసరే- నిస్సంకోచంగా చెబుతాడన్నావుగా- అతడి గురించి నేనన్నది నిజమో కాదో సూటిగా అతణ్ణే అడిగి తెలుసుకో" అంది మాలతి.

భూపతి దగ్గర సీతారామయ్యకా చనువుంది. అందుకని మాలతి మాటలు అతడికి చేరేసాడు.

"మాలతి నిజమే చెప్పింది" అన్నాడతడు తాపీగా.

సీతారామయ్య దెబ్బ తిన్నాడు, "నువ్వు మంచి మిత్రుడివని నమ్మాను" అన్నాడు బాధగా.

"నేను నీకు నిజంగానే మంచి స్నేహితుణ్ణి. ఐతే ప్రాణ స్నేహితుడైనా సరే నాకంటే ఎక్కువగా ఉంటే భరించలేకపోవడం నా బలహీనత. అందుకే నాకు స్నేహితులు తక్కువ. ఉన్నవాళ్ళలో నువ్వొక్కడివే నాకు నచ్చావ్" గొంతు సవరించాడు భూపతి.

"అందంలో, పర్సనాలిటీలో, చదువులో, తెలివిలో నువ్వు నాకంటే ఎక్కువ. డబ్బులో నేను నీకంటే చాలా ఎక్కువే అయినా విద్యార్థి దశలో అదో పెద్ద విశేషం కాదు. అందుకని నేను నీ ముఖం మీద యాసిడ్ పోయొచ్చు నీ కాలొకటి తీయించేయొచ్చు నువ్వు పరీక్షలు రాయకుండా ఆపొచ్చు నిన్ను మించిపోవడానికి నేనాదార్లు ఎంచుకోలేదు. నేను నీకు మంచి మిత్రుణ్ణి కాబట్టి- నీ శరీరానికే మాత్రం హాని కలక్కుండా నిన్నుమించే మార్గం అన్వేషిస్తున్నాను. అప్పుడు మాలతి నాకో దారి చూపించింది"

"మాలతా? " అన్నాడు సీతారామయ్య ఆశ్చర్యంగా.

"ఔను- మాలతే! ఆమె నిన్ను ప్రేమించగానే నాకా మార్గం కనపడింది. ఇప్పుడెలాగో అలా ఆ ప్రేమను నాపై మళ్లించుకోవడమే- నీపై నేను సాధించబోయే ఆధిక్యం" అన్నాడు భూపతి.

సీతారామయ్య చదువులో తెలివైనవాడే కావచ్చు కానీ మనుషుల్లో ఇలా కూడా ఆలోచించేవారుంటారని ఊహించలేదు. కోపాన్ని దిగమింగుకుని, బాధ అణచుకుని, "మాలతివల్ల నీ నిజ స్వరూపం తెలిసింది. నీకూ నీ స్నేహానికీ గుడ్ బై" అన్నాడు.

"ప్రేమకైనా, స్నేహానికైనా- పుట్టుకే కానీ చావుండదు" అన్నాడు భూపతి.

"కానీ మన స్నేహం చచ్చిపోయింది"

"ప్లీజ్ రా- అలాగనొద్దు. స్నేహితుడికి హాని తలపెట్టే ముందు వెనకా ముందూ

ఆలోచిస్తాను. స్నేహితుడు కానివాణ్ణైతే ఏం చేయడానికీ తటపటాయించను. మన స్నేహం చచ్చిపోయిందంటే నీ విషయంలో నేను ఎంతకైనా దిగజారగలను. అలా జరగనివ్వకురా" అన్నాడు భూపతి.

అది బెదిరింపని గ్రహించిన సీతారామయ్య అప్పటికేం మాట్లాడలేదు కానీ ఆ తర్వాత నుంచి భూపతికి దూరంగా ఉంటున్నాడు. భూపతి మాత్రం అతణ్ణి వదలక మధ్యలో పలకరించేవాడు. ఒక రోజు, "ఇంకా మాలతి నా దారికి రాలేదు. ఇక నీ స్నేహమే నాకు దిక్కు" అన్నాడు భూపతి. ఇక ఊరుకుని లాభంలేదని గ్రహించిన సీతారామయ్య మాలతికీ విషయం చెప్పేసాడు. ఆ వెంటనే ఆమె వెళ్ళి భూపతిని కలుసుకుంది.

"ఏమిటిలా వచ్చావ్- సీతారామయ్యగానీ ఏమైనా చెప్పి పంపేడా? " అడిగాడు భూపతి.

"లేదు. నేనే చెప్పాల్సిందుంటే వచ్చాను" అంది మాలతి.

"పెళ్ళి విషయమైతే సరే- నువ్వేం చెప్పినా వింటాను" అన్నాడు భూపతి.

"అయితే పెళ్ళి గురించే చెబుతున్నా- విను. నేను ఇంజనీర్ని పెళ్ళి చేసుకుంటాను. ఎందుకో తెలుసా- పుటం వేసినా నువ్వు ఇంజనీరువి కాలేవని" అంది మాలతి.

"మరి సీతారామయ్య కూడా ఇంజనీరు కాలేకపోతే? "

"అవుతాడని నాదీ గ్యారంటీ"

"సరే- నా మాట విను. అవడని నాదీ గ్యారంటీ" దృఢంగా అన్నాడు భూపతి.

"పందెం" అంది మాలతి అదెంత ప్రమాదకరమో తెలియక.

పియ్యూసీలో సీతారామయ్యకి మంచి మార్కులొచ్చాయి. ఇంజనీరింగులో సీటు గ్యారంటీ అనుకున్నారంతా. భూపతి ఏంచేసాడో అతడి తల్లిదండ్రులు సీతారామయ్య తల్లిదండ్రుల్నేమని బెదిరించారో- మరి సీతారామయ్య డిగ్రీలో చేరాల్సి వచ్చింది. అదీ బియ్యే. అందులోనూ అతడికే మాత్రమూ ఆసక్తి లేని, అప్పట్లో బొత్తిగా ఉద్యోగావకాశాలు లేని హిస్టరీలో. సీతారామయ్య ఎంతో ఏడ్చాడు. తనే స్వయంగా వెళ్ళి భూపతి కాళ్ళు పట్టుకున్నాడు.

"నాకు నీమీద పగ, కోపం లేవు. మాలతి అనుకుంటోంది- నువ్వు నాకంటే ఎక్కువ ఎత్తు ఎదుగుతావని. ఆమె నిన్ను ప్రేమిస్తున్నంత కాలం నేను నిన్ను ఎదగనివ్వను" అన్నాడు భూపతి.

చదివే సత్తా ఉండీ, సీటొచ్చే అవకాశముండీ కూడా సీతారామయ్య బియ్యేలో చేరాడు. అది చాలదన్నట్లు, నీ స్నేహం వదులుకోనంటూ భూపతి కూడా బియ్యేలో చేరి అతడి క్లాస్‌మేటయ్యాడు. ఆ తర్వాత అతడోసారి మాలతిని కలుసుకుని, "పాపం- సీతారామయ్య ఇంజనీరు కాలేడు. ఇంజనీరే కావాలంటే మరి నీకీ జన్మకు పెళ్ళి కాదు" అన్నాడు.

"ఎవరి ఆలోచనలూ ఎప్పుడూ ఒకే రీతిలో ఉండవు. నేనిప్పుడు హిస్టరీ గ్రాడ్యుయేట్‌ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను తెలుసా? " అంది మాలతి బింకంగా.

"తెలుసు. అందుకేగా నేను బియ్యే హిస్టరీలో చేరాను!" అన్నాడు భూపతి.

"ఎక్కడైనా చేరు. నాకు సంబంధించి నీది రాంగ్ నంబర్" అంది మాలతి.

"నీది అమాయకత్వం. నాది ప్రేమ. ఎప్పటికైనా జయం ప్రేమదే" అన్నాడు భూపతి.

"థాంక్యూ- జయం ప్రేమదే కావాలని కోరుకుంటున్నాను" అంది మాలతి.

మాలతి అలా అనేసి ఊరుకోలేదు. భూపతిని జయించాలన్న పట్టుదల పెంచుకుంది.

అన్నీ పోగొట్టుకున్నట్లు నీరసించిపోయిన సీతారామయ్యలో ఉత్సాహం నింపాలని ఆమె ఆశయం. ఆ ప్రయత్నంలో ఒక రోజామె అతణ్ణి కలుసుకుని, "ఏమైంది నీకు? ఇలా ఈసురోమంటూ ఉండే బదులు నవ్వుతూ తుళ్ళుతూ హుషారుగా ఉండొచ్చుగా" అంది.

"నా భవిష్యత్తు నాశనమైపోయింది" అన్నాడు సీతారామయ్య ఏడుపు గొంతుతో.

"నా భవిష్యత్తు కాదు, మన భవిష్యత్తను. అప్పుడు దానికి నాశనముండదు" అంది మాలతి.

"ఆ భూపతి మనల్ని ఒకటి కానివ్వడు" అన్నాడు సీతారామయ్య.

"మన భవిష్యత్తు మనది. మధ్య ఆ భూపతెవడు? " అంది మాలతి.

"అంతా ఆ భూపతిలోనే ఉంది. చూసావుగా నేను బియ్యేలో చేరాను"

"మాటిమాటికీ బియ్యేని తల్చుకుని దుఃఖపడతావేం? మన సంతోషం- మన ప్రేమ ఫలించడంలో ఉంది. ఇంజనీరింగులో కాదు"

"కానీ భూపతి...? "

"అతడో శాడిస్టు. అతడికి లొంగడం మన ప్రేమకే అవమానం"

"కానీ మన చేతుల్లో ఏముంది? " నీరసంగా అన్నాడు సీతారామయ్య.

"అంతా మన చేతుల్లోనే ఉంది. కానీ భూపతి చేతల మీదున్న నమ్మకం మన చేతల మీదున్నట్లు లేదు. భవిష్యత్తుకి భయపడి ప్రేమని కాదంటావేమోనని నీ గురించి నాకు బెంగ"

"నా భయం సంగతటుంచు. మరి నీ సంగతేమిటి? " అన్నాడు సీతారామయ్య.

"అమ్మా నాన్నలు చదివించగలరు కానీ పెళ్లి చెయ్యలేరు. అన్నయ్య నాకు అక్షింతలు మాత్రం వెయ్యగలడు. అందుకని నా పెళ్ళి నా చేతిలోనే ఉంది" అంది మాలతి.

"అలాంటప్పుడు భూపతిని పెళ్ళి చేసుకుంటే నీకు దశ తిరిగిపోతుంది"

మాలతి అతణ్ణదోలా చూసి, "ప్రేమ వ్యాపారం కాదు" అంది.

"అసలీ ప్రేమంటే ఏమిటి మాలతీ!" అన్నాడు సీతారామయ్య దీనంగా.

"ప్రేమకి నిర్వచనం లేదు. అంతకంటే గొప్పది మరొకటి లేదనిపించే అనుభూతి. నా సంగతి తీసుకో. నాకు నువ్వంటే ప్రేమ. నీతో కలిసుండాలనీ, నీ కోసం ఏమైనా చేయాలనీ, సుఖాలేకాక కష్టాల్నీ నీతో పంచుకోవాలనీ నాకనిపిస్తుంది. నువ్వు నాతో ఉంటే భవిష్యత్తుకి భయపడను, వర్తమానంలో దిగులుపడను" అంది మాలతి.

సీతారామయ్యలో కొత్త ఉత్సాహం పుట్టింది. తనూ మాలతిలాగే ఉంటానన్నాడు. అతడి దిగులు పూర్తిగా తొలగిపోగా దృష్టి ఐ.ఎ.ఎస్ మీద పడింది. భూపతి తనని వెంటాడుతూనే ఉంటాడని తెలుసు కాబట్టి - వీలైనంత రహస్యంగా ఐ.ఎ.ఎస్ కోసం ప్రిపేరవుతున్నాడు.

మూడేళ్ళు ఇట్టే గడిచిపోయాయి. సీతారామయ్య బియ్యే ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. భూపతికి థర్డ్ క్లాసు వస్తే ఆ విషయం గర్వంగా చెప్పుకుందుకు మాలతిని కలుసుకున్నాడతడు.

"నీది థర్డ్ క్లాసు. సీతారామయ్యది ఫస్ట్ క్లాసు" అంది మాలతి గొప్పగా.

"నువ్వు కాలేజి రిజల్ట్సు చెబుతున్నావు. జీవితంలో నాది డిస్టింక్షన్. సీతారామయ్య ఫెయిల్" అన్నాడు భూపతి నిరసనగా.

"అదెన్నాళ్ళులే. సీతారామయ్య ఐ.ఎ.ఎస్. అయి కలెక్టరుగా వచ్చేదాకానే" అంది మాలతి.

"వాడు, ఆ సీతారామయ్య కలెక్టరా? "

# జమీందారు - తోడిరాగం

తమిళనాడులోని ఒకానొక జమీందారు నాగస్వర చక్రవర్తి బిరుదుగల రాజరత్నం పిళ్లేగారి కచేరిని ఏర్పాటుచేశాడు. నిజానికి ఆ జమీందారుకు సంగీతజ్ఞానం శూన్యం. తాను సంగీత ప్రియుడని పొగడ్తనందుకోవాలనే చాపల్యం మాత్రం మెండు.

రాజరత్నంపిళ్లే కచేరి రసవత్తరంగా జరుగుతోంది. అప్పుడప్పుడే ఆయన తోడిరాగాన్ని బ్రహ్మాండంగా వినిపించారు. జమీందారు ఇదే మంచి సమయమని 'అయ్యా, పిళ్లేగారూ! నా కోసం మీరు తోడిరాగాన్ని కొంచెం వాయించగలరా? ' అన్నాడు. ఈ మాటవిని ఆ జమీందారుకు సంగీతజ్ఞానం లేదన్నది రాజరత్నం తెలుసుకున్నారు. అట్లాగని నిండుసభలో ఏమీ అనలేదు కదా! తన వెనుకగా కూర్చుని శ్రుతిపెట్టె వాయిస్తున్న పిల్లవాడి వైపు తలతిప్పి తన చేతితో వాడి చెంప చెళ్లుమనిపించాడు. 'అయ్యో, అయ్యో! ఆ పిల్లవాడు ఏమీ చేశాడండీ.. అలా చెంపలు వాయించేస్తున్నారు' అన్నాడు ఆ జమీందారు. 'అయ్యా జమీందారుగారూ, చూడండి మావాడేమి చేశాడో! నాకు తెలుసు మీలాంటివారు తోడిరాగం వాయించమని అడుగుతారని. ఆ మాటే వీడికి చెప్పి తోడి వాయించే నాగస్వరాన్ని మరచిపోకుండా తీసుకురమ్మని ఎన్ని విధాలుగానో చెప్పాను. ఈ వెధవ దాన్ని ఇంట్లోనే మరచి వచ్చినట్లు మెల్లగా ఇప్పుడు చెబుతున్నాడు. వీణ్ణేమి చెయ్యమంటారు, చెప్పండి? ' ఇది పిళ్లే సమాధానంలాంటి ప్రశ్న. 'పోనీండి, పాపం. చిన్న వయసు కదా! ఏదో పొరబాటు జరిగివుంటుంది. మరెప్పుడైనా మీరు ఇటు వస్తే మిమ్మల్ని అడిగి వింటానులెండి' అన్నాడు జమీందారు.

అప్పటి నిజం



రాజరత్నం పిళ్లే

అన్నాడు భూపతి నమ్మలేనట్లు.

"అవును, నేనిప్పుడు కలెక్టర్ని పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను. ఎందుకంటే నా విషయంలో నిన్నెప్పటికీ రాంగ్ నంబర్‌గా ఉంచడమే నా ధ్యేయం" అంది మాలతి.

★ ★ ★

ఫోన్ రింగవడంతో భూపతి ఆలోచనలకు బ్రేక్ పడింది. రిసీవర్ తీయగానే, "హలో భూపతీ! నేను గుర్తొచ్చానా, లేదా? " అంది అవతలి గొంతు.

"సీతారామయ్య" అన్నాడు భూపతి అప్రయత్నంగా.

"ఔను. సీతారామయ్యనే! మరి ఏ సీతారామయ్యనో కూడా గుర్తొచ్చిందా? "

"ఊc బ్రతకలేక బడిపంతులు"

"ఆc కరెక్ట్. బాగానే గుర్తుంచుకున్నావ్".

"గుర్తుంచుకోక? నిన్ను నేనెలా మర్చిపోతాను? " అన్నాడు భూపతి.

"మరి ఇందాకా ఫోన్ చేసినప్పుడే ఆ మాట చెప్పొచ్చుగా"

"చెప్పొచ్చు కానీ, ఎప్పుడూ లేంది.. నీ గొంతులో రవంత ధైర్యం ధ్వనిస్తే..."

భూపతి ఇంకా ఏదో అనబోతుంటే "రవంత కాదు, కొండంత" సవరించిందా గొంతు.

"ఎంతో అంత. ఆ ధైర్యం ఎక్కణ్ణించి వచ్చింది అని ఆలోచించగా ఆలోచించగా కష్టాలకు తట్టుకోలేక తాగుడుకో, డ్రగ్సుకో అలవాటుపడి ఉంటావని, ఆ మత్తులో అలా మాట్లాడి ఉంటావనీ తోచింది. ఫోన్లో నా గొంతు విన్నవెంటనే నీకెలాంటి మత్తూ దిగిపోతుందని తెలుసు. నువ్వు సారీ చెప్పడానికి రెడీ అయినా, మరి నేను

శాంతించడానికో అరగంటయినా కావాలిగా"

"అరగంట టైములో మంచి కథే అల్లావు. వెరీ ఇంట్రస్టింగ్... కంటిన్యూ" నవ్వాడు భూపతి. "అదీగాక- నువ్వెవరో నాకు తెలీదంటే- హమ్మయ్య బ్రతికిపోయా నని, ఇక నాకు ఫోన్ చేయవని కూడా అనిపించిందిలే. ఏదేమైతేనేం నీ అదృష్టం బాగుండి నేనిప్పుడు చాలా మంచి మూడ్‌లో ఉన్నాను. క్షమించమంటే క్షమించేస్తానేమో... అడిగి చూడు"

"సారీ టు డిజప్పాయింట్ యూ భూపతీ! నేనిప్పుడు చాలా బాడ్ మూడ్‌లో ఉన్నాను. క్షమించమనడం మాటటుంచి నువ్వు క్షమించమని బ్రతిమాలుకున్నా క్షమించను. అడిగి చూడు"

భూపతికి కోపం రాలేదు. ఆశ్చర్యం కలిగింది.

ఆయన బాధితులు చాలా మంది ఉన్నారు. వాళ్లు శాపనార్థాలు పెట్టిన సందర్భాలూ బోలెడున్నాయి. అప్పుడు వాళ్ళ అసహాయత స్ఫురించి, ఆయనకవి కర్ణపేయమై ఆహ్లాదాన్నిచ్చేవి. ఇప్పుడు ఫోన్లో సీతారామయ్య మాటలకీ అసహాయతే కారణం కావచ్చు. కానీ అసహాయతలో కూడా భూపతికి శాపనార్థాలు పెట్టలేని అసమర్థుడు సీతారామయ్య. మరి భూపతికి ఆశ్చర్యం కలుగదూ?

భూపతి తేరుకుని, "నేను నిన్ను క్షమించమని అడగడమా- కల కంటున్నావా?" అన్నాడు.

"కలలంటూ కంటే నేనే కనాలి. కలలు కనడానికి నీకు నిద్రే పట్టనివ్వనుగా"

"ఏమిటీ. ఊరుకుంటున్నానని రెచ్చిపోతున్నావ్? నీహద్దులు మర్చిపోయావా?"

"హద్దులా- నాకా? అదీ ఇప్పుడా?" అవతల సన్నగా నవ్వు.

"ఓహో- నీ హద్దులు మర్చిపోయినట్లున్నావు. గుర్తు చేస్తానుండు. నా పాదాల కింద చెప్పులుంటాయే. వాటికిందే నీ జీవితం. ఇప్పుడేమిటి- ఎప్పుడైనా సరే. అదే నీ హద్దు. దాన్ని దాటాలని చూసావో అధఃపాతాళానికి పోతావు" హెచ్చరించాడు భూపతి.

"నేనా హద్దునెప్పుడో దాటాను. ఎలా దాటానో చెబితే నీ గుండెలవిసిపోతాయి. అసలే గుండె బలహీనమై మంచమెక్కిన వాడివని జాలిపడి ఊరుకున్నాను కానీ ఇక నీ మూర్ఖత్వం విడిచిపెట్టు. ఓ గంట ఆగి మళ్లీ ఫోన్ చేస్తాను. ఆలోగా నువ్వు చేసిన పాపాల్ని ఒకటొక్కటిగా గుర్తు చేసుకుని ఫోన్లో నాకు చెప్పు. చేసిన పాపం చెబితే పోతుందంటారు కాబట్టి అది నీ మంచికే"

"నేనా... పాపాలు చెయ్యడమా?" చిరాగ్గా అన్నాడు భూపతి.

"నేనెవరో తెలియదన్నావ్. అరగంటలో గుర్తొచ్చాను. ఇప్పుడు పాపాలు చెయ్యలేదంటున్నావు. గంట టైమిచ్చాను. గుర్తు చేసుకుందుకా టైము చాలా ఎక్కువ" ఫోన్ కట్టయింది.

"హలో... హలో..." అన్నాడు భూపతి. తర్వాత నిట్టూర్చి రిసీవర్ని హుక్ చేయడంలో చేతి వేలు మంచంమీది కాలింగ్ బెల్ స్విచ్‌కి తగిలింది. మరు క్షణంలో పనివాడు గదిలోకొచ్చాడు.

పొరపాటున కాలింగ్ బెల్ మోగించినట్లు ఒప్పుకోవడం ఇష్టం లేక- మంచినీళ్ల డిగి తెప్పించుకుని తాగి పంపేసాడు వాణ్ణాయన. సీతారామయ్య తన ఆలోచనల్ని పూర్తిగా ఆక్రమించుకోవడం వల్ల నీళ్ళు తాగినా... ఆయనకు స్థిమితం కలగలేదు.

ఉన్నట్టుండి ఈ సీతారామయ్య ఎక్కణ్ణించి ఊడిపడ్డాడు? తన పాపాలు వింటాడట. విని ఏం చేస్తాడు? రికార్డు చేసి పోలీసులకు వినిపిస్తాడా?

అస్థిమితంలో కూడా భూపతికి నవ్వొచ్చింది.

తను చేసిన ఘోరాలు ఇన్నీ అన్నీ కావు. ఐనా జీవితమంతా ఎదుగుదలే తప్ప ఎక్కడా పోలీసుల ప్రసక్తే రాలేదు. మరి సీతారామయ్య తనని సులభంగా దెబ్బ తీయగలననుకుంటున్నాడా?

సీతారామయ్యపై తను తీసిన దెబ్బలు సామాన్యమైనవి కాదు. ఇంకా అతడికి బుద్ధి రాలేదా?

సీతారామయ్య సజ్జనుడు. అందుకు సందేహం లేదు. కందకము వోలె సుజనుడు అన్నట్లు అతగాడు తను పడగొట్టినప్పుడల్లా పైకెగిరే ప్రయత్నాలు చేస్తూ వచ్చాడు. ఇంజనీరింగుకు బదులు బియ్యేకి పంపిస్తే ఐ.ఎ.ఎస్ అయి కలెక్టరు కావాలని కల కన్నాడు. కానీ తనూరుకుంటాడా?

★ ★ ★

"మాలతి నీ ప్రియురాలు కాదు. శత్రువు" అన్నాడు భూపతి సీతారామయ్యతో.

సీతారామయ్య చలించలేదు, "ఎందుకట? " అన్నాడు.

"ఎప్పటికైనా నన్నే పెళ్ళాడక తప్పదని మాలతికి తెలుసు. నన్ను పెళ్ళాడేక నువ్వు నాకంటే గొప్పవాడివైతే ఆమె భరించలేదు. అందుకని భవిష్యత్తు గురించిన నీ ఆశల్ని ముందుగా నాకు చెప్పి రెచ్చగొడుతోంది. నేను రెచ్చిపోయి ఎప్పటికప్పుడు నీ తోక కత్తిరిస్తున్నా"

"నువ్వు రెచ్చిపోకు. ఏ సమస్యా ఉండదు"

"రెచ్చిపోకుండా ఎలా? మాలతిని ప్రేమిస్తున్న నేను- ఆమె అభీష్టం నెరవేర్చాలిగా!"

"ఐతే ఏమంటావ్? "

"నువ్వు ఐ.ఎ.ఎస్ పరీక్షలు రాయవు. టీచర్ ట్రైనింగ్ తీసుకుంటావు"

> **కొత్తగాలి...**
>
> **పండుగలు, పబ్బాలు**
> **రైతుల కేలండర్లో మారిపోయాయి-**
> **చేనుకు చీడలేనప్పుడే సంక్రాంతి**
> **పంటకు సరైన ధర వచ్చినప్పుడే ఉగాది**
>
> - ఎం.ఆర్.వి. సత్యనారాయణ మూర్తి,
> పెనుగొండ, ప.గో.జిల్లా

సీతారామయ్య తెల్లబోయి "ఇది అన్యాయం" అన్నాడు.

"నేను ప్రేమించిన మాలతిని నువ్వు ప్రేమించడంకంటే అన్యాయం కాదు"

"తోడేలూ మేకపిల్లా కథలా ఉంది. నన్ను ప్రేమించిన, నేను ప్రేమించిన మాలతిని నువ్వు ప్రేమించావ్. మర్చిపోకు"

"తోడేలు మేకపిల్లా ప్రసక్తి తెచ్చావుగా- వాదనలాపి- టీచర్ ట్రైనింగుకి వెళ్ళు"

"వెళ్ళను"

"ఇప్పుడలా అన్నా తర్వాత విచారిస్తావ్? నా మాటవిని ముందీ అప్లికేషన్ ఫిల్‌చేసి నాకివ్వు. పోస్టు ఖర్చులు నేనే పెట్టుకుంటాలే" అంటూ భూపతి అతడికో ఫారం ఇచ్చాడు.

ఏమనుకున్నాడో సీతారామయ్య అతడిచ్చిన ఫారం నింపాడు. భూపతి వెళ్లిపోయేక ఐ.ఎ.ఎస్.కీ ఓ అప్లికేషన్ పంపాడు. కానీ అది ముగింపు తేదీ తర్వాత గమ్యం చేరడంతో ఒక ఏడాది పోయింది. ఇష్టంలేకున్నా ఆ ఏడాది టీచర్ ట్రైనింగ్‌కి వెళ్లాడు. రెండో ఏడాది కూడా ఐ.ఎ.ఎస్.కి అప్లికేషన్ పంపితే కవరుమీద అడ్రస్ తప్పంటూ అది వెనక్కొచ్చేసింది.

రెండుసార్లూ భూపతి హస్తమే తననడ్డుకుందని సీతారామయ్యకు తెలుసు. కానీ ఆ హస్తాన్ని ఎదుర్కొనే ధనమూ,

బలమూ లేక అతడు బడిపంతులైపో యాడు.

"నిన్ను బడిపంతులుగానూ ఎదగని వ్వను. ఇకనైనా మాలతికి చెప్పు- నన్ను ప్రేమించమని!" అన్నాడు భూపతి.

సీతారామయ్య భూపతిని చురుగ్గా చూసాడు. "చెప్పను. ఇకమీదట నేను పూర్తిగా మాలతిమీదే ఆధారపడతా. ఆమె నాకు తోడుంటే నరకం కూడా స్వర్గమవు తుంది" అన్నాడు మొండిగా.

"పగటికలలొద్దు. మాలతిని నేను పెళ్లా డతా. అప్పుడామెకు వేరే నరకాన్ని స్వర్గం చేయాల్సిన అగత్యం లేదు. నేరుగా స్వర్గంలో ప్రవేశించి నన్ను సుఖపెట్టి తానూ సుఖపడుతుంది"

"అయితే పెళ్లి చేసుకో- వద్దనేదెవరు? "

"ఒకరు వద్దంటే ఆగేవాణ్ణికాదు నేను. మాలతిని ప్రేమిస్తున్నా. ఆమె మనసుకి కష్టం కలక్కుండా పెళ్ళాడాలని నా కోరిక. అందుకే మా పెళ్ళి లేటవుతోంది"

"నువ్వు మాలతిని ప్రేమిస్తున్నావా? అసలు ప్రేమంటే తెలుసా నీకు? "

"అది తర్వాత చెబుతా. ముందు ప్రేమంటే నీకేం తెలుసో చెప్పు" అన్నాడు భూపతి.

"తప్పకుండా చెబుతా. అదీ మాటల్లో కాదు. రేపటిదాకా ఆగు" అన్నాడు సీతారా మయ్య.

సీతారామయ్య మాలతిని ఏ గుళ్ళోనో పెళ్ళి చేసుకొస్తాడన్న అనుమానం లేదు భూపతికి. అలాంటి పెళ్ళి ఇరు కుటుంబా లకూ ప్రాణాంతకమని ఎప్పుడో హెచ్చరిం చాడు తను. ఐనా సీతారామయ్య ఏం చేస్తాడో తెలియక ఆ రోజంతా భూపతికి టైము గడవలేదు. రాత్రి నిద్రపట్టలేదు. మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంటకు భూపతి సీతారామయ్యని అతడు పనిచేసే స్కూల్లో లంచ్ టైములో కలుసుకున్నాడు. సీతారామయ్య అతడికి 'గాలిబ్ గీతాలు' పుస్తకాన్నిచ్చి, "నువ్వేమనుకున్నా నేను నీకు మంచి మిత్రుణ్ణి. ప్రేమంటే చెప్పమ న్నావ్. అది నా వల్లకాక మరో మంచి నేస్తమయిన ఈ పుస్తకాన్ని ఇస్తున్నా! ఇది చదివితే ప్రేమంటే తెలుస్తుంది" అన్నాడు.

గాలిబ్ గీతాలు. కవి గాలిబ్ సాటిలేని ఉర్దూ కవితలకు, మహాకవి దాశరథి దీ టయిన అనువాదం. వాటికి అసమాన చిత్రకారుడు బాపు అందించిన పసందైన మేటిచిత్రాలు. కవరు పేజీ తిప్పగానే, "ప్రియమిత్రుడు భూపతికి- ప్రేమతో సీతా రామయ్య" అన్న వాక్యం.

"ఇది మామూలు పుస్తకం కాదు. ప్రేమనీ, వేదాంతాన్నీ అద్భుతంగా మేళ వించిన నభూతో నభవిష్యతి కవిత్వం" అన్నాడు సీతారామయ్య.

"తప్పనిసరయి క్లాసు పుస్తకాలు చదు వుతా కానీ పుస్తకాలకీ నాకూ ఆమడ దూరం. ఇక కవిత్వమంటే బొత్తిగా గిట్టదు" అంటూ భూపతి అతడికి పుస్త కాన్ని వెనక్కివ్వబోయాడు.

సీతారామయ్య తీసుకోలేదు. "మనిషికి పుస్తకాన్ని మించిన మంచి మిత్రుడుండదు. ఏదో రోజున నీకా విషయం తెలుస్తుంది. అప్పుడే ఇది చదువు" అన్నాడు.

"నువ్వన్నావని తీసుకుంటా కానీ- చద వడం డౌటే"

చదివేదాకా ప్రేమంటే తెలియదు.

నా సంగతి తెలుసుగా- నాకు తెలియని ప్రేమ నీ దగ్గరుంటే భరించలేను. కాబట్టి నువ్వు మాలతిపై ప్రేమని చంపుకో. నేను వెంటనే ఆమెని పెళ్ళి చేసుకుంటాను" గంభీరంగా అన్నాడు భూపతి.

"నీ పెళ్ళి కోసం నా ప్రేమనెందుకు చంపుకోవాలి? "

"నేను నీకు ప్రియమిత్రుణ్ణి కాబట్టి

నువ్వు ప్రేమించిన అమ్మాయిని పెళ్ళి చేసుకోలేను. నువ్వు నాకు ప్రియమిత్రుడివి కాబట్టి ఆమెపై నీకున్న ప్రేమను చంపుకోవాలి. అదే స్నేహమంటే!"

"ఇదేం స్నేహం?" అన్నాడు సీతారామయ్య నీరసంగా.

"నా స్నేహం? ఇలాగే ఉంటుంది. వెళ్ళు. మాలతికి నచ్చజెప్పి ఆమె భవిష్యత్తుకి బంగారుబాట వెయ్యి. అప్పుడు నీ భవిష్యత్తుకి కనీసం పూలబాటైనా పడుతుంది"

"అయాం సారీ మైడియర్ ఫ్రెండ్" పొగరుగా కాకున్నా కచ్చితంగానే చెప్పాడు సీతారామయ్య.

"నా అంతటివాణ్ణి ఢీకొంటే ఆ తర్వాత జీవితమంతా సారీయే నీకు" హెచ్చరించాడు భూపతి.

"బ్రతుకుపైనింత విశ్వాసపడెదరేల, ఏడి మాంధాత పురుకుత్సుడేడి నేడు అన్నాడు గాలిబ్."

"ఇలాంటి వేదాంతాన్ని నమ్ముకుంటే నాశనమైపోతావ్" మళ్ళీ హెచ్చరించాడు భూపతి.

"నాశమందు కూడ నవసౌఖ్యమున్నది, నఖము కత్తిరింప సుఖము కలుగు- అన్నాడు గాలిబ్"

భూపతికి ఉక్రోషమొచ్చింది, "సీతారామయ్యా! నువ్వు గోటితో పోతుందనుకుంటున్నావ్. కానీ వ్యవహారం గొడ్డలిదాకా వెడుతోంది, జాగ్రత్త"

"పుడమి పలకమీద పొడమిన అధికాక్షరమునుగాను నేను రాచివేయ"

అతడి ధైర్యానికి ఆశ్చర్యపడ్డ భూపతి, "ఇదీ ఆ గాలిబే అనుంటాడు కానీ- ఒరేయ్- నా స్వప్న సుందరని తెలిసీ- ఎందుకురా- ఇంకా మాలతినొదలవు?" అంటూ కాళ్ళ బేరానికొచ్చాడు.

సీతారామయ్య నవ్వి, "స్వయంవరానికి వచ్చిన వారంతా సీత గురించి కలలు కన్నారు. అలాగని రాముడామెను పెళ్ళాడ్డం మానేడా? గాలిబ్ అయితే- 'ఏల కాళ్ళునొచ్చె బాలామణికి? రాత్రి ఎవని

## చతురలో మూడో నవల



రాజగోపాలరావు - రామలక్ష్మి

బంధుమిత్రులకు జొన్నలగడ్డ రాజగోపాలరావు, రాయవరపు రామలక్ష్మి దంపతులుగా, పాఠకులకు 'వసుంధర'గా సుపరిచితులం. దశాబ్దాల రచనావ్యాసంగంలో భక్తి-రక్తి, నేరం-హాస్యం, సామాజికం-రాజకీయం, విజ్ఞానం రంగరించిన ఇతివృత్తాలతో బాలల నుంచి వృద్ధులదాకా అందరి కోసం రాసిన నవలలు నూరుకు మించాయి. కథలు వేయి దాటాయి. అడపాదడపా వచన కవిత, నాటిక, వ్యాసం తదితర సాహితీ ప్రక్రియలు చేస్తుంటాం. ఎన్నో పత్రికల నుంచి, కొన్ని సంస్థల నుంచి బహుమతులు, సత్కారాలు లభించాయి. కొన్ని రచనలకి సినిమాయోగం కలిగింది కూడా. మనో విశ్లేషణ ప్రధానమైన ఈ నవల కథనంలో మహాకవి దాశరథి అనువదించిన గాలిబ్ గీతాలు ఇమిడిన తీరుపై పాఠకుల స్పందన కోరుతున్నాం. చతురలో మాకిది మూడో నవల.

**వసుంధర**

శ్రీ వాణి గిరిజా నిలయం,
63 సాకేత్ ఫేజ్ 1, కాప్రా,
ఇ.సి.ఐ.ఎల్. పోస్ట్,
హైదరాబాద్-500062

## కొత్తగాలి...

**నేటి బాలలు**
**బట్టీబాట పడుతున్నారు**
**చదువులేక..**
**బాలకార్మికులవుతున్నారు**
**బతుకులేక**

– మేడిచర్ల సూర్య ప్రకాశరావు,
రామరాజులంక, తూ.గో.జిల్లా

స్వప్నసీమ కేగి వచ్చె?' అంటూ ముచ్చట పడ్డాడు. నా ఫిలాసఫీ కూడా అదే" అన్నాడు.

"అలా ముచ్చటపడుతుండు. ఆమె పేరుచెప్పి ఇంకా ఇంకా కష్టాలు పడతావు"

"తరుణి చేతి అంబు తగులునట్టుగ నిల్చి, గాయపడగ కోర్కె కలదు నాకు, అంబు తగులకేగ, అద్దాని కొని తెచ్చి వెల దికిత్తు మరల వేయమనుచు"

సీతారామయ్య ముఖంలో భయంలేదు, కోపంలేదు, బాధలేదు, బెంగలేదు.

"ఏమిత్రా-ఉన్నట్లుండి నీకు గాలిబ్ పిచ్చి పట్టింది?" అన్నాడు భూపతి ఆశ్చర్యంగా.

"ఇది గాలిబ్‌పిచ్చి కాదు- మాలతిపై ప్రేమ"

"ప్రేమవరకూ బాగానే ఉంది. కానీ మాలతి నాది. ఆమెని తప్ప ఇంకెవరినైనా ప్రేమించు. నీ ప్రేమకి సాయపడతాను"

"అదే మాట నేనంటే?"

"ప్లీజ్- నేను మాలతిని వదులుకోలేను"

"ఎందుకొదులుకోలేవు?" గద్దించాడు భూపతి.

"నువ్వెందుకొదులుకోలేవు?" శాంతంగా అడిగాడు సీతారామయ్య.

సమాధానం స్ఫురించక, "నేనెందుకు చెప్పాలి?" అన్నాడు భూపతి బింకంగా.

"పోనీ నేను చెబుతా- ఆమె తోటకు వాహ్యాళికరిగెనంట, ఇంక తోటలో పూలు వాంఛించునెవడు"

నిజమనిపించింది భూపతికి. ప్రియురాలి గొప్పతనాన్ని రెండే రెండు వాక్యాల్లో కవి ఎంత గొప్పగా వివరించాడు? నిస్సందేహంగా మాలతిలో ఏదో గొప్పతనముంది. కానీ ఆ గొప్పతనం తనవంటి గొప్పవాడికి దక్కాలి. సీతారామయ్యవంటి సామాన్యుడికి కాదు, "ప్రేమ మత్తులో ఉన్నావ్. బయటపడకపోతే నీకు దక్కేది ప్రణయంకాదు. భీకర ప్రళయం!" గర్జించాడు భూపతి.

"తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదరవు. గాలిబ్ ఏమన్నాడో తెలుసా- 'వెలది నీ ప్రణయాకృతి కొలుతునేని, ప్రళయబీభత్సమే ఒక నిలువు చిన్న'-అని!"

"ఏమిత్రా- ఇందాకట్నుంచి- గాలిబ్ గాలిబ్ అంటూ ఒకటే నస" అన్నాడు భూపతి చిరాగ్గా.

"నేనిచ్చిన పుస్తకం తెరిచి చదువు. నస అన్నందుకు సిగ్గుతో కుంచించుకుపోతావ్"

"చదువుతా- మరి నువ్వు మాలతిని మర్చిపోతావా?"

"చదివేక ఆ మాట అను. అప్పుడు చూద్దాం" నవ్వాడు సీతారామయ్య సవాలు చేస్తున్నట్లు.

భూపతి మరి మాట్లాడలేదు. మాలతిని కలిసి జరిగింది చెప్పాడు.

"సీతారామయ్య చెప్పేకనే గాలిబ్ కవితల గొప్పతనం తెలిసింది నాకు. క్లాసు పాఠాలేకాదు, ఏమర్థం కావాలన్నా మనకి సీతారామయ్య సాయం కావాలి. హి ఈజ్ గ్రేట్" అంది మాలతి.

"సీతారామయ్య గ్రేటంటే నేనొప్పుకోను. గ్రేటంటే నేను" అన్నాడు భూపతి.

"పోనీ అలాగే అనుకో" అంది మాలతి తేలికగా.

"ఒప్పుకుంటే సరిపోదు. నేను గ్రేట్. కాబట్టి నన్ను పెళ్ళి చేసుకోవాలి"

"కానీ నేను గ్రేట్‌ని పెళ్ళి చేసుకోవాలను

కోవడం లేదే!"

"చేసుకోవాలి. మన పురాణాలే చూడు. సీత రాముణ్ణి చేసుకుంది. ఆయన కోసల దేశపు యువరాజు. దమయంతి నలుణ్ణి చేసుకుంది. ఆయన నిషధ భూపతి. రుక్మిణి కృష్ణుణ్ణి పెళ్ళి చేసుకుంది. ఆయన ద్వారకాధీశుడు...."

"ఆగు, వీళ్ళెవ్వరూ నాకాదర్శం కాదు. నాకు సావిత్రి ఆదర్శం. ఆమె సత్యవంతుణ్ణి పెళ్ళి చేసుకుంది. పెళ్ళయ్యేక అతడికి పోయిన సంపదలూ, ప్రాణం కూడా తిరిగొచ్చేలా చేసింది"

తను కూర్చిన ఉదాహరణలను మాలతి ఇట్టే కొట్టేస్తే భూపతికి ఉక్రోషమొచ్చి, "నీవల్ల నేను నా స్నేహితుణ్ణి హింసిస్తున్నానని నాకే బాధగా ఉంది. నీకు చీమ కుట్టినట్లైనా లేదు" అన్నాడు.

ఆ బెదిరింపు మాలతికి కొత్త కాదు. కానీ సీతారామయ్య కష్టాలన్నింటికీ తనే మూలకారణమని మరోసారి స్ఫురించి మనసు కలుక్కుమందామెకి. అది పసికట్టిన భూపతి అదే అదననుకుని, "స్నేహానికి ప్రాణం పెట్టే నేను సీతారామయ్యని హింసించకుండా ఏదో చేసి ఆపు" అన్నాడు.

అప్పటికి మాలతి ఆలోచనలు కొలిక్కి వచ్చాయి. ప్రేమని నమ్ముకుని భూపతిని అలక్ష్యం చేస్తే సీతారామయ్య జీవితం నాశనమైంది. ఐనా సీతారామయ్య స్థితప్రజ్ఞుడిలా ఇంకా ప్రేమనే నమ్ముకున్నాడు. ఇప్పుడు తను సందిగ్ధంలో పడితే అది ప్రేమకే అన్యాయం.

నిజానికీ ప్రేమకథకు శ్రీకారం చుట్టింది తను. అప్పుడది ప్రేమపోరాటంగా మారుతుందని తెలియదు. అభిమన్యుడు పద్మవ్యూహంలోలా తనూ ఈ ప్రేమవ్యూహంలో ప్రవేశించింది. ఇక విజయమో, వీరస్వర్గమో తప్ప ప్రత్యర్థి అన్యాయానికి తలపడ్డాడని వెన్ను చూపకూడదు.

"ఏం- మాట్లాడవు?" మాట్లాడితే తనకి అనుకూలంగా బదులొస్తుందన్న ఆశతో అన్నాడు భూపతి.

"నీది హింస, స్వార్థం. మాది ప్రేమ, స్నేహం. రెంటికీ పొసగదు"

"నీ ప్రేమని నా మీదకి మళ్ళించు. నా హింస స్నేహంగా మారితే సీతారామయ్యకి రక్షణ. లేదూ అతడికి రక్షణ లేదు. ఆ విషయం ఇప్పటికెన్నోసార్లు రుజువైంది"

"ప్రేమ ప్రళయానికి కూడా భయపడదు. నువ్వెంత?" అంది మాలతి.

"అవును- నీ ప్రణయాకృతి కొలుతునేని, ప్రళయబీభత్సమే ఒక నిలువు చిన్న- అంటూ గాలిబ్‌ని కోట్ చేసాడు సీతారామయ్య. కానీ ప్రేమ గురించి నేను విన్నది వేరు- అది ప్రళయాన్నాపడంకోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడుతుందట" అన్నాడు భూపతి.

"నిజమే! ప్రళయాన్నాపడం కోసం ప్రేమ ఎటువంటి త్యాగానికైనా సిద్ధం. కానీ ప్రియుణ్ణి త్యాగం చెయ్యమంటే- అప్పుడు ప్రళయానిక్కూడా వెరవదు" నిబ్బరంగా అంది మాలతి.

"పిచ్చిదానివి. నువ్వు సుఖపడవు. అతణ్ణి సుఖపడనివ్వవు"

"నీకు ప్రేమవేరు, సుఖంవేరు కావచ్చు. కానీ ప్రేమే సుఖమనుకుంటాం మేము"

"నువ్విలా వినవు. నేను నా చేతుల్తో సీతారామయ్యను చంపేస్తాను" అన్నాడు భూపతి కసిగా.

"సీతారామయ్య ఊపిరి పీల్చినంతకాలమే నేనూ ఈ భూమ్మీద బ్రతికుంటాను" అంది మాలతి.

"నిన్ను చావనివ్వను" అన్నాడు భూపతి.

"అయితే అతణ్ణి బ్రతకనివ్వక తప్పదు నీకు"

"కానీ నేను నిన్ను పెళ్లాడతాను"

"అది నీ తరం కాదు"

"నీకు తెలియదేమో- నీ పెళ్ళికి నీ ఇష్టంతో పనిలేదు" భూపతి కొత్త అస్త్రం సంధించాడు.

"ఇష్టంలేని పెళ్ళి చేసుకోవాల్సి వస్తే చచ్చిపోతాను" అంది మాలతి.

"నిన్ను చావనివ్వ" అన్నాడు భూపతి.

"నా చావు నా ఇష్టం" అంది మాలతి.

"అదీ నిజం కాదని రుజువు చేస్తాను" అన్నాడు భూపతి.

తర్వాత అతడు మాలతి తలిదండ్రుల్నీ, అన్నా వదినల్నీ కలుసుకున్నాడు. చతుర్వి ధోపాయాలను చాతుర్యంగా ప్రయోగించాడు.

"నేను మీ దగ్గర ఏమీ దాచను. ఉన్న దున్నట్లు చెబుతాను" అంటూ అతడు వాళ్ళకి అన్నీ నిజాలే చెప్పాడు. ఐతే చెప్పేలా చెబితే నిజమూ వ్యాపార ధర్మ మౌతుందని అతడికి తెలుసు.

మాలతినీ, ఆమెనలా తీర్చిదిద్దిన పెద్దల్నీ మెచ్చుకుని, "పొగడ్తలు మీకు సామాన్యం కావచ్చు. కానీ నా పొగడ్తలు విన్నాక మీ జీవితం సామాన్యంగా ఉండదు" అన్నాడు ఆశ పెడుతూ. అతడి మాటల్లో వాళ్ళు హంసతూలికా తల్పాలెక్కారు. దాసదాసీజ నాల సేవలందుకున్నారు. విమానాల్లో విహారయాత్రలు చేసారు.

"మెచ్చుకున్న వారందర్నీ అందలాలెక్కించను. మీరు మాలతికి కావలసినవాళ్ళు కాబట్టి నాకూ అంతే. కారణం నేను మాలతిని ప్రేమిస్తున్నాను" అంటూ విషయాని కొచ్చాడు. మాలతికిలాంటి వరుడొస్తాడని ఊహించని వాళ్ళాశ్చర్యంనుంచి తేరుకునే లోగా, "నేను మాలతిని ప్రేమించడంలో ఆశ్చర్యంలేదు. కానీ ఆమె సీతారామయ్యని ప్రేమించడం ఆశ్చర్యమే" అన్నాడు.



అతడు మాలతికి లోకం తెలియదన్నాడు. భవిష్యత్తునూహించే తెలివి లేదన్నాడు. "ఉంటే నన్ను కాదనదు కదా!" అంటూ చెప్పాడు. అందం, చదువు, సంస్కారాల్లో- మాలతి తలదన్నిన అమ్మాయిలు తనకోసం క్యూలో ఉంటే- కాదని మాలతి వెంటబడుతున్నానన్నాడు. తన ఇంట్లోవాళ్ళకి మాలతి గురించి నచ్చజెప్పి అతికష్టం మీద తమ పెళ్ళికి కూడా ఒప్పించానన్నాడు. తన్ను పెళ్ళి చేసుకుంటే ఆమె సుఖపడుతుందన్నాడు.

అలా సామదానోపాయాలయ్యాక సీతా

రామయ్య ప్రసక్తి తెచ్చి, "వాడు నాకు బాల్యమిత్రుడే కానీ చేతకానివాడు. చేత కానీ లేనివాడు. అయినవాళ్ళని సుఖపెట్ట లేడు. ప్రేమించిన అమ్మాయికి సుఖపడే



సలహా ఇవ్వలేడు. నావంటి మిత్రుడిచ్చే చేయూతతో ఆకాశమంత ఎత్తు ఎదగాల్సి నవాడు- పాదాల కింద అణిగి పాతాళానికి జారిపోతున్నాడు" అంటూ నిట్టూర్చాడు.

సీతారామయ్య ఏంకావాలని ఏమ య్యాడో, అందుకు మాలతి ఎలా కారణ భూతురాలైందో వివరించి, "నాకు సీతారా మయ్యంటే సానుభూతే కానీ మూర్ఖుల్ని క్షమించను. సీతారామయ్యకి పట్టిన గతి చూసిన మాలతి మీకూ అలాగే జరుగు తుందనుకుంటోంది. అయితే ఆ భయం అర్థంలేనిది. ఎందుకంటే నాకు తెలుసు- మీరు మూర్ఖులు కారని" అన్నాడు.

మాలతి తలిదండ్రులకీ, అన్నావదినలకీ నోటమాట ఁ-లేదు.

"మిమ్మల్ని చూస్తుంటే నేనేదో మిమ్మల్ని బెదిరించడానికొచ్చానా అనిపించవచ్చు. కానీ నిజానికి నా ప్రేమనర్థం చేసుకోమని వేడుకుంటున్నానంతే!" అంటూ ముగించా డతడు.

వాళ్ళకి భూపతి ప్రేమ బాగా అర్థమైంది. అతడు వెళ్ళి పోయాక ఆ రాత్రి మాలతితో, "ఆ అబ్బాయి నువ్వంటే ఇష్ట పడి పెద్ద అంతస్థునుంచి కిందకి దిగొచ్చాడు. నిన్ను పెళ్ళాడి సుఖపెడతానంటు న్నాడు. ఈ సంబంధం మనక న్నివిధాలా మంచిది" అన్నారు మాలతి తల్లిదండ్రులు.

"సంబంధం మంచిదైనా ఆ అబ్బాయి మంచివాడు కాదు" అంది మాలతి.

"డబ్బువల విసిరి ప్రేమ పేరుతో ఆడపి ల్లల్ని మోసం చేస్తే- వాళ్లు చెడ్డవాళ్లు. నేరుగా పెద్దల్ని కలిసి పెళ్ళి చేసుకుంటాన నేవాళ్ళ మంచితనాన్ని శంకించినా నేరమే!" కోపంగా అన్నాడు మాలతి తండ్రి.

"భూపతి గురించి మీకు తెలిసింది మీరు, నాకు తెలిసింది నేను చెప్పుకున్నాం. అతడి మంచితనాన్ని శంకించను. అయినా దారిన పోయే దానయ్యలమీద వ్యాఖ్యలెందుకు? " అంది మాలతి.

"ఆ అబ్బాయేం దానయ్య కాదు. నీకూ

అతడికీ పెళ్ళి నిశ్చయించాం" అంది మాలతి తల్లి.

"నా పెళ్ళి నా ఇష్టానికి వదలండి" అంది మాలతి.

ఎప్పటికీ మాలతి తన పట్టు వదలక పోగా, "ఐతే మమ్మల్ని మా కర్మానికి వది లేస్తావా? " అన్నాడామె అన్న. భూపతి తనవాళ్ళని బెదిరించి భయపెట్టాడని అప్పుడర్థమైంది మాలతికి. ఆమెకి నోట మాట రాకపోగా, అదామె అర్ధాంగీకారంగా తీసుకుని సంతోషించారు ఇంట్లోవాళ్ళు.

మర్నాడు మాలతి సీతారామయ్యని కలిసి, "అనుకున్నట్లే భూపతి అట్నించి నరుక్కొచ్చాడు. ఇక లాభం లేదు. ఏదో ఒకటవుతుంది. మనం గుళ్ళో పెళ్ళి చేసే సుకుందాం" అంది మాలతి.

"దేవుడు కూడా భూపతి మనిషే. మన పెళ్ళికి ఏ గుడి తలుపులూ తెరుచుకోవు" అన్నాడతడు.

"పోనీ పెళ్ళికాకుండానే మనమొకటై పోదాం. పెళ్ళికి ముందే తొందరపడ్డామని అందరూ తప్పుపడితేనేం- భూపతి నా జోలికి రానుకాక రాడు" అంది మాలతి.

ఆమె ముఖంలో సంకోచం లేదు. మాటలో తడబాటులేదు.

"ఆడపిల్లవి, నీకీ మాట శోభనివ్వదు. నిజానికీమాట నేననాలి. అనకపోవడానికి కారణం- మన ఆదర్శాలు. ప్రేమ భగ్నమై నా మన ఆదర్శాలు భగ్నం కాకూడదు" అన్నాడు సీతారామయ్య.

"ప్రేమకంటే ఆదర్శాలు గొప్పవనుకోను" అంది మాలతి.

"అయితే నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. నా సహకారం లేకపోతే నన్ను తప్పు పట్టకు" అన్నాడతడు. అప్పటికి తన మాటల అర్థం స్ఫురించి సిగ్గుతో బిక్కచ చ్చిపోయిన మాలతిని చూసి, "ఆలో చనలేని ఆవేశం మనిషినెంతకైనా దిగజా ర్చగలదు" అన్నాడు.

ఆమె సారీ చెబితే అతడు తన అసహా యత తల్చుకుని తల దించుకున్నాడు.

"ఐతే మనమిక ఏం చెయ్యలేమా? " అంది మాలతి.

"మాన సంరక్షణకి చేసే హత్య తప్పుకాదని చట్టం కూడా అంటుంది. భూపతిని చంపేద్దాం."

దిమ్మెరపోయిన మాలతి, "నువ్వు హత్యని సమర్థిస్తున్నావా! చట్టం, న్యాయాల సంగతి అటుంచి మన ఆద ర్శాల మాటేమిటీ? "

"ఇప్పుడు మన ఆదర్శాలకొచ్చిన లోటే మిటి? "

"హత్య మహాపాతకం. అది దుర్మా ర్గులు చేసే పని" అంది మాలతి.

"భూపతి రాక్షసుడు. అతడ్ని చంపితే ప్రపంచానికో పెద్దపీడ విరగడవుతుంది. అందుకు దేవతలు మనపై పూలవాన కురి పించొచ్చు" అన్నాడు సీతారామయ్య.

మాలతి అతణ్ణి అదోలా చూస్తూ "అయితే భూపతిని నువ్వు చంపుతావా? " అంది.

సీతారామయ్య అదోలా నవ్వి, "ప్రేమ భగ్నమైనా ఆదర్శాలు భగ్నం కాకూడదు" అన్నాడు. మాలతి తేలికగా నిట్టూర్చి "నువ్వు గుడ్‌బాయ్‌వి. హత్యలు చెయ్యవు. అలాంటప్పుడసలా ప్రపోజల్ ఎందుకు తెచ్చావ్? " అంది.

"హత్య నువ్వు చేస్తావని"

మాలతి తెల్లబోయి, "అంటే నేను నీకు హత్యలు చేసేదానిలా కనిపిస్తున్నానా? " అంది.

"మరి నీకు నేను అత్యాచారం చేసేవా డిలా కనబడుతున్నావా? "

అప్పుడిద్దరికీ తమ సమస్య లోతుతో పాటు వ్యక్తిత్వాల లోతూ అవగతమై భారంగా నిట్టూర్చారు. దొంగకి లేని పరి

మితి పోలీసులకుంటుంది. అందుకే దొంగ నేరం చేసినంత సులభంగా పోలీసు దొంగని పట్టుకోలేడు. దుర్మార్గుల ఆగడాలపై సన్మార్గుల ప్రతిఘటన ఫలించేందుకు ఎక్కువకాలం పట్టడానికీ అదే కారణం. భూపతి, సీతారామయ్యల సమస్యా అదే!

చివరికి, "నాకో ఉపాయం తోస్తోంది. మనమెలాగూ కాలు జారాలనుకునే స్థితికి దిగజారాం. నిజంగా కాలు జారామని భూపతికి అబద్ధం చెబితే?" అన్నాడు సీతారామయ్య.

ఉపాయం బాగుంది కానీ ఆ మాట సీతారామయ్య చెబితే భూపతి అతణ్ణి చంపేస్తాడు. కాబట్టి మాలతే ఆ అబద్ధం చెప్పాలి.

"ప్రేమ భగ్నమైనా మన ఆదర్శాలు భగ్నం కాకూడదు" గంభీరంగా అంది మాలతి. నవ్వాడు సీతారామయ్య. తనూ నవ్వింది మాలతి. కానీ ఇద్దరి నవ్వుల్లోనూ జీవంలేదు.

"భూపతి వరగర్వితుడైన రాక్షసుడు. అతడికి నాశనం లేదనిపిస్తుంది" అంది మాలతి నిరాశగా.

"అలాంటి రాక్షసులు తమని తామే నాశనం చేసుకుంటారు. ఎవరి నెత్తిన తన చేయి పెడితే వారు బూడిదైపోతారన్న వరం పొందిన భస్మాసురుడి కథ తెలుసుగా. మోహిని మత్తులో పడి తన నెత్తిన తానే చేయి పెట్టుకుని బూడిదైపోయాడు" అన్నాడు సీతారామయ్య.

"ఐతే?"

"భూపతి భస్మాసురుడు. నేను శివుణ్ణి. నీవు మోహినివి. నీ కారణంగానే భస్మాసురుడు నాశనమవుతాడు. అంతవరకూ నేను ప్రాణరక్షణకై పరుగులు తీస్తూనే ఉండాలి" అన్నాడు సీతారామయ్య.

"వినడానికి బాగుంది. భూపతి తొందరగా చస్తే బాగుణ్ణు" అంది మాలతి.

"మనకి బాగుంటుందని భూపతి

## కొత్తగాలి...

**మోసం చేసినప్పుడనుకున్నా**
**నేనే.. వీర వెంకటప్పనని**
**మోసగించబడినప్పుడు తెల్సింది**
**ఉత్త.. వెర్రి వెంగళప్పనని!!**

—ఊతూరు జగదీశ్వరరావు,
సత్తుపల్లి, ఖమ్మం జిల్లా

చావడు. వరగర్వితుడి చావుకి చాలాకాలం ఎదురు చూడాలి. ఈలోగా నేను భూపతికో ఆకాశరామన్న ఉత్తరం రాస్తేమనం నోటితో చెయ్యలేని పని ఆ ఉత్తరం చేస్తుంది. ఏమంటావు?" అన్నాడు సీతారామయ్య. మాలతి సరేనంది.

సీతారామయ్య, మాలతి తొందరపడ్డారన్న అబద్ధం ఆకాశరామన్న ఉత్తరమై భూపతిని చేరింది. భూపతి ఆ ఉత్తరం చదివాక సీతారామయ్యనీ, మాలతినీ పిలిచి ఆ ఉత్తరం చూపించాడు. "మీరు మంచివాళ్లనుకున్నాను. కానీ తప్పు చేసారు" అన్నాడు.

అవుననక, కాదనక- వాళ్లిద్దరూ తలలు దించుకున్నారు.

"ఇదో విచిత్ర ప్రపంచం. తప్పు చేసిన వాళ్లు మంచివాళ్లుగా చెలామణీ అవుతుంటే ఆ తప్పును క్షమించేవాళ్లు చెడ్డవాళ్లని ప్రచారం అవుతుంది" అన్నాడు భూపతి మళ్లీ. ప్రేమికులిద్దరూ దించిన తలలెత్తలేదు.

"ఇంజనీరవ్వుదామనికున్నావు, కాలేదు. కలక్టరవుదామకుని బడిపంతులయ్యావు. అయినా ఇంకా మాలతిని పెళ్లి చేసుకుందామనే నీ ఆశ. అది నెరవేరదని రూఢి కాగానే- తెగించావు. ఆమె శీలం దోచావు. ఇప్పుడు మాలతి నీది. నీ భార్య. కానీ ఏం చేస్తావామెని? పడుకుందుకు మంచముండదు. చాపమీద పడుకోబెడతావా? తిన

డానికి అన్నముండదు. గంజినీళ్లు పోస్తావా? పట్టు బట్టలు కొనలేవు- చింకి చీరలు చుట్టబెడతావా? చెప్పు ఏం చేస్తావు? " మిత్రుణ్ణి గద్దించాడు భూపతి. ప్రేమికులిద్దరూ ఇంకా తలలు దించుకునే ఉన్నారు.

"నువ్వు మాట్లాడవు. మాట్లాడలేవు. కానీ నేను మాట్లాడగలను, మాట్లాడతాను. ఈ ఆకాశరామన్న ఉత్తరం నా ప్రేమబలాన్ని నిరూపిస్తుంది. ఇది చదివే ముందు నేను మాలతిని ప్రేమించాను. చదివేక ప్రేమిస్తూనే ఉన్నాను. ఇప్పటికీ మాలతిని తప్ప ఇంకెవర్నీ పెళ్లాడనన్న నా నిర్ణయం మారలేదు. మాలతీ! నమ్మిన ఆడపిల్లని లొంగదీసుకున్న ద్రోహి ఈ సీతారామయ్య. వీడికి నిన్ను దక్కనివ్వను. ప్లీజ్! నా ప్రేమనర్థం చేసుకో. నాకు సహకరించు" అన్నాడు భూపతి.

సీతారామయ్య, మాలతి ప్రమాన్పడిపోయారు. తేరుకున్నాక భూపతి ప్రేమని తప్పు అంచనా వేసినందుకు సిగ్గుపడ్డారు.

ఈ ఉత్తరం నాన్న చేతుల్లో పడితే చావనైనా చస్తాడు కానీ మాలతిని మా ఇంటి కోడలు కానివ్వడాయన.

అదృష్టం బాగుండి ఇది నా చేతిలో పడింది. నాకు గతం వద్దు. మీరు గతం మర్చిపోండి. భవిష్యత్తులో ఒకర్నొకరే మర్చిపోండి" అని ఆ ఉత్తరాన్నక్కడే వదిలి వెళ్లాడతడు. ఊహించని ఈ పరిణామానికి ఎలా స్పందించాలో తెలియక ప్రేమికులిద్దరూ కాసేపు తర్జన భర్జన పడ్డారు. చివరకు, ఇంతగా నిన్ను ప్రేమించిన భూపతి ముందు నా ప్రేమ వెలవెలబోతోంది. నువ్వతణ్ణి పెళ్లి చేసుకోవడమే న్యాయం" అన్నాడు సీతారామయ్య.

"మిత్రుడి ప్రేమకి సర్టిఫికెటివ్వడం నీ ఇష్టం. కానీ పెళ్లిక్కావలసింది సర్టిఫికెట్లు కాదు, ప్రేమ"

"మరి మనం రాసిన ఆకాశరామన్న ఉత్తరానికి భూపతి స్పందన ఉదాత్తంగా లేదంటావా? "

"అందుక్కారణం నాకు తెలుసు. నీమీద నీకుగానీ, నీమీద నాకుగానీ, నామీద నాకుగానీ నామీద నీకుగానీ ఉన్న నమ్మకం కంటే భూపతికి మనిద్దరిమీదా ఉన్న నమ్మకం గొప్పది. అతడా ఉత్తరాన్ని నమ్మలేదు. మనను నమ్మాడు. ఐతే ఆ ఉత్తరాన్ని నమ్మినట్లు మన దగ్గర నటించాడు. అది అతితెలివే కానీ ఉదాత్త ప్రేమ కాదు" అంది మాలతి నమ్మకంగా.

సీతారామయ్య తెల్లబోయి, "కావచ్చు. కానీ మనమిప్పుడేం చేయగలం? " అన్నాడు తేరుకోగానే.

"ఇప్పుడే ఏమైనా చేయగలం. భూపతి అతి తెలివికిపోయి పప్పులో కాలేశాడు. దొంగోడా కరవకురా అన్నట్లు నువ్వు

## అక్కడే..

మద్రాసు నుంచి వేరే ఊరికొచ్చిన ఆరుద్ర, తన సన్నిహితుణ్ణి కలవడానికి వెళ్లారు. ఆయనతో మాట్లాడుతుండగా, బాగా తెలిసిన వ్యక్తి ఒకరొచ్చారు. 'మీరు అక్కడ అదే ఇంట్లో ఉంటున్నారా? ' అని పలకరించారు.

'ఆహా! ఆ ఇల్లే.. ఆ ఇల్లాలే' అని చమత్కరించారు ఆరుద్ర

**ఛోటా శాస్త్రి**



ఇరవై ఏళ్ల వయసులో ఉండగా, మిత్రులకు ఆరుద్ర ఎన్నో ఉత్తరాలు రాశారు. వాటిల్లో తన పేరు 'ఛోటాశాస్త్రి' అని రాసుకునేవారు (ఆయన అసలు పేరు సదా శివ శంకర శాస్త్రి). అప్పట్లోనే కొన్ని కార్డు కథలు రాసి వాటికి 'ఛోటా ఛోటాలనే పేరు కూడా పెట్టారు.

రాసిన ఉత్తరాన్ని నీ మొహాన్నే కొట్టి వెళ్ళాడు భూపతి. ఇప్పుడీ ఉత్తరం భూపతి తండ్రిని చేరిందనుకో..." ఆగింది మాలతి.

మాలతి ఐడియా సీతారామయ్యకి అర్థమై, "మాలతీ!" అన్నాడు ఉత్సాహంగా.

అతడికి భూపతి తండ్రి వెంకయ్యతో కొంత పరిచయముంది. కలుసుకుని మాట్లాడిన సందర్భాలు తక్కువే అయినా కలిసినప్పుడు అంకుల్ అనేటంత చను వుంది. ఇప్పుడాయన్ని కలుసుకోవడం తప్పనిసరైనా నేరుగా వెళ్ళి మాట్లాడేందుకు ధైర్యం చాలక ముందుగా ఫోన్ చేసి "అంకుల్! మీ టైం విలువైనదని తెలుసు. కానీ అర్జంటుగా ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి" అన్నాడు. ఎందుకూ, ఏమిటీ అనడగలేదు వెంకయ్య. అతడి మాటలకు ఆత్మీయంగా స్పందించి, "నిన్ను చూసి చాలా రోజులయిందోయ్, రా.. కాసేపు కాలక్షేపం చేద్దాం" అన్నాడు.

ఒక పెద్ద షాపులో చిన్న ప్రైవేట్ రూంలో సీతారామయ్య వెంకయ్యని కలుసుకుని జరిగిందాంట్లో కొంత ఫిల్టర్ చేసి చెప్పి ఉత్తరం ఆయన చేతిలో పెట్టాడు.

ఆయన అతడు చెప్పింది శ్రద్ధగా విన్నాడు. ఆకాశరామన్న ఉత్తరం చదివాడు. తర్వాత నెమ్మదిగా, "ఐతే మావాడో తిరుగుబోతు పిల్లను ప్రేమించాడంటావు!" అన్నాడు.

"మాలతి తిరుగుబోతు కాదంకుల్. నన్ను ప్రేమించింది. అంతే!" అన్నాడు సీతారామయ్య.

"అంటే ఏ ఆడపిల్లైనా నీతో తిరిగితే తిరుగుబోతు కాదంటావ్!" అన్నాడు వెంకయ్య.

"నా ఉద్దేశమది కాదంకుల్! భూపతి నా స్నేహితుడు. అన్నివిధాలా నాకంటే అధికుడు. అనవసరంగా ఈ మాలతి ప్రేమలో పడి దారి తప్పుతున్నాడు..."

అతడింకా ఏదో అనబోతూండగా ఆయన చిరాగ్గా ముఖం పెట్టి, "ఇంజనీర వుదామనుకుని బడిపంతులివయ్యావు. నువ్వు దారెప్పుడో తప్పావు. నీకు మావాడి దారి గొడవెందుకూ? " అన్నాడు.

సీతారామయ్య మనసుకి కష్టం తోచింది. ఐనా తమాయించుకుని- "ఐతే మాలతి ఎలాంటిదైనా సరే వాడికిచ్చి పెళ్లి చేస్తారా? " అనడిగాడు.

"వాడి సంగతెందుకూ... ఈ క్షణంలో మాలతిని నీకిచ్చి పెళ్లి చేస్తానంటే ఒప్పుకుంటావా? "

సీతారామయ్య మనసుకి తోచిన కష్టం మటుమాయమైంది, "నిజంగానా అంకుల్! అలా చేస్తే జీవితాంతం మీకు కృతజ్ఞుడై ఉంటాను" అన్నాడు సంతోషంగా.

ఆయన నవ్వి, "చూసావా- ఆ మాలతి ఎలాంటిదైనా చేసుకుందుకు సిద్ధమే నువ్వు. మరి మావాడు అదే మాటంటే నీకు తప్పెందుకైంది? " అన్నాడు.

"ముందే చెప్పాను కదా అంకుల్... మాలతి నన్ను ప్రేమిస్తోంది" అన్నాడు సీతారామయ్య.

"నీకు తెలియదోయ్... అమ్మాయిలు పెళ్లికి ముందు ప్రేమించరు. అలా ప్రేమించేది అబ్బాయిలే. అమ్మాయిలు పెళ్లయ్యేదాకా ప్రేమని వాయిదా వేసి పెళ్లయ్యాక మొగుణ్ణి ప్రేమించడం మొదలెడతారు. అది తెలిసే మన పూర్వీకులు స్వయంవర పరీక్షలు పెట్టారు. రాముణ్ణి పెళ్లాడిన సీతక్కూడా రాముడు ఛాయిస్ కాదు. శివధనస్సు ఎవరెక్కుపెడితే వాళ్లని పెళ్లాడి ప్రేమించడానికి సిద్ధంగా ఉందామె. ఈ మాలతీ అంతేననుకో. అనవసరంగా మనసు పాడు చేసుకోకు" వెంకయ్య అతడికి ప్రేమతత్వం బోధించాడు.

"అది కాదంకుల్- మాలతి నిజంగా

## కొత్తగాలి...

**ఆకురాల్చిన నా నగ్నత్వం**
**చూసి నవ్వకండి**
**నాలుగు రోజులాగండి**
**నాజూకైన గుడ్డలొస్తాయి**

*-అయినాల కనకరత్నాచారి,*
*కొరిశపాడు, ప్రకాశం జిల్లా*

నన్నే పెళ్లి చేసుకోవాలనుకుంటోంది..."

"అయితే మావాడితో పెళ్లయ్యేక ఆ అమ్మాయి నీ దగ్గరకొచ్చేస్తుందంటావా- అప్పుడు నేను మీ ఇద్దర్నీ నరికేస్తాను. మావాడు రెండోపెళ్లి చేసుకుంటాడు" తాపీగా అన్నాడాయన.

సీతారామయ్యకి నోటమాట రాలేదు. గుడ్లు తేలేసి తననే చూస్తున్న అతడి భుజం తట్టాడు వెంకయ్య, "ఏదో మాటవరసకన్నాను కానీ కథ నరుక్కోవడం దాకా రాదులే" అన్నాడు లాలనగా. సీతారామయ్య బుర్ర పనిచేయడం మానేసింది. మౌనం వహించాడు.

"నువ్వలా బెల్లం కొట్టిన రాయిలా కూర్చోవడం నాకు బాగాలేదు. నువ్వేదో చెప్పావ్. నేనేదో అన్నాను. మళ్లీ నువ్వేదో అంటే కదా- మాటలు ముందుకెడతాయి?" అన్నాడాయన.

"ఏం మాట్లాడనంకుల్?" అన్నాడు సీతారామయ్య నీరసంగా.

"పోనీ మరి కాసేపు నేనే మాట్లాడనా?" అన్నాడాయన. అందుకు మౌనాన్నే అంగీకారంగా తీసుకుని "మావాడి స్నేహితుడివి కాబట్టి ఇంతలా ఇదైపోతున్నావు కానీ- కుర్రాడివి. చాలా విషయాలు నీకు తెలియవు. ఆడదాని శీలం అంటారే- అదంతా తప్పుడు ప్రచారం. ఈ ఊళ్లో చాలామంది పెద్దింటి ఆడాళ్లతో నాకు సంబంధాలున్నాయి. వాళ్లంతా పతివ్రతలుగా చెలామణీ అవుతూ సుఖంగా కాపురాలు చేసుకుంటున్నారు. నువ్వేమో ఆధునిక యుగంలో ఉండీ నిన్ను ప్రేమించిన మాలతిని మావాడెలా పెళ్లి చేసుకుంటాడూ అని ఓc ఇదైపోతున్నావు. కానీ ఆ రోజుల్లోనే మా ఆవిడ- పెళ్లికి ముందు ఒకరితర్వాత ఒకరుగా ఇద్దర్ని ప్రేమించింది. చివరకు తన పెళ్లి నాతో జరిగింది" అన్నాడు వెంకయ్య.

సీతారామయ్య నోరు తెరిచి వింటున్నాడు. ఆయన కొనసాగించాడు.

"అసలు గొప్పవాడు కావాలంటే మామూలు పెళ్ళి చేసుకోకూడదు. విష్ణువు కృష్ణావతారంలో- మిగతా పెళ్ళిళ్ళన్నీ మామూలుగా చేసుకున్నా- పట్టమహిషిని మాత్రం ఎత్తుకొచ్చే చేసుకున్నాడు. అర్జునుడు సుభద్రనూ అలాగే పెళ్ళి చేసుకుంటే వాళ్ళకి- గొప్ప వీరుడయిన అభిమన్యుడు పుట్టాడు. అంటే గొప్ప వారసులు కావాలన్నా పెళ్ళిళ్ళలాగే చేసుకోవాలన్నమాట! నేనలాగే ఎదిగాను. ఇపుడు నా కొడుకునీ ప్రోత్సహిస్తున్నాను"

సీతారామయ్యకిప్పుడు అసలు విషయం అర్థమవుతోంది. తండ్రి నడిచిన బాటలో నడవాలనే భూపతి మాలతిని ఎన్నుకున్నాడు. తనని అణగదొక్కుతున్నాడు.

వెంకయ్య కొనసాగించాడు, "జీవితంలో పైకి రావాలంటే మనిషి రాటుదేలాలి. దేవుడు మనకి కావాల్సినవన్నీ సృష్టిలోనే అమర్చాడు. అలాగని కూర్చుని తినడం అలవాటు చేసుకుంటే- బొజ్జ పెరిగి ఆరోగ్యం పాడవుతుంది. ఫిట్‌నెస్‌కి వ్యాయామం కావాలి. సామాన్యులకి జీవితమే వ్యాయామం. గొప్పవాళ్ళ వ్యాయామం వేట. వేటలో ప్రత్యర్థి ఎంతగా ప్రతిఘటిస్తే అంత వ్యాయామం వేటగాడికి. పరుగెత్తించే లేడిని వేటాడితేనే పులికి ఫిట్‌నెస్ మెయింటెనవుతుంది. అందుకే దానికి మనుషుల్ని వేటాడ్డంలో

మజా ఉండదు. ఇప్పుడు మా భూపతి అలాంటి ట్రైనింగులో ఉన్నాడు. వాడు తలొంచి లొంగినవాళ్ళ జోలికెళ్ళడు. ప్రతి ఘటించే వాళ్ళనే వెంటాడి వేటాడతాడు"

"ఇదంతా నాకెందుకు చెబుతున్నారు అంకుల్? " అన్నాడు సీతారామయ్య.

వెంకయ్య అతడి భుజంతట్టి, "నాకు నువ్వంటే ఇష్టం. అందుకే నీకు జనార ణ్యంలో వేటగాళ్ళ బారినుంచి తప్పించు కునే ఉపాయం చెబుతున్నాను. నిన్నెవ రైనా వేటాడితే పొగరుగా ప్రతిఘటించకు. బుద్ధిగా లొంగిపో. అదే నీకు మంచిది" అన్నాడు.

"అంకుల్- నేను మీకు భూపతి సమస్య చెప్పాను. మీరు సలహా నాకిస్తున్నారు"

"నువ్వు చెప్పిందానికే నా సలహా. మా భూపతి వేటగాడు. నువ్వు సామాన్యుడివి. వేటగాళ్ళని పట్టించుకోకు. పట్టించుకుంటే నీకే ప్రమాదం. నా మాటవిని నువ్వు మావాడి విషయం వాడికే వదిలిపెట్టి నీ గురించి ఆలోచించుకోవడం అన్నివిధాలా మంచిది" అన్నాడు వెంకయ్య.

హెచ్చరికలా ఉన్న ఆ మాటలు విని దిమ్మెరపోయాడు సీతారామయ్య.

కొడుక్కితగ్గ తండ్రి. తండ్రికితగ్గ కొడుకు. తను భూపతి తండ్రిని కలవడం పెద్ద పొరపాటు. ఐతే కావాలని చేసిన పొరపాటు కాదది. భూపతి తనచేత ఆ పొరపాటు చేయించాడు. అతడి తెలివిని తను చాలా తక్కువ అంచనా వేసాడు.

"విషయం నాన్నదాకా వెడితే నాకు భయం" అని భూపతి అంటే నిజమనుకు న్నాడు. కానీ అసలు విషయం ఇప్పుడు తెలుస్తోంది. సీతారామయ్య భూపతికి ఆకాశరామన్న ఉత్తరం రాస్తే- అతడా ఉత్త రాన్ని తండ్రిదాకా చేర్చడానికి సీతారామ య్యనే పోస్ట్‌మేన్ని చేసాడు.

తండ్రి మద్దతు తనకేనని తెలిసినా- చెప్పుకోలేని కొన్ని విషయాలుంటాయి కొడుక్కి. అలాంటివన్నీ ఇప్పుడు సీతారా మయ్య ద్వారా భూపతి తండ్రికి చేరాయి. ఆయన అసలు విషయం గ్రహించి- అంతా ముందే తెలిసినట్లు నటించి- సీతా రామయ్యని మరింత బెదరగొట్టాడు.

ఆ షాక్‌నించి తేరుకుని మళ్ళీ మామూలు మనిషి కావడానికి నాలుగు రోజులు పట్టిందతడికి. జరిగింది చెబుదా మని మాలతి ఇంటికెడితే- అక్కడ ఆమె తండ్రి, తల్లి అతణ్ణి ఎప్పటిలాగే ఆప్యా యంగా పలకరించారు. ఎప్పుడూ లేనిది చాలాసేపు ప్రపంచ రాజకీయాల గురించీ, సమాజపు తీరుతెన్నుల గురించీ కూడా మాట్లాడారు. అనాసక్తంగా కాసేపు వాళ్ళ మాటలు విన్న సీతారామయ్య- మాలతి ఎప్పటికీ కనపడకపోతే ఉండబట్టలేక సూటిగా ఆమె గురించి అడిగేసాడు. అన్న గారింటికెళ్ళిందన్నారు వాళ్ళు. సీతారామ య్యకి మాలతి అన్న గోపాలం తెలుసు కానీ ఇల్లు తెలియదు. అడ్రసు తెలుసుకుని అక్కడికెళ్ళాడు. గోపాలం అతణ్ణి ఆప్యా యంగా పలకరించి, "అమ్మా నాన్నలతో కలిసుండాలి. కానీ ఈ ఇల్లు నా ఆఫీసుకు దగ్గిర. ఆ ఇల్లు నాన్న ఆఫీసుకు దగ్గర" అంటూ అడక్కపోయినా తను వేరే ఉంటున్నందుకు సంజాయిషీ ఇచ్చాడు.

మాలతి వదిన మంజుల అతడికి మంచినీళ్ళిచ్చి- తన అత్తగారి మంచిత నాన్ని ప్రస్తావించి అందుకు బోలెడు ఉదా హరణలిచ్చింది. ఆ అసందర్భపు సంభా షణను మర్యాదకి కాసేపు భరించిన సీతా రామయ్య చివరకు తను మాలతి కోసం వచ్చినట్లు చెప్పేసాడు.

"అదిక్కడెందుకుంటుందీ- అమ్మానా న్నల దగ్గరుంది" అన్నాడు గోపాలం.

"అక్కణ్ణించే వస్తున్నాను. వాళ్ళిక్కడికె ళ్ళిందన్నారు" అన్నాడు సీతారామయ్య.

"ఏమో మరి- ఇంకా ఇక్కడికి చేరుకో లేదు" అన్నాడు గోపాలం. ఐతే ఎందుకు చేరుకోలేదన్న కలవరం అతడి ముఖంలో ఏ కోశానా లేకపోతే, "సమ్‌థింగ్ రాంగ్" అనుకున్నాడు సీతారామయ్య.

అలా మరో రెండ్రోజులు ఆ రెండిళ్ళ చుట్టూ ప్రదక్షిణాలు చేసినా సీతారామయ్యకి మాలతి దర్శనం కాలేదు. మూడో రోజు ప్రదక్షిణం దారిలో భూపతి తగిలి, "హాయ్ ఫ్రెండ్! నీకో గుడ్ న్యూస్. మాలతికీ నాకూ పెళ్ళి నిశ్చయమైపోయింది" అన్నాడు.

సీతారామయ్య గుండె గుభేల్మంది. తమాయించుకుని, "నేను నమ్మను" అన్నాడు.

"పోనీ మాలతి చెబితే నమ్ముతావా? " అడిగాడు భూపతి.

మాలతిమీద పూర్తి నమ్మకమున్న సీతారామయ్య కలవరపడలేదు. ఆమెని చూసే అవకాశం వస్తోందని సంబరపడుతూ, "ఊఁ" అన్నాడు.

ఇద్దరూ మాలతి ఇంటికెళ్ళారు. మాలతి తలిదండ్రులు భూపతికి అల్లుడి మర్యాదలు చేసారు.

"మాలతిని పిలవండి" అన్నాడు భూపతి.

"మాలతి వస్తుందా- లేక గోపాలం ఇంట్లో ఉందంటారా? " సీతారామయ్యలో ఆత్రుత. కానీ రెండే రెండు నిముషాల్లో మాలతి వాళ్ళముందు ప్రత్యక్షమైంది.

సీతారామయ్య ఆశ్చర్యంగా చూస్తే- పోతపోసిన బంగారు విగ్రహంలా ఉన్నదామె. అందుకేనేమో ఆమె చూపులూ భావశూన్యమై ఉన్నాయి. భూపతి ఆమెతో, "నీకూ నాకూ పెళ్ళికుదిరిన విషయం సీతారామయ్య నమ్మడంలేదు" అన్నాడు.

"ఐతే నేనేం చెయ్యను? "అంది మాలతి. ఆ గొంతు కూడా భావశూన్యమైంది.

"పాపం- మన మిత్రుడికి నిజం తెలియాలిగా- ఇతడు నీ మాటే కానీ నా మాట నమ్మడు"

మాలతి మరమనిషిలా సీతారామయ్య వైపు తిరిగింది. భావశూన్యంగా అతణ్ణి చూసింది. "నాకూ భూపతిగారికీ పెళ్ళి. ఇంకా ముహూర్తం నిర్ణయించలేదు" అంది భావశూన్యమైన గొంతుతో.

"నిజమా? " అన్నాడు సీతారామయ్య అప్రయత్నంగా.

"నేనెప్పుడూ అబద్ధం చెప్పను" అంది మాలతి. అప్పుడామె కన్నుల్లో తడి. గొంతులో విషాదం. భావోద్వేగం అదుపు కాదనేమో గిరుక్కున వెనక్కుతిరిగి లోపల కెళ్ళింది- మరమనిషిలా కాదు, మనిషిలా!

సీతారామయ్యకి పరిస్థితి అర్థమైంది. అతడామెని వెనక్కి పిలవలేదు.

భూపతి, "మళ్ళీ వస్తాను మామయ్యా!" అని మాలతి తండ్రికి చెప్పాడు. ఆ వెంటనే సీతారామయ్య భుజంమీద చెయ్యేసి ఇంట్లోంచి బైటకొచ్చాడు. స్థాణువులా ఉన్న మిత్రుడితో, "నీకిప్పుడు నా మాటమీద నమ్మకం కుదిరిందా? " అన్నాడు.

తలాడించాడు సీతారామయ్య.

"చిలక్కి చెప్పినట్లు చెప్పాను. నా మాలతిని ప్రేమించొద్దని. వినలేదు నువ్వు. చూసావుగా- అంతా నేననుకున్నట్లే జరిగింది. నువ్వే నీ మర్యాద దక్కించుకోలేదు" అన్నాడు భూపతి.

అప్పటికి సీతారామయ్య తేరుకున్నాడు. "మర్యాద గురించి మాట్లాడకు. ఈ పెళ్ళి మాలతికిష్టంలేదు. ఏడుపునాపుకోలేక లోపలకు పారిపోయిందామె" అన్నాడు.

"అంత మాత్రాన తనకీపెళ్ళి ఇష్టంలేదని కాదు. గుర్తు చేసుకో- రెండిళ్ళకి ప్రదక్షిణాలు చేసినా కొన్నాళ్ళుగా మాలతి దర్శనమే కాలేదు నీకు. మరామెకి నువ్వంటే

ఇష్టంలేదనే అర్థమా? "

"నా ప్రదక్షిణాల గురించి నీకెలా? " ఆశ్చర్యంగా అడిగాడు సీతారామయ్య.

"మాలతి చెప్పింది"

సీతారామయ్య నమ్మలేదు. అతణ్ణి నమ్మిస్తానంటూ బలవంతంగా గోపాలం ఇంటికి తీసుకెళ్ళాడు భూపతి. తలుపు తట్టగానే మంజుల తలుపు తీసింది. భూపతిని చూస్తూనే ఇంత మొహం చేసుకుని ఆప్యాయంగా లోపలకాహ్వానిస్తూ, "ఏమండీ- మీ బావగారొచ్చారు" అంటూ కేక పెట్టింది. వెంటనే "ఎవరూ- భూపతిగారా? " అంటూ లోపల్నుంచి వచ్చాడు గోపాలం.

పక్కనున్న సీతారామయ్యను పట్టించుకోకుండా- ఇద్దరూ భూపతితో ఆత్మీయంగా మాటలు కలిపేస్తున్నారు. "అయ్యో- అన్నయ్యగారికి కాఫీ ఇవ్వాలనే తోచలేదు" అంటూ మధ్యలో మంజుల లేవబోతే, భూపతి ఆమెను వారించి, "రోజుకొక్కసారే కాఫీ తాగుతాను. మీరిక్కడే కూర్చోండి. కాసేపు సరదాగా కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు.

గోపాలం నవ్వి, "చెప్పడానికి మొహమాటం కానీ బావగారొచ్చింది చెల్లాయి కోసం. మంజులా- నువ్వు వీళ్ళతో కబుర్లు చెబుతూండు. నేనెళ్ళి క్షణాలమీద మాలతిని తీసుకొస్తాను" అన్నాడు.

మరుక్షణంలో అతడక్కడ లేడు. ఇంటి బయట స్కూటర్ స్టార్టైన చప్పుడు.

మంజుల సీతారామయ్య వైపైనా చూడకుండా భూపతితో కబుర్లు చెబుతోంది. ఐతే సీతారామయ్య అది పట్టించుకునే స్థితిలో లేడు. మాలతి వస్తే మరోసారి ఆమెను చూడాలనీ, ఆమె గొంతు వినాలనీ అతడికి తహతహగా ఉంది.

మాలతి వచ్చింది. ఇప్పుడామె మరమని షిలా కాక మహాయోగినిలా ఉంది. తనకి సీతారామయ్యని కలుసుకోవడం ఇష్టంలేదనీ, అందుకే ఇంట్లో ఉండీ లేనని చెప్పించాననీ ఒప్పేసుకుని వెంటనే లోపలకి వెళ్ళిపోయింది- ధ్యానానికి టైమయిందన్నట్లు.

సీతారామయ్య దెబ్బ తినలేదు. అతడికిప్పుడు భూపతి అసలు వ్యక్తిత్వం అవగాహనకొస్తోంది. మనసు రాటుదేలడం మొదలైంది. ఆ ఇంట్లోంచి బయటకొచ్చేక, "ఏ ఇంటికెళ్ళినా మాలతి నీకు కనబడలేదు. నాకు కనబడింది. నీ పరిస్థితి అర్థమైందా? " అన్నాడు భూపతి.

"నా పరిస్థితి కాదు కానీ మాలతి అసహాయత అర్థమవుతోంది" అన్నాడు సీతారామయ్య.

"అసహాయత మాలతిదే కాదు, నీదీనూ-

## రస స్పందన

చెలిమికి గుర్తుగా ఆరుద్ర తన 'సినీవాలి'ని కొంగర జగ్గయ్యకు అంకితమిచ్చారు. 'పగ్గాలు లేనివాడా, సదా నెగ్గెడివాడా, కడుచక్కనివాడా' అనడంతో ఆయనా దీటుగా స్పందించారు.

'పిల్లనిస్తా.. అల్లుడా! రమ్మ'ని కృతికర్త అన్నందుకు, ఎంతో సంతోషించారీ కృతిభర్త! మీ అమ్మాయి నాలో తాజా పూల వాన కురిపిస్తుంది/ రోజూ వసంతం సృష్టిస్తుంది/ మీవల్ల నేటికయ్యాను నేనూ/ విశ్వసాహితీ బంధువుని' అంటూ పుస్తక స్వీకారం చేశారు జగ్గయ్య.



## కొత్తగాలి...

**నిన్న-**
**పక్షులకూ, పశువులకు**
**అమ్మలా ఆశ్రయమిచ్చి**
**నేడు-**
**మోడై స్మారక చిహ్నంలా**
**ఒంటరి చెట్టు!**

- పాయసం సుబ్రహ్మణ్యా మహర్షి,
గాయత్రి నగర్, నెల్లూరు

అర్థం చేసుకుని మాత్రం ఏంచేస్తావ్?"

"నిన్ను అసహాయుణ్ణి చేసే దశకి ఎదిగి మాలతిని నీనుంచి రక్షిస్తాను"

"అంటే ఇంకా నీకు మాలతి మీద ఆశ చావలేదా?" అన్నాడు భూపతి.

"అది ఆశ కాదు, ప్రేమ. ప్రేమకి చావుండదు. 'ప్రణయమనగ వింతవహ్ని, అంటించిన నంట దార్పినంత నారబోదు'- అన్నాడు గాలిబ్"

"నేను నిన్ను దెబ్బమీద దెబ్బ తీస్తున్నాను. ఐనా నీకు బుద్ధొస్తున్నట్లు లేదు"

"మనసులో గల ఒక్కొక్క వ్రణము నేడు, బీజమగు దివ్వ దీపికావృక్షమునకు"

సీతారామయ్య నిబ్బరానికి వేళాకోళంగా నవ్వి, "మెచ్చానులే కానీ నువ్విలా వేదాంతం చెబుతూండు. నువ్వు గమ్యంగా పెట్టుకున్న మాలతిని నేను చేరుకుంటాను" అన్నాడు భూపతి.

"అలాగే చేరుకో- 'కానిపించుగాని గమ్యమ్ము చిక్కదు, నేను నడచునట్లు తాను నడచు'- అని సరిపెట్టుకుంటాను"

"హమ్మయ్య- ఇప్పటికి వివేకమొచ్చింది నీలో, మాలతిని నాక్కాకుండా ఆపలేనని గ్రహించావ్"

"అది నాకు తెలియదు. కానీ మా ప్రేమ సంప్రదాయానిక్కూడా తలొంచదు. శీలం చెడినా నువ్వామెని పెళ్ళాడ్డానికి సిద్ధం. పెళ్ళైనా ఆమెని నాతో తీసుకెళ్ళడానికి నేను సిద్ధం"

"అనుకున్నా, ఎంతకైనా తెగిస్తావని! అందుకే నీ కాళ్ళకు బంధమేస్తున్నాలే" అన్నాడు భూపతి. ఆ తర్వాత వారం రోజుల్లో సీతారామయ్యకి పెళ్ళి కుదిరింది. అతడా పెళ్ళికొప్పుకుని తన కుటుంబానికి సర్వనాశనం తప్పించాడు. రుక్మిణి అతడి ఇల్లాలయింది.

"ఇకనైనా మాలతిని మర్చిపో. లేకుంటే ఆ జ్ఞాపకాలు మానని గాయాలై వేధిస్తాయి" అన్నాడు భూపతి.

"నా సంగతి తెలియక అలాగంటున్నావు- నేనెప్పుడూ 'మానిపోయెడి గాయము నాకు వలదు, శత్రువునకది యొసగుము స్వామి నేడె' అని దేవుణ్ణి ప్రార్థిస్తూంటాను" సీతారామయ్య గొంతులో భూపతి ఆశించిన వేదన లేదు.

"ఎవడ్రా వీడు? తన గాయమలాగే ఉండి శత్రువు గాయం మానాలంటాడు?" భూపతిలో చిరాకు.

"నేనిచ్చిన పుస్తకంలో కవి దాశరథి వివరణ చదువు. గుండె గాయం మానిపోతే చైతన్యమే పోతుందంటారాయన. చైతన్యానికి నిదర్శనమైన బాధ తనకే తప్ప శత్రువుకి దక్కకూడదని గాలిబ్ భావం" చెప్పాడు సీతారామయ్య.

"నీ గాయాల ఫిలాసఫీ నాకు పడదు. నేను మాత్రం నాకు గాయాలే వద్దనుకుంటాను. నా శత్రువువే కాదు, మిత్రుడి గాయలు కూడా నానాటికీ పెద్దవి కావాలనుకుంటాను. అందుకే మాలతిని పెళ్ళి చేసుకుంటున్నాను" అన్నాడు భూపతి.

సీతారామయ్య పెళ్ళైన నెల్లాళ్ళకు భూపతి మాలతిని పెళ్ళి చేసుకున్నాడు. ఆ పెళ్ళికి సీతారామయ్యని ఆహ్వానించాడు. మాలతి మెడలో తాళి కట్టే శుభవేళలో అతడు మాలతిని కాక ప్రేక్షకుల్లో సీతారా

మయ్యనే చూసాడు. తర్వాత అతడితో కాసేపు ప్రత్యేకంగా మాట్లాడాడు.

"ఇప్పుడు మాలతి నా భార్య" అన్నాడతడు సంభాషణ ప్రారంభిస్తూ.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు సీతారామయ్య.

"మనస్ఫూర్తిగా చెబుతున్నావా?"

"లేదు. మర్యాద దక్కించుకుంటున్నాను" నవ్వాడు సీతారామయ్య.

ఆ నవ్వులో విషాదం లేకపోవడం గమనించి, "బాధగా లేదా?" అన్నాడు భూపతి.

"నా బాధ గురించి నీకెందుకు? నీ జీవితాశయం నెరవేర్చుకున్నావుగా, సంతోషంగా ఉండు"

"కానీ నువ్వు నా మిత్రుడివి. నువ్వు బాధగా ఉంటే నేనెలా సంతోషిస్తాను?"

"నాకు బాధెందుకు?"

"గతంలో నువ్వూ, మాలతీ ప్రేమించుకున్నారు. పాత జ్ఞాపకాలతో మాలతి నిన్ను బాధించదా?"

సీతారామయ్య నవ్వి, "చూడు- 'బాధలో నాకు రుచి కనుపట్టగానె, చాన నన్ను బాధించుట మానుకొనియె'- కాబట్టి నా గురించి ఆలోచించి నీ సంతోషాన్ని పాడు చేసుకోకు" అన్నాడు.

తనకి మాలతితో పెళ్ళైందని సీతారామయ్య దిగులు పడకపోవడం భూపతికి నచ్చలేదు. ఐతే అది మాలతికీ నచ్చదని అతడి ఊహ. శోభనం మొదటిరాత్రి అతడు మాలతికా విషయం చెప్పి, "సీతారామాయ్య నిన్ను పూర్తిగా మనసులోంచి చెరిపేసాడు. నువ్వూ అతణ్ణి నీ మనసులోంచి చెరిపేసి ఈ క్షణం నుంచీ త్రికరణశుద్ధిగా నన్ను ప్రేమించడం మొదలెట్టు" అన్నాడు.

"బ్రతిమాలుతున్నారా, ఆజ్ఞాపిస్తున్నారా?" అంది మాలతి.

అప్పుడు భూపతికి సీతారామయ్య గుర్తుకొచ్చాడు. మాలతి కూడా అతడిలాగే మాట్లాడుతోందని మనసులో అనుకుని, "నేనీ ప్రశ్నకు జవాబివ్వకపోతే నువ్వు జవాబివ్వవా?" అన్నాడు.

"ఇది సందేహమా, కోపమా?" మళ్ళీ అడిగింది మాలతి.

"ఏమో- నాకు తెలియదు. కానీ నా ప్రశ్నకి బదులు ప్రశ్న కాదు, జవాబు కావాలి"

మాలతి గొంతు సవరించి, "ఇంతకాలం నేను మాలతిని. ఇప్పుడు భూపతి భార్యను. ఇన్నాళ్ళూ మిమ్మల్ని నువ్వన్నాను. ఇప్పుడు నిన్ను మీరంటాను. మీరు చెప్పింది చేస్తాను. వద్దన్నది మానేస్తాను. పెళ్ళి చేసుకుని మీరు నా తనువు మీద పూర్తి అధికారం సంపాదించారు. ఆ అధికారాన్ని నేను గౌరవిస్తాను. బతిమాలినా, ఆజ్ఞాపించినా కూడా నేను చేయగలిగినవివి" అంది.

"మరి చేయలేనివేమిటి?"

"నా మనసుపై నాకు అదుపు లేదు. కాబట్టి మీరు నా మనసును శాసించే ప్రయత్నం చేయొద్దు. దానికి సంబంధించిన ప్రశ్నలు అడగొద్దు. ఎందుకంటే నేను అబద్ధం చెప్పను, చెప్పలేను"

ఆమె గొంతులో తడబాటు లేదు. నిజాయితీ ధ్వనిస్తోంది. చలించిన భూపతి మొదటిసారిగా ఆమెకి రవంత భయపడ్డాడు. ఆ భయం అహాన్ని రేపిందేమో, "నీ భావమేమిటో తెలియదు. నువ్వు అంకితభావంతో నా ఇల్లాలివి కావాలి. లేకుంటే- అటు నీ కుటుంబం, ఇటు సీతారామయ్య కుటుంబం- మనుగడ నీ పర్ఫార్మెన్సుపై ఆధారపడుతుంది మరి" అన్నాడు బెదిరింపుగా.

మాలతి చలించలేదు, "ఇది మనకి మొదటిరాత్రి. నా అంకితభావానికి మీ

మాటలే ప్రతిబంధకం కావచ్చు" అంది శాంతంగా, నిర్భయంగా. అది మంద లింపో, హెచ్చరికో గానీ భూపతి మీద బాగానే పనిచేసింది. అతడు టాపిక్ మార్చాడు. ఆ రాత్రి ఇద్దరూ ఒకటైన ప్పుడు- తన అంకితభావం గురించిన అతడి అపోహలన్నీ తొలగిపోయేటంతలా ఆమె సహకరిస్తే అతడాశ్చర్యపడ్డాడు.

"నువ్వు దేవతవి. నిన్ను దేవతలాగే చూసుకుంటాను" అని కృతజ్ఞతతో అత డంటే- "అంతా మూడు ముళ్ళ ప్రభావం. నాకిక మీరే సర్వం" అంటూ మంగళసూ త్రాలు కళ్ళకద్దుకుందామె.

ఆ ఇంట్లో భూపతి ఆమెకేలోటు చేయ లేదు. మాటలతో హింసించలేదు. కానీ తరచుగా సీతారామయ్యతో ఆమె అను బంధం గురించి గుచ్చి గుచ్చి అడిగేవాడు.

మాలతి అతడి ప్రశ్నలకి అభ్యంతరపె ట్టేది కాదు. అబద్ధం చెప్పే అలవాటులేని ఆమె అరమరికలు లేకుండా చాలావరకూ ఉన్నదున్నట్లే చెప్పింది.

భూపతి ఆమెనడిగేది గతం గురించైనా నిజానికతడి భయమంతా భవిష్యత్తు గురించే. "మా ప్రేమ సంప్రదాయాని క్కూడా తలొంచదు. శీలం చెడినా నువ్వా మెని పెళ్ళాడ్డానికి సిద్ధం. పెళ్ళైనా ఆమెని నాతో తీసుకెళ్ళడానికి నేను సిద్ధం" అన్న సీతారామయ్య మాటలతడికి తరచుగా గుర్తొస్తుంటాయి. అందుకే అతడోరోజున, "ఏదో రోజున సీతారామయ్య నన్నెదిరించి ఓడించి నిన్ను తీసుకుపోగలడన్న ఆశ ఇంకా నీలో ఉందా?" అనడిగేసాడామెను.

ఎప్పటిలాగే మాలతి తడబడలేదు, "పెళ్ళికి ముందు విశేషాల గురించి అడి గారు, చెప్పాను. అవి మాలతి అనే కన్యకి సంబంధించినవి. రామాయణంలో సీత గురించి అడిగితే ఎలా చెబుతానో ఆమె గురించీ అలాగే చెప్పాను. ఆ మాలతి కథ ముగిసింది. ఈ మాలతికి తన కుటుంబం, తన వాళ్ళు, తన పిల్లలు- ఇవే ఆలోచనలు. నన్ను మీరు ఆ మాలతి గురించి ఎన్నిసా ర్లయినా అడగండి. విసుక్కోకుండా చెబు తాను. కానీ వాటిని ఈ మాలతితో ముడి పెట్టి వర్తమానానికీ, భవిష్యత్తుకీ సంబం ధించిన ప్రశ్నలడక్కండి. మీకు సమాధా నాలు దొరకవు- కానీ నా అంకితభావంలో తేడా రావచ్చు. అప్పుడందుకు నన్ను తప్పు పట్టొద్దు" అందామె.

సీతారామయ్యకి ఆమె మనసులో ఇంకా స్థానముందన్న అనుమానం ఆ మాటలతో బలపడినా భూపతి దాన్ని పిశాచిగా ఎద గనివ్వలేదు. ఎందుకంటే పడగ్గదిలో ఆమె అతడికి భార్యలాకాక ప్రియురాలిలా మసి లేది. ఆ అనుభవమెంతో మనోహరమైన క్రమంగా అతడికామెపై ప్రేమ మొదలైంది.

ఆ ప్రేమ మోహానికి అతీతమైనది.

ఎవరడిగినా మాలతి తను శ్రీమతి భూపతిననేది తప్ప అసలు పేరు చెప్పేది కాదు. అదేమంటే పెళ్ళయ్యేక అదే తన వ్యక్తిత్వమంది. పెళ్ళికిముందు మాలతికో వ్యక్తిత్వముండేదనీ- అది భూపతికి నచ్చని దనీ అంది. పేరుకీ, వ్యక్తిత్వానికి అవినా భావ సంబంధముంది. కాబట్టి తనకి సంబంధించి తన పేరు మాలతి కాదంది.

"మరి నేను మాత్రం నిన్ను మాలతీ అనే పిలుస్తాను" అన్నాడు భూపతి.

"మీరు నన్ను మాలతీ అంటే అది పిలు పేకానీ పేరు కాదు. మీరు నన్నే పేరుతో పిలిచినా పలుకుతాను. కానీ నన్ను నేను మాలతిగా గుర్తుంచుకోను. అది నాకూ మీకూ మంచిది" అందామె.

మాలతి నిజాయితీ, సంస్కారం- భూప తికి ఆమెపై ఆరాధనాభావం పెంచాయి. ఐతే సీతారామయ్యకి దక్కాల్సిన అదృష్టం- తను చేజిక్కించుకున్నానని తరచుగా స్ఫురి

స్తూనే ఉంటుంది. ఐనా భూపతికి సీతారామయ్యంటే జాలిలేదు.

అంతరాంతరాల్లో అతడికి సీతారామయ్యంటే భయం. అందుక్కారణం అతడికి సీతారామయ్య శక్తిసామర్థ్యాలమీదున్న నమ్మకం. మొక్కై వంగనిది మ్రానై వంగదని భూపతి అతణ్ణి ఎప్పటికప్పుడు మొక్క దశ దాటకుండా జాగ్రత్తపడేవాడు. జీవితంలో పైకి రావడానికి సీతారామయ్య చేసే ప్రతి ప్రయత్నాన్నీ ఇనుప పాదాలతో అణిచేసేవాడు.

విశేషమేమిటంటే ఇన్ని జరిగినా సీతారామయ్య నీరుగారిపోలేదు. అంకితభావంతో బడిపంతులు ఉద్యోగం కొనసాగిస్తూ ఎంతో సంతోషంగా ఉన్నాడు. ఆయనకిద్దరు పిల్లలు. ముందు కూతురు శారద, తర్వాత కొడుకు శేఖర్. ఆ తర్వాత ఆపరేషన్ చేయించుకున్నాడు.

పేరుకి తగ్గట్లే శారద చదువుల తల్లి. రూపానికి రంభ. ఇంటర్ ప్యాసై బీసీఏలో చేరింది. అప్పుడామెకి వెతుక్కుంటూ ఓ పెళ్ళి సంబంధం వచ్చింది. వరుడు అమెరికాలో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు. వరకట్నాన్ని నిరసించే ఆదర్శవంతుడు.

భూపతి రంగంలో దిగి ఆ సంబంధం చెడగొట్టాడు. శారద చదువు మాని గుమస్తా ఉద్యోగం చేస్తున్న సురేష్‌ని పెళ్ళి చేసుకునే పరిస్థితులు కల్పించాడు.

"నీకు మాలతి దక్కింది. నా మానాన నేను బ్రతుకుతున్నాను. కానీ నువ్విప్పుడు నా సంతానాన్ని కూడా వేటాడుతున్నావు. అది అన్యాయం" అంటూ వాపోయాడు సీతారామయ్య.

"ఈ వేట నాది కాదు, మాలతిది" అన్నాడు భూపతి.

"ఒకప్పుడు మాలతి నీ ప్రేయసి. నీ సామర్థ్యాన్ని నమ్మి నన్నెదిరించింది. నన్నేం చెయ్యలేక నాకు పూర్తిగా తలొంచిన నీపై ఆమెకి ఏవగింపు కలిగింది.

## కొత్తగాలి...

**సగటు మనిషికి**
**విద్య ఎండమావి...**
**వైద్యం**
**ఎండిన బావి**

*- పొనుగోటి నరసింహారావు,*
*దుబ్బాక, నల్గొండ జిల్లా*

నాతో పెళ్ళయ్యాక ఆ ఏవగింపు కసిగా మారింది. నిన్నూ, నీ కుటుంబాన్నీ పైకెదక్కుండా అణచి ఉంచమని భార్యగా నన్నామె శాసించింది. చేత నాది. ముద్ర ఆమెది. నువ్వు జీర్ణించుకు తీరాల్సిన చేదు నిజమిది" అన్నాడు భూపతి. సీతారామయ్య నమ్మకపోతే మాలతి చేతే చెప్పిస్తానన్నాడు భూపతి. అదీ వద్దంటే, "అదే మంచిది. ఇప్పుడు మా అన్యోన్యత చూసి తట్టుకోలేవు నువ్వు" అన్నాడాయన.

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా- నీ అన్యోన్యత, మాలతి సుఖ సంతోషాల కోసం నేను దేవుణ్ణి కూడా ప్రార్థిస్తాను" అన్నాడు సీతారామయ్య.

"ఆమె నిన్ను కాదని నన్ను పెళ్ళి చేసుకుంది. అయినా ఆమెపై కోపం లేదా నీకు?" ఆశ్చర్యంగా అన్నాడు భూపతి.

"చూడు- 'నను వదిలి పొగవలెనేగెనాదు నీడ, గుండెలో అగ్గి గలవాని గోరు నేది'- అని గ్రహించేక ఆమెపై కోపముంటే నేను మూర్ఖుణ్ణే అవుతాను?" అన్నాడు సీతారామయ్య.

"నీకు జన్మకు బుద్ధిరాదు" అన్నాడు భూపతి కోపంగా.

ఆ తర్వాత సీతారామయ్య కొడుకు శేఖర్‌కి ఇంటర్లో మంచి మార్కులొచ్చాయి. ఎంట్రెన్సులో మెడిసిన్ సీటు గ్యారంటీ అనుకునే ర్యాంక్ వచ్చింది. అప్పుడు భూపతి సీతారామయ్యని కలిసి, "నీ

## కొత్తగాలి...

**అక్షరం**
**నిద్రపోనివ్వదు**
**నా కంఠం**
**మీటుతూనే ఉంటుంది**

*-డా.వాసా ప్రభావతి, హైదరాబాద్*

కొడుకు డాక్టరు కావడానికి వీల్లేదు. కాంపౌండరవ్వాలి" అన్నాడు.

"నీ పగ నామీద చూపించు. నా పిల్లల్ని వేధించకు? " బతిమాలాడు సీతారామయ్య.

"ఏం చేయను? తనే కాదు- నీ పిల్లలు కూడా నిన్ను తిట్టుకోవాలని మాలతి కోరిక"

"మధ్య మాలతినెందుకురా- ఈ రొంపి లోకి లాగుతావు? "

"ఒక్కసారి మా ఇంటికొచ్చి నోరారా ఆమెను తిట్టు. నీకు నిజం తెలుస్తుంది. నీ సంతానానికి ప్రగతి ఉంటుంది"

సీతారామయ్య ఒప్పుకోలేదు. ఆ తర్వాత శేఖర్ కాంపౌండరయ్యాడు.

"ఒరేయ్- నువ్వు సర్వనాశనమైపోతావురా" అన్నాడు సీతారామయ్య.

"నీవంటి పేదల తిట్లే నావంటి పెద్దలకి దీవెనలంటుంది మాలతి"

సీతారామయ్య ఉక్రోషం ఆగక తెగ శాపనార్థాలు పెట్టాడు.

"నీకు తిట్టడం బాగా వచ్చు. ఈ తిట్లే మాలతిని తిడితే నీకీ కష్టాలుండవు కదా!" నవ్వాడతడు.

"ముఖేముఖే సరస్వతి అని నాకు నిన్ను చూస్తేనే తిట్లొస్తాయి" అంటూ సీతారామయ్య భూపతిని ఇంకా తిట్టాడు.

"లతామంగేష్కర్ పాటలా, చిట్టిబాబు వీణలా, రవిశంకర్ సితార్‌లా- నీ మాటలు నన్ను పరవశింపజేస్తున్నాయి. ఇంకా ఇంకా వినిపించు" రెచ్చగొట్టాడు భూపతి.

సీతారామయ్య తిట్టడం ఆపేసి "నీకు సంతోషం కలిగించేదీ నేను చెయ్యను. కానీ సంగీతంలో నీకింత మంచి టేస్టెక్కడిదిరా? " అన్నాడు.

"మాలతి అలవాటు చేసింది" అన్నాడు భూపతి.

సీతారామయ్య కళ్ళు మూసుకుని తల పట్టుకున్నాడు.

"ఒరేయ్- ఒక్కసారి కళ్ళు తెరిచి నన్ను చూడరా. నీకు చెప్పాల్సినవింకా చాలా ఉన్నాయి" కవ్విస్తూ అన్నాడు భూపతి.

సీతారామయ్య కళ్లు తెరిచి అతణ్నదోలా చూస్తూ "నన్ను కవ్వించబోకు నా కన్నులందు అశ్రుఝుంఝూమరుత్ సమూహములు కలవు" అన్నాడు గంభీరంగా.

ఆ కళ్లలో ఏంచూసాడో భూపతి వెంటనే అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత చాలాసేపు సీతారామయ్య కళ్ళు భూపతిని వెంటాడాయి. శేఖర్ని తీసిన దెబ్బ సీతారామయ్యకి తగలాల్సినచోటే తగిలిందనీ, ఆయన పూర్తిగా అధైర్యపడ్డాడనీ మొదటిసారిగా అనిపించింది భూపతికి. భూపతి హుషారుగా ఇంటికెళ్ళి, "మాలతీ" అన్నాడు. అది శాడిజమో, అతితెలివో, అహంకారమో కానీ సీతారామయ్యని ఎప్పటికప్పుడు తానెలా అణిచేస్తున్నదీ మాలతికి చెప్పడం భూపతికి రివాజు. ఆయన చెప్పింది శ్రద్ధగా విని గంభీర మౌనముద్ర వహించడం మాలతికి రివాజు. భూపతి తన రివాజు ప్రకారం జరిగింది పూస గుచ్చినట్లు మాలతికి చెప్పాడు. మాలతి మాత్రం రివాజు తప్పి, "మీరీవేళ చాలా సంతోషంగా ఉన్నారు" అంది. అంటే ఆమె మౌనముద్రకి స్వస్తి పలికింది. మాలతి తన సంతోషాన్ని గుర్తించినందుకు మురిసిపోతూ, "సంతో

షమే మరి- సీతారామయ్యని సమూలంగా నాశనం చేసాను" అన్నాడతను.

"సమూలంగా అంటే? " అంది మాలతి.

"వాడు నాశనమయ్యాడు. ఆడపిల్లలిద్దరూ నాశనమయ్యారు"

"సమూలం అంటే అదేనా? " అడిగింది మాలతి.

భూపతికి అనుమానమొచ్చింది. సీతారామయ్య విషయమై ఎప్పుడూ అట్టే మాట్టాడని మాలతి ఈ రోజెందుకింతగా రొక్కిస్తోంది? "నీ ఉద్దేశంలో సమూలం అంటే ఏమిటి? " అన్నాడాయన.

"ఎందుకో నాకు కంసుడి కథ గుర్తొస్తోంది. వసుదేవుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేసి భార్యాసమేతంగా జైల్లోపెట్టి వారికి పుట్టిన ప్రతి బిడ్డనీ చంపేవాడు కంసుడు. మీకు సీతారామయ్యన్నా, అతడి సంతానమన్నా భయం. కంసుడికి దేవకీ వసుదేవుల బిడ్డలంటే భయం. ఏదో పోలిక ఉన్నట్లే లేదూ? "

భూపతికీ పోలిక నచ్చలేదు, "కంసుడిది భయం. నాది భయం కాదు" అన్నాడు బింకంగా.

"భయం కాకపోతే ఇంకేమిటో చెప్పండి" అంది మాలతి ప్రశాంతంగా.

మాలతి నిలదీస్తోందని గ్రహించిన ఆమె ఆంతర్యం బోధపడక, "ఇంతకీ కంసుడి కథకీ, సమూలం అన్న పదానికీ సంబంధమేమిటి? " అన్నాడతడు.

"కంసుడు చంపబోయిన ఎనిమిదో శిశువు యోగమాయగా మారి నిన్ను చంపేవాడు వేరేచోట పెరుగుతున్నాడు- అని మాయమైంది. సమూలంగా వసుదేవుడి సంతానాన్ని నాశనం చేసాననుకున్న కంసుడు తెల్లమొహమేసి ఆ బిడ్డకోసం దేశమంతటా అన్వేషణ ప్రారంభించాడు"

"అయితే ఏమంటావ్? "

"ఏమీ అనను. ఎందుకో నాకీ కథ గుర్తుకొచ్చిందంతే" అంది మాలతి.

భూపతి ఆలోచనలో పడ్డాడు. ఏమిటి మాలతి ఆంతర్యం? వసుదేవుడిలా సీతారామయ్య పిల్లల్ని మార్చేసాడా? అతడి వద్ద పెరిగింది వేరేవాళ్ళ పిల్లలా? అసలు తనెప్పుడూ ఈ కోణం నుంచి ఆలోచించనే లేదేమిటి? పోనీ ఈ విషయమై మాలతికేమైనా తెలుసా అనుకుంటే పెళ్ళయ్యేక ఆమె సీతారామయ్యని కలుసుకోలేదు. అతడితో ఉత్తరప్రత్యుత్తరాలు జరపలేదు. ఆసలామె తన పుట్టింటికి వెళ్ళలేదు. ఆమెని చూడ్డానికి పుట్టినింటివారే భూపతి ఇంటికొచ్చేవారు. మాలతి తనని త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తున్నదని భూపతికి నమ్మకమే. ఆయనకామె సాన్నిధ్యంలో ఆహ్లాదం. సాన్నిహిత్యం స్వర్గం. సలహాలు ఆచరణీయం. లోతుగ ఆలోచిస్తే తనకి దగ్గరవ్వాలనే ఆమె పెళ్ళికి ముందునుంచీ సీతారామయ్య మీద ఉసిగొల్పేదా అనిపిస్తుంది.

మాలతి సవాలు చేసిందనే భూపతి సీతారామయ్యని ఇంజనీరు, కలెక్టరు కాకుండా ఆపాడు. బహుశా ఆమె తామిద్దరికీ వరపరీక్ష పెడితే అందులో తాను నెగ్గాడేమో! తనవాడైన భూపతి ఎప్పటికీ పైమెట్టులో ఉండాలని ఆమె పరోక్షంగా సీతారామయ్య పతనాన్ని శాసిస్తోందేమో!

సీతారామయ్యపై ఆమె ప్రేమ నిజమైతే- వెంటనే భూపతితో పెళ్ళికొప్పుకుని ప్రియుడి నాశనాన్ని ఆపి ఉండేది. అతగాడే కలెక్టరో, ఇంజనీరో అయి వైభవంగా జీవించేవాడు. కానీ మాలతి భూపతిని ప్రియుడి మీదకు ఉసిగొల్పి- స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని ఋజువు చేసింది.

ఆడదాని మనసెంతో లోతైనది. అది గ్రహించక భస్మాసురుడు మోహినిని నమ్మినట్లు సీతారామయ్య మాలతిని నమ్మాడు. పూర్తిగా నాశనమయ్యే

దాకామాలతి అతణ్ణి వదలదు. ఇప్పుడామె, "సమూలం అంటే అదేనా? " అంటే తన మనసులో అనుమాన బీజం నాటింది. అతి త్వరగా ఎదిగే చెట్లు కూడా ఎదుగుదలలో అనుమానాన్ని మించలేవు. మాలతి భూపతి మనసులో నాటిన అనుమాన బీజం ఇట్టే మహావృక్షమైంది.

సీతారామయ్య సామాన్యుడనుకుందుకు లేదు. చలాకీగా ఉంటూ, చూడ్డానికి తన కంటే బాగా చిన్నవాడిగా కనిపించే సీతారామయ్య గురించి ఇంతవరకూ తనకిలాంటి అనుమానం రాలేదేం? అతడు తన తెలివంతా ఉపయోగించి ఏదో చేసాడు. అందుకే తానెన్ని దెబ్బలు తీసినా నిమ్మకి నీరెత్తినట్లున్నాడు.

"సమూలం అంటే అదేనా? " అంది మాలతి ప్రశ్న.

సీతారామయ్య కూతురు గుమాస్తాని పెళ్ళాడింది. కొడుకు కాంపౌండరయ్యాడు. అంతటితో అతడి కథ ముగిసిందని తను మురిసిపోతూంటే అప్పుడడిగింది మాలతి ఆ ప్రశ్న!

ఆమె నోట పొల్లుమాట పలకదు. అందుకే శేఖర్ సీతారామయ్య కొడుకు కాదన్న అనుమానం పుట్టి వామనుడిలా పెరిగిపోతూ భూపతిని పాతాళంలోకి నెడుతోంది.

శేఖర్ కాకపోతే సీతారామయ్య అసలు కొడుకెక్కడున్నాడు?

హితులలో, సన్నిహితులలో, పనివాళ్ళలో- శేఖర్ వయసువారిని చూసినప్పుడల్లా భూపతికి గుండె గుబగుబలాడేది. వాళ్ళలో సీతారామయ్య కొడుకుంటే?

సీతారామయ్య తన కొడుకుని తనమీద ప్రయోగిస్తాడని భూపతి నమ్మకం. ఆ భయంతో అన్వేషణ ప్రారంభించి ఆరాలు తీయించాడు. ఆరాలు అనుకున్న ఫలితాల నివ్వలేదు.

ఐతే శేఖర్ పుట్టుక ఏనాటి మాట?

చివరికి భూపతి- ఎక్కడ అనుమాన ముందో అక్కడే సమాధానమూ దొరుకుతుందన్న సిద్ధాంతాన్ని నమ్ముకుని నేరుగా సీతారామయ్యను కలిసి, "నాకు నిజం తెలిసిపోయింది. శేఖర్ నీ కొడుకు కాదు. అసలువాణ్ణి పురిటి సమయంలో వేరేచోటికి మార్చేసావు" అన్నాడు.

ఈ అభియోగానికి తెల్లబోతూ, "నువ్వేమంటున్నావో నాకు తెలియడంలేదు" అన్నాడతడు.

"ముందిది చెప్పు. సర్వసంగ పరిత్యాగులు కూడా నీ అంత నిశ్చింతగా ఉండరు. నీకు భార్యాబిడ్డలున్నారు. కోరిక లున్నాయి. సామర్థ్యముంది. అయినా అణిగిమణిగి ఉండాల్సొచ్చింది. అందుకు కృంగి కృశించి పోవేం? ఏమిటి నీ ధైర్యం? " అన్నాడు భూపతి.

"అదా.. 'చేసినట్టి పాపములకు శిక్షయున్న, పాపములు చేయనందుకు వలయ రక్ష'- అన్నాడు గాలిబ్. అదే నా ధైర్యం" అన్నాడు సీతారామయ్య.

"ఈ భూమ్మీద పాపాలకు శిక్షా లేదు. పుణ్యానికి రక్షా లేదు. నీ గాలిబే 'ఈ జగత్తు స్వభావమ్ము నేమియందు, మంచి చేసిన వానివి ముంచునౌర'-అన్నాడు. తెలుసు కదా!" అన్నాడు భూపతి.

"అరే... మొత్తంమీద నువ్వూ గాలిబ్‌ని చదవడం మొదలెట్టావన్నమాట! గుడ్ డెవలప్‌మెంట్" అన్నాడు సీతారామయ్య.

"నేను చదవలేదు, మాలతి చెప్పింది. ఇది చెప్పి ఆ సీతారామయ్యకి గుడ్ డెవలప్‌మెంట్ ఉండకూడదని కూడా చెప్పింది" అన్నాడు భూపతి.

"అయితే? "

"నువ్వు పురిట్లోనే శేఖర్ని వేరేచోటకు మార్చేయడం గుడ్ డెవలప్‌మెంట్ అనుకోకు. నువ్వు మార్చిన విషయం నాకు

తెలియడమే గుడ్ డెవలప్‌మెంట్” అన్నాడు భూపతి.

“ఏమిత్రా నువ్వనేది? ఎక్కడైనా తన బిడ్డని వేరేవాళ్ళకిచ్చి తను వేరేవాళ్ళ బిడ్డని పెంచుకునే తండ్రులుంటారా? ” అన్నాడు సీతారామయ్య.

“ఎందుకు లేరు? శ్రీకృష్ణుడి కన్నతండ్రి వసుదేవుడే ఉన్నాడు. ఆయన కంసుడికి భయపడినట్లు నువ్వు నాకు భయపడ్డావు”

సీతారామయ్య భూపతిని అదోలా చూసాడు, “భయమంటే తెలియని నాకు భయమా- అదీ నువ్వంటే? కలగంటున్నావా? నీకు భయపడితే నేనెప్పుడో సకుటుంబంగా ఈ ఊరొదిలి పెట్టేవాణ్ణి. అసలు నేనిక్కడే ఈ ఊళ్ళో నీ కళ్ళెదుటే ఉన్న కారణం- నిన్ను భయపెట్టాలని!”

అతడి గుండె నిబ్బరానికి అబ్బురపడుతూనే, “నన్ను భయపెట్టడమా- అదీ నువ్వా? కలగంటున్నావా? ” అన్నాడు భూపతి సీతారామయ్య స్టైల్నే అనుకరిస్తూ.

“నేను నిన్ను భయపెట్టలేనని నాకు తెలుసు. కానీ నీకే తెలిసినట్లు లేదు. ఎందుకో మరి నువ్వు నన్ను చూస్తే భయపడతావు. భయపడతావు కదా అనినేను నీ కళ్ళెదుటే ఉంటున్నాను” అని నవ్వాడు సీతారామయ్య.

తెలివి. తన మాట తనకే తిప్పికొట్టే తెలివి. ఏడుపొస్తున్నా ఏడవకుండా ఏడ్పించేవాణ్ణి ఏడ్పించే తెలివి.

భూపతికి ఏడుపు రాలేదు కానీ ఉక్రోషమొచ్చింది, “నీతో మాటలెందుకులే కానీ- నామీద పగ తీర్చుకుందుకు నీ అసలు కొడుకెక్కడ పెరుగుతున్నాడో చెప్పు” అంటూ గద్దించాడు.

ఎంత చెప్పినా భూపతి తన అనుమానం వీడకపోతే సీతారామయ్య నిట్టూర్చి, “భూపతీ! జీవితం గురించి నీకు అర్థం కానిదొకటుంది. మనిషికి కోరికలెంత సహజమో అవి తీరనంత మాత్రాన కుంగి కృశించిపోవడమూ అంత అసహజం. ‘ఆర్ద్రతాబంధురంబైన అలరుతోట నలరులే రాతి గోడలై అవతరించె’- అన్నాడు గాలిబ్. ప్రణయార్ద్రమైన హృదయవనానికి కంచెగా కట్టిన రాతిగోడని కూడా పూలతో కట్టారంటాడాయన. అంటే అక్కడ కఠినత్వానికి తావేలేదు. నేను గతం తవ్వుకుని ఏడవను. భవిష్యత్తు తలచుకుని గుండెలు బాదుకోను. వర్తమానమొక్కటే నాకు నిజం. ఆ నిజాన్ని మనసారా అనుభవిస్తాను. ఆ అనుభవంలో నేను, నా భార్యాబిడ్డలు- అందరూ భాగస్వాములం. కష్టలూ, కార్పణ్యాలతో ఆ

## అన్నీ గమ్మత్తులే

సీరామూర్తి, టింగు రంగారావు, వామాక్షి, హరిదాసు.. ఇవన్నీ ఆరుద్ర పేర్లే. అప్పుడే సినిమాపాటల్లోనూ గమ్మత్తులెన్నో చేశారు. నువ్వంటేనే మోజు
అలా రాసిస్తానే దస్తావేజు/
ఏం పిల్లో సింకిరి బింకిరిగున్నావు/
వందనాలు చేయాలి అందరికీ
వంకదండాలు పెట్టాలి కొందరికి/
మాది మనసు ఖజానా
మీకీ హిస్తాంలే నజరానా/
ప్రేమగీతాల్లోనూ మేటి ఆరుద్రే. ఉదా॥
వన్నెలలో చిన్నెలలో తేనెలున్నవి/
నా కన్నులనే గిన్నెలతో తాగమన్నవి/
పడుచుదనం రైలుబండి పోతున్నది
వయసువాళ్ళకందులో చోటున్నది.. ఇలా నిదర్శనాలు అనేకం.



అనుభవాన్ని కలుషితం చేసుకోలేను. నాకే లేని పగని నా కొడుక్కి వారసత్వంగా ఇస్తానని నువ్వనుకోవడం చిత్రంగ ఉంది."

"కబుర్లు చెప్పకు. శేఖర్ నీ కొడుకు కాదని నాకు మాలతి చెప్పింది."

"నో" అరిచాడు సీతారామయ్య.

"నో ఎందుకట?"

"మాలతి అబద్ధం చెప్పదు"

భూపతి ఆశ్చర్యంగా అతడివంక చూసాడు. ఇప్పటికీ అతడికి మాలతిమీద ఎంత నమ్మకమో అనుకుంటూ, "మాలతి అబద్ధం చెప్పదు. అందుకే నేనూ నమ్మాను" అన్నాడు.

అప్పటికి సీతారామయ్య కాస్త సంబాళించుకుని, "భూపతీ! నీలో రాక్షసాంశ ఉంది. అది నాలోని దైవాంశకి భయపడుతోంది. ఆ రాక్షసాంశని అదుపు చేయి. లేకుంటే అది నీలో ఇంకా ఇంకా భ్రమలు కలిగించి నిన్ను మనశ్శాంతికి దూరం చేస్తుంది" అన్నాడు.

"నావి భ్రమలైతే వాటిని తొలగించాల్సిన బాధ్యత కూడా నీదే! లేకుంటే ఆ భ్రమల దుష్ఫలితాలు నువ్వే అనుభవించాలి" అన్నాడు భూపతి.

సీతారామయ్యకి విసుగొచ్చింది, "సరే- వాదనలాపి ఒక ఒప్పందానికొద్దాం. నేను నీకు మనశ్శాంతి కలిగే మంచి ఉపాయమొకటి చెబుతాను. ఆ తర్వాత నువ్వు మళ్ళీ- శేఖర్ తర్వాత ఇంకా పిల్లలు పుట్టారా అంటూ నా వెంటబడనని మాటివ్వాలి" అన్నాడు సీతారామయ్య.

"సరే- మాటిస్తున్నాను" అన్నాడు భూపతి.

"మాటిస్తున్నానంటే చాలదు. ఒట్టేయాలి"

భూపతి తటపటాయించకుండా, "సరే-ఒట్టు" అన్నాడు.

"ఒట్టు- మాలతిమీద వేయాలి."

భూపతి తెల్లబోయాడు, "అంటే నేనామెపై ఒట్టేస్తే తప్పనని నీ నమ్మకమా?" అన్నాడు.

"నువ్వు మాలతిని ప్రేమిస్తున్నావు. అదీ నాకంటే ఎక్కువగా- ఆ విషయం నాకు తెలుసు"

భూపతిలో సంతోషం, "థాంక్స్- ఇది నాకు చాలా గొప్ప కాప్లిమెంటు" అన్నాడు అప్రయత్నంగా.

"కాంప్లిమెంటు కాదు, ఉన్నమాటే!"

"ఏమో- మాలతిని ప్రేమిస్తున్నానని ఒక్కోసారి అనిపించదు" నిజాయితీగా అన్నాడు భూపతి.

"ఒట్టేసి చూడు. నీ ప్రేమమీద నీకున్న డౌట్సన్నీ పోతాయి"

"మరి ఒట్టేసి మాట తప్పితే?"

"ప్రేమించకుండా ఇన్నేళ్ళామెతో కాపురం చేసినందుకు నేను నిన్ను చంపేస్తాను" దృఢంగా అన్నాడు సీతారామయ్య.

ఊహించని ఈ సమాధానానికి భూపతి షాక్ తిన్నాడు. కాసేపాగి నెమ్మదిగా, "నువ్వు నన్ను చంపడమా?" అన్నాడు ఆశ్చర్యాన్ని కప్పిపుచ్చుకుంటూ.

"అవును, మాలతి కోసమే నిన్ను బ్రతకనిస్తున్నాను. ఆమెకోసం చంపడానికీ వెనకాడను"

"నీ జీవితాన్ని నాశనం చేసాను. నీ పిల్లలకి భవిష్యత్తు లేకుండా చేసాను. అప్పుడు నువ్వు నన్ను చంపాలని అనుకోలేదు"

"నాకు నా జీవితంమీద ప్రేమ లేదు. నా పిల్లల భవిష్యత్తు గురించి బెంగ లేదు. జీవితంలో నేను ప్రేమించిన ఒకే ఒక్క వ్యక్తి మాలతి. ఆమెకోసం నా జీవితాన్నీ, పిల్లల్నీ కూడా లెక్కచెయ్యను"

"కానీ ఆమె నిన్ను మర్చిపోయింది తెలుసా?"

"అదామె సంస్కారం"

తెల్లబోయాడు భూపతి. సీతారామయ్య సాధుజంతువు. మాలతిని ప్రేమించి ఆమె కోసం క్రూరజంతువుగా మారతానంటున్నాడు. ఆమెనుంచి ఏమీ ఆశించడు. ఆమె తన్ను మర్చిపోతే అదామె సంస్కారమని మెచ్చుకుంటాడేతప్ప తప్పు పట్టడు. అదేనా ప్రేమంటే?

"సరే- మాలతి మీద ఒట్టేస్తున్నాను" అన్నాడు భూపతి.

సీతారామయ్య తృప్తిపడి, "నేడు సైన్సు సాధిస్తున్న ప్రగతి ఎంత అద్భుతమైనా అది నీలాంటివాళ్ళకే ఎక్కువ ప్రయోజనాన్నిస్తోంది. పుట్టిన బిడ్డలకి తల్లిదండ్రులు ఫలానా అని కచ్చితంగా నిర్ధారించడం ఇప్పుడు చాలా సులభం. అందుకు డీఎన్ఏ పరీక్ష తిరుగులేనిది" అన్నాడు.

అంతవరకూ తనకా ఐడియా రానందుకు తన్ను తానే నిందించుకున్న భూపతి- వెంటనే ఆ ఏర్పాట్లు చేస్తే- డీఎన్ఏ పరీక్షలో శారద, శేఖర్-సీతారామయ్య పిల్లలేనని తేలింది. ఇక భూపతికృలిగిన ఆనందమింతా అంతా కాదు. రివాజుగా ఆ సంతోషాన్ని భార్యతో పంచుకున్నాడు.

మాలతి ప్రశాంతంగా, "మాటిచ్చారుగా. ఇక మీరు సంతోషంగా ఉండడం మంచిది" అంది.

ఆమె వ్యాఖ్యకి ఎన్నో అర్థాలుంటాయని భూపతి నమ్మకం. సీతారామయ్యకితనిచ్చిన మాటేమిటీ అని ఆలోచిస్తే గుర్తొచ్చింది- "శేఖర్ తర్వాత ఇంకా పిల్లలు పుట్టారా అని నా వెంటబడి వేధించనని మాటివ్వాలి" అని. ఇప్పుడు మాలతి వ్యాఖ్యలో ఆ ప్రస్తావనుంది.

"సమూలంగా అంటే? " అదామె ప్రశ్న. "కంసుడి కథ" అదామెకు స్ఫురణ. "మాటిచ్చారుగా- ఇక మీరు సంతోషంగా ఉండండి" అదామె సూచన. ఈ మూడూ కలిస్తే...

సీతారామయ్యకు ఇంకా పిల్లలున్నారు.

## కొత్తగాలి...

**అవినీతిని చూసి**
**కళ్లు మూసుకుంటే**
**దానిలోనే**
**నిద్రపోవాల్సి వస్తుంది**

– చప్ప, పాములవలస

వారెక్కడో పెరుగుతున్నారు. వారి గురించి ప్రశ్నలతో వేధించనని తను సీతారామయ్యకు మాటిచ్చాడు. మాటిచ్చి మాలతిమీద ఒట్టేసాడు.

భూపతి తలపట్టుకున్నాడు. సీతారామయ్య చాలా తెలివిగా తనను ట్రిక్ చేసాడు. అతడు మాటివ్వమన్నపుడేనా తనకి అనుమానం రాలేదేమిటి?

అసలీ సీతారామయ్య విశేషాల్లో పెద్ద గొలుసు కథలు ఉన్నాయి. ఎంత ప్రయత్నించినా అంతుదొరకడం లేదు. మాలతి చెబితే తప్ప లింకులూ తెలియడం లేదు.

"ఛా- చాలా పెద్ద పొరపాటు చేసాను" అనుకున్నాడు భూపతి.

"ఏమిటాలోచిస్తున్నారు? " అడిగింది మాలతి.

"సీతారామయ్యకు ఇంకా పిల్లలున్నారంటావా? " అడిగేడతడు.

"నాకేం తెలుస్తుంది? అయన్నే అడగండి"

"అడగనని ఒట్టేసాను. అమ్మో- ఆ ఒట్టేసింది నీమీద"

మాలతి విస్మయంగా అతణ్ణి చూసి, "అయితే యేం? ఒట్టుతీసి పెట్టండి" అంది.

భూపతి తల అడ్డంగా ఊపాడు.

"మీరు ఒట్టుని నమ్ముతారా? " అంది మాలతి ఆశ్చర్యంగా.

"నమ్మను. సాధారణంగా నేను ఎదుటి

వాళ్ళచేత అబద్ధాన్ని నమ్మించడానికి ఒట్టే స్తాను. కానీ నీ విషయంలో నేనెలాంటి రిస్క్కూ తీసుకోలేను. ఒట్టంటే ఒట్టే!"

సెంటిమెంట్ల విషయంలో దుర్మార్గులు సన్మార్గుల కంటే కచ్చితంగా ఉంటారు. మన పురాణాల్లో కూడా దేవతల విష్ణుభక్తి కంటే రాక్షసుల శివభక్తి స్వచ్ఛమైనది. భూపతి బాగా ఆలోచించి చివరకు సీతారామయ్య ఫైల్సు మరోసారి చూడాలనుకున్నాడు.

మాలతితో పెళ్ళయ్యాక సీతారామయ్య దినచర్య కనిపెట్టడానికి ముగ్గురు మనుషుల్ని నియమించాడతడు. వాళ్ళు ఒకరికొకరు తెలియరు. ఒక్కొక్కరిది ఒకో పద్ధతి. తాము సేకరించిన విశేషాల్ని అతడు నియమించిన మరో మనిషికందజేయడం వాళ్ళ బాధ్యత. ఆ మనిషి వాళ్ళు తెచ్చిన సమాచారాన్ని క్రోడీకరించి, కుదించి- సీతారామయ్య దినచర్యని తేదీలవారీగా నోట్సుగా తయారుచేసి ఫైల్ చేస్తాడు. ఆ ఫైల్ చూసి యాక్షన్‌ప్లాన్‌కి మెరుగులు దిద్దుతాడు భూపతి.

భూపతి ఆఫీసులో ఏటికొకటి చొప్పున సీతారామయ్య ఫైల్సు చాలా ఉన్నాయి. ఇప్పుడు వాటిని తిరగేస్తే- శేఖర్ పుట్టిన రెండు మాసాలకి సీతారామయ్య ఓ గవర్నమెంట్ కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న విశేషముంది.

భూపతి చకచకా ఆరాలు తీయించి- ఆ హాస్పటల్లో పాతరికార్డులు తిరగేయించాడు. అదృష్టంకొద్దీ అతడిక్కావలసిన పాత తేదీల రికార్డులుదొరికాయి. ఐతే ఆ తేదీల్లో కానీ, వాటికటూ ఇటూ, ముందూ వెనకా కానీ-ఎక్కడా సీతారామయ్య పేరు లేదు.

అంటే సీతారామయ్యకి ఆపరేషన్ జరగలేదు. తనని తప్పుదారి పట్టించడానికి హాస్పిటల్ కెళ్ళి మరేదో పని చూసుకుని వెనక్కొచ్చేసి ఆపరేషనంటూ ప్రచారం చేసాడు.

తను కూడా తన మనుషుల్ని సీతారామయ్య దినచర్య తెలుసుకోమన్నాడే తప్ప రుజువుల గురించి రొక్కించలేదు. ఎందుకంటే తను సీతారామయ్యని దెబ్బతీయాలని ఆలోచించాడే తప్ప అతడు తనని తప్పుదారి పట్టిస్తాడనుకోలేదు. యుద్ధంలో శత్రువుని తక్కువ అంచనా వేయకూడదన్న ప్రాథమిక సూత్రాన్ని భూపతి విస్మరించాడనుకుందుకూ లేదు. అంతవరకూ



అతడి దృష్టిలో సీతారామయ్య ఓ యుద్ధ ఖైదీ మాత్రమే. యుద్ధంలో ప్రత్యర్థి కావచ్చన్న అనుమానమిప్పుడే కలిగింది.

"ఏమో అనుకున్నా సీతారామయ్యా! నువ్వు గుండెలు తీసిన బంటువి" అనుకుంటూ అతడు ఫైల్ని మళ్ళీ మళ్ళీ తిరగేస్తే...

శేఖర్ పుట్టిన ఆరేళ్ళకి- సీతారామయ్య భార్య రుక్మిణి పుట్టింటికెళ్ళింది. అంతవరకూ వారానికి మించి ఉండని ఆమె అప్పుడక్కడ ఏడు నెలలుంది. రుక్మిణి పుట్టింటి వారికి ఆడసాయం కావాల్సొచ్చిందన్న సీతారామయ్య కథనాన్ని భూపతి అప్పట్లో అనుమానించలేదు.



అప్పట్నించీ రుక్మిణి వారం పదిరోజుల కోసారి పుట్టింటికి వెళ్లి వస్తుండేది. వెళ్ళినప్పుడల్లా కనీసం పదిరోజులక్కడే ఉండేది. దానికీ అప్పుడు భూపతి ప్రాధాన్యాన్నివ్వ లేదు. కానీ ఇప్పుడు...

సీతారామయ్యకి మూడో బిడ్డ. ఎక్కడో పెరుగుతూ... బాగా చదువుతూ.... ఈపాటికి ఇంటర్ పూర్తిచేసుండాలి.

సీతారామయ్యకి ఇంజనీరింగులో సీటొచ్చింది. శేఖర్‌కు మెడిసిన్లో సీటొచ్చింది. ఇపుడీ బిడ్డ కూడా మెడిసిన్లోనో, ఇంజనీరింగులోనో...

"నో" భూపతి మనసు అరిచింది.

ఆ బిడ్డ ప్రగతిని ఆపాలి. ఆపాలంటే ముందాబిడ్డ ఎక్కడున్నదీ తెలుసుకోవాలి. భూపతి తన అనుమానాల్ని మాలతి ముందు పెట్టి ఆమె సలహా అడిగాడు.

"అంతా మీ భ్రమ. ముందు మీరా భ్రమనుంచి బైటపడాలి" అంది మాలతి.

"నాది భ్రమే ఐతే అందుకు నీ మాటలే కారణం. కాబట్టి నేను భ్రమపడే సీతారామయ్య మూడోబిడ్డ గురించి తెలుసుకునే ఉపాయం కూడా నువ్వే చెప్పు" అన్నాడు భూపతి.

"నా మాట నమ్మి భ్రమపడితే- అది తొలగడానికీ నా మాట నమ్మండి. నాకు తెలిసి ఉన్నదొక్కటే ఉపాయం. శేఖరే సీతారామయ్య ఆఖరి బిడ్డ అనుకోండి"

భూపతికి తృప్తిగా లేదు. మనసు సరి పెట్టుకోలేక "ప్లీజ్- ఏదో ఉపాయం చెప్పు. నువ్వు చెప్పగలవని నాకు తెలుసు" అంటూ బ్రతిమాలాడు.

"ఐతే ఒట్టుతీసి గట్టుమీదెట్టి సీతారామయ్యనే పట్టి మీరు తెలుసుకున్న విషయాల గురించి గట్టిగా నిలదీయండి" అంది మాలతి.

అలా చెయ్యడానికి సెంటిమెంటొప్పుకోలేదు భూపతికి. అతడు మాలతిని మరీ మరీ అడిగి లేదనిపించుకున్నాక చివరకో డిటెక్టివ్‌ని నియమించాడు. ఆ డిటెక్టివ్ చకచకా ఆరాలు తీసాడు.

అప్పట్లో రుక్మిణి తల్లికి యాక్సిడెంటై కాలు విరిగి మంచం పట్టింది. రుక్మిణి ఏడెనిమిది నెలలు దగ్గరుండి తల్లికి సేవలు చేసింది. ఆ తర్వాత కూడా పూర్తిగా నయమయ్యేవరకూ పుట్టింటికి వస్తూ పోతూండేదామె. అక్కడ రుక్మిణి పురుడు పోసుకున్నట్లు కానీ, బిడ్డను కన్నట్లు కానీ ఆచూకీలో తెలియలేదు.

అది ఎన్నో ఏళ్ళక్రితం జరిగిన విశేషం. ఈ మధ్యకాలంలో రుక్మిణి తల్లిదండ్రులే నాలుగిళ్ళు మారారు. అప్పుడు వారి ఇరుగుపొరుగూ ఎవరో తెలియదు. ఇప్పుడున్న వారికి అప్పటి గతం తెలియదు. కూపీ లాగితే రుక్మిణి తల్లిదండ్రులనుంచి వచ్చిన వివరాలివి.

ప్రస్తుతం రుక్మిణి పుట్టింట్లో చంటిబిడ్డలు లేరు. ఇప్పుడున్న మనుమలు, మనుమరాండ్రు వయసులో- పన్నెండేళ్ళకు లోపే.

ఈ సమాచారం భూపతికి తృప్తినివ్వ లేదు. సీతారామయ్యకి మూడోబిడ్డ ఉన్నాడనీ, అతడు వేరే ఎక్కడో పెరిగాడనీ, ఇప్పటికి ఇంటర్‌పూర్తి చేసి ఉంటాడనీ- భూపతికి పూర్తి నమ్మకం కుదిరింది.

"ఈ డిటెక్టివ్ చాలడు. సమర్థుడైన మరో డిటెక్టివ్‌ని నియమించాలి" అనుకున్నాడతడు.

అలా వెలుగులోకొచ్చాడు మురళి.

మురళి యువకుడు. ప్రతిభావంతుడు. స్వతంత్రంగా ఉంటూ ఆర్థికంగా పైకెదగాలనుకుంటున్నాడు. ఇటీవలే అతడి పరిశోధనా ఫలితాలు- పోలీసులకి రెండు పెద్ద కేసుల్ని సాధించడంలో సహకరించాయి. వారి ద్వారానే భూపతికి మురళి గురించి తెలిసింది.

అతడు మురళిని కలిసి సీతారామయ్య

కథ చెప్పాడు.

ఆ కథలో సీతారామయ్య, భూపతి ప్రాణ స్నేహితులు. విధికి ఎదురీదుతున్న సీతారామయ్యని ఆదుకోవాలని భూపతి తపన. అభిమానధనుడైన సీతారామయ్య మాట సాయాన్నే తప్ప ధనసాయాన్ని అంగీకరించలేదు. సీతారామయ్య సమస్యే మిటో భూపతికి తెలియదు కానీ అతడెవ రికో భయపడుతున్నాడన్న అనుమాన ముంది. ఆ కారణంగానో ఏమో- అతడు తనకి పుట్టిన మూడో బిడ్డ ఉనికిని రహస్యం చేసాడు. ఆ బిడ్డ ఎక్కడున్నాడో తెలుసుకుని సీతారామయ్యకి తెలియ కుండా అతడి ప్రగతికి సాయపడాలని భూపతి కోరిక.

"వెంటనే రంగంలోకి దిగు. నువ్వాశించే కంటే ఎక్కువ డబ్బిస్తాను. సీతారామ య్యని కానీ, వాడి కుటుంబ సభ్యుల్ని కానీ, బంధువుల్ని కానీ నొప్పించకుండా వేధించ కుండా- పరిశోధించి- శేఖర్ తమ్ముడు లేక చెల్లెలు వివరాలు సేకరించాలి" అన్నాడు భూపతి.

భూపతి వ్యక్తిత్వానికి మురళి అబ్బుర పడి, "పరిశోధనలోకి దిగేముందు మీకూ, సీతారామయ్యకి ఉన్న అనుబంధం తెలు సుకోవాలనుంది" అన్నాడు.

"నువ్వీ కేసులో నేననుకున్న టైముకి అనుకున్న ఫలితాలు సాధిస్తే- మా ఫ్యామిలీ మెంబరవుతావు. అప్పుడు నీకు- ఇప్పుడడిగినవాటికంటే ఎక్కువ వివరాలు చెబుతాను. ప్రస్తుతానికి సీతారామయ్య మూడో బిడ్డ ఆచూకీ మీదే దృష్టి పెట్టు" అన్నాడు భూపతి.

మురళి డిటెక్టివ్ బుర్రకి హెచ్చరిక అర్థ మైంది. అతడాయనకు వినయంగా నమ స్కరించి, "నేనేమిటో- నేను కాదు, నా పరి శోధనే చెబుతుంది" అని వెళ్ళిపోయాడు.

తనవల్ల ప్రయత్నం లోపముండకూడద నుకున్నాడే తప్ప మురళి ఏదో సాధిస్తా

## కొత్తగాలి...

**శ్రమించి బతికేవాడు**
**కృషీవలుడు**
**విశ్రమించి బతికేవాడు**
**ఖుషీ లోలుడు!**

– సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ, శ్రీకాకుళం

డని భూపతి అనుకోలేదు. కానీ మురళి రంగంలోకి దిగుతూనే చురుగ్గా వ్యవహ రించాడు. అతడోరోజు భూపతిని కలిసి "మీ అనుమానం నిజమే! సీతారామయ్యకి మూడో బిడ్డ కలిగినమాట నిజం" అన్నాడు.

"అమ్మ సీతారామయ్యా!" అనుకున్న భూపతి ఆత్రుతగా ఆ బిడ్డ వివరాలడి గాడు.

"అతడి పేరు తెలియదు. ఎక్కడున్నాడో తెలియదు. కానీ బాగా చదువుతున్నాడు. అతడి లక్ష్యం ఐఐటీ" అన్నాడు మురళి.

"ఐఐటీలో చేరేలోగా వాణ్ణి వెతికి పట్టగ లవా? " అన్నాడు భూపతి కంగారుగా.

"వెంటనే అతణ్ణి పట్టాలంటే నా పద్ధ తులు నాకున్నాయి. కానీ మీరు ఫలానా వాళ్ళని వేధించకూడదంటూ షరతు పెట్టడం నాకిబ్బందిగా ఉంది" అన్నాడు మురళి.

"అవును. ఆ నియమం పాటించి తీరాలి" కచ్చితంగా చెప్పాడు భూపతి.

"ఐతే నా ప్రయత్నాలు నేను చేస్తాను. కానీ మీ షరతువల్ల కాస్త ఎక్కువ టైం పట్టొచ్చు"

"సరే- నీ టైం నువ్వు తీసుకో. నియమం మాత్రం తప్పొద్దు. ఇంతకీ సీతారామయ్యకి మూడో బిడ్డ ఉన్నట్లు నువ్వెలా నిర్ధారించావు? "

"అది నా వృత్తి రహస్యం. పరిశోధన

పూర్తయ్యేదాకా ఆ వివరాలు చెప్పను" అన్నాడు మురళి.

"అలా అంటే కుదరదు. ఆ వివరాలు లేకుండా- సీతారామయ్యకి మూడోబిడ్డ ఉన్నాడని నేనెలా నమ్మగలను? " నొక్కిం చాడు భూపతి.

మురళి వెంటనే, "వృత్తిరహస్యం చెప్పడా నికి నేను మీ ఫ్యామిలీ డిటెక్టివ్‌ని కాను" అన్నాడు.

అర్థమైంది భూపతికి. మురళి డబ్బుకి పని చేయొచ్చు కానీ డబ్బుకి సలాం చేయడు. అతడు సిన్సియర్‌గా తన ప్రయ త్నాల్లో ఉన్నాడు.

"సరే వెళ్ళు, తొందరగా పనిపూర్తిచేయి" అని మురళిని పంపేసి ఆలోచనలో పడ్డాడు భూపతి.

"సీతారామయ్యకి మూడోబిడ్డ ఉన్నాడని కచ్చితంగా తెలిసింది" అన్న మురళి మాటలు వంటబట్టడానికి కొంతసేపు పట్టిందతడికి. ఆ వెంటనే అతడికి ఛాతీలో నొప్పొచ్చింది...

★ ★ ★

సరిగ్గా పదకొండు గంటలకి భూపతి పక్కన ఫోన్ మోగింది. రిసీవర్ తీసాడా యన.

"నీ పాపాలు గుర్తొచ్చాయా? " అడిగింది అవతలి గొంతు.

"రాముడు రావణుణ్ణి చంపితే రాముడి కది పుణ్యమే. నువ్వు చెప్పావని కాకపో యినా- చిన్నప్పట్నించి ఇంతవరకూ చేసిన వన్నీ ఓసారి గుర్తు చేసుకున్నాను. మరి నేనెంత పుణ్యాత్ముణ్ణో ఏమిటో- చేసినవన్నీ మంచి పనులే- పాపమన్నది ఒక్కటీ స్ఫురించడం లేదు" అన్నాడు భూపతి.

"నిన్ను చూస్తే జాలేస్తోంది. చేసిన పాపం చెబితే పోతుందంటారని నీచేత నీ పాపాలు చెప్పిద్దామనుకున్నాను. కానీ దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవారు లేర న్నట్లు- అన్నీ పాపాలే చేసిన నీకిప్పుడొక్క పాపం కూడా గుర్తుకు రావడం లేదు. పాపం- నీకు నీ పాపాల్నించి విముక్తి లేదు"

"షటప్" కోపంగా అన్నాడు భూపతి.

"అరే భూపతీ! ఇంకా నీకు నీ పాత అల వాట్లు పోలేదు. ఇప్పుడు నన్ను షటప్ అని ఎన్నిసార్లన్నా లాభంలేదు. గుర్తు చేసుకో- ఒకసారి నేను నిన్ను పేరుపెట్టి పిలిస్తే రెచ్చిపోయావు. మరోసారి నా నోట నీ పేరు వినిపిస్తే నా గొంతు నొక్కే స్తానన్నావు. ఇప్పుడు నువ్వు వింటున్నది ఆ గొంతే! వింటున్నావా భూపతీ- ఇప్పుడు నా నోట నీ పేరు పలికింది..."

"నేనేం పేదవాణ్ణి కాదు. కోపం పెదవి కి చేటని భయపడడానికి. నేను పెద్ద వాణ్ణి. కోపమొస్తే నా నోటికి అదుపుం డదు. అలా గొంతు నొక్కేస్తావని చాలా మందితో అన్నాను. శతకోటి లింగాలలో బోడిలింగానివి. నీతో అన్న మాటల్ని సీరి యస్‌గా తీసుకుంటానా? నీకు సరదాగా ఉంటే మాత్రం చెప్పు. వెంటనే గొంతు నొక్కేసే ఏర్పాట్లు చేస్తాను" కసిగా అన్నాడు భూపతి.

"అరే- అప్పుడు నువ్వే నా గొంతు నొక్కుతానన్నావు. ఇప్పుడు ఏర్పాట్ల గురించి మాట్లాడుతున్నావు. ఎంతలో ఎంత మార్పు? ఓహో- మర్చేపోయాను. ఒంటరిగా ఉన్నావు కదూ- డాక్టర్లు మంచం దిగొద్దన్నారు కదూ. ఇక మంచం దిగవులే- నాదీ హామీ"

వచ్చిన కోపం హెచ్చింది భూపతికి. "ఏమిట్రా సీతారామయ్యా- ఏమిటీ ఎంతలా అణిచినా ఇంకా నీ గొంతు లేస్తూనే ఉందీ? " అన్నాడు హెచ్చరికగా.

"నాలుగ్గోడల మధ్య బంధిస్తే పులి పిల్లి ఔతుంది. గుండెనొప్పొచ్చి బెడ్ రెస్టుకోసం మంచంపట్టి అయినవాళ్ళెవ్వరూ దగ్గర్లేక

ఒంటరితనం బాధిస్తే పులి పిల్లి అవుతుంది. ఈ సాయంత్రం- గుర్తుంచుకో - సరిగ్గా ఐదింటికి పులి ఐన పిల్లి- పిల్లి ఐన పులిమీద దాడి చేస్తుంది"

"చేస్తే- అప్పుడేమవుతుందిట? "

"ఇకనైనా నీ పాపాలు గుర్తుతెచ్చుకుని పశ్చాత్తాప పడు. చావు తప్పదు కానీ నరకం తప్పొచ్చు".

"ఏయ్-" అన్నాడు భూపతి మరింత కసిగా, "నీకు తెలుసు- దయ, దాక్షిణ్యం లేకపోయినా స్నేహానుబంధంతో నిన్నింత కాలం బ్రతకనిచ్చాను. ఇంకా బ్రతకనిస్తాను- ఒక్క షరతుమీద! నీ గొంతులో నా పేరు, నీ ఊహలో నేను ఉండకూడదు. వింటున్నావా? "

"విన్నాను. ఒక్కటని రెండు షరతులు చెప్పావ్. అప్పుడే నీ బుర్ర పనిచెయ్యడం మానేసింది"

"పనిచేయని ఆ బుర్రే చాలు- నిన్నూ, నీ కుటుంబాన్నీ పైకి రాకుండా ఆపడానికి"

"అదే నీకూ నాకూ తేడా! నువ్వు నన్ను పైకి రాకుండా ఆపుతానంటున్నావ్. నేను నిన్ను పైకి పంపడానికి ముహూర్తం పెట్టాను. సరిగ్గా ఐదింటికి సిద్ధంగా ఉండు. మహామహా పుణ్యాత్ములకే చావు ముందుగా తెలియదట. పాపాత్ముడివైనా నీకు తెలిసింది. ఈ అదృష్టాన్ని సద్వినియోగం చేసుకుని నేనొచ్చేలోగా వీలైనన్ని మంచిపనులు చేయ్"

అప్పటికి ఇలాంటి మాటలు వినడానికి కాస్త అలవాటు పడ్డాడేమో- భూపతి కాస్త నిదానించాడు.

"నీ పథకం నాకర్థమైంది. నన్ను రెచ్చగొట్టి ఆవేశపర్చి గుండెపోటు తెప్పించి చంపాలని ఇలా మాట్లాడుతున్నావు. స్ట్రోకొచ్చి తగ్గినా అదింకా నీ గుండెకంటే బలంగానే ఉంది"

"ఒరేయ్, ఇంకా భ్రమలు తొలగలేదా? ఎందరికో హానిచేసి దినదిన ప్రవర్ధమానమవుతున్న నీ గుండెకి స్ట్రోకొచ్చింది. ఎన్ని అవమానాలనెదుర్కొన్నా నా గుండెకి స్ట్రోకంటే తెలియదు. ఎవరి గుండె గట్టిదో ఢీకొట్టే ముందు తెలుసుకో! ముహూర్తం గుర్తుందిగా- ఈ సాయంత్రం ఐదింటికి"

"సరే- ఎన్ని చెప్పినా నీ ధోరణి నీదే! ఇక నీతో మాటలు వృథా. టైం చూసుకో. పదకొండుంపావు కదా- సరిగ్గా పన్నెండింటికి నీ చావుకి నేను ముహూర్తం పెట్టాను" అన్నాడు భూపతి.

"ఇంకా పాతరోజులనుకుంటున్నావా- ఇప్పుడు నువ్వే కాదు- ఎవ్వరూ నన్ను చంపలేరు"

"నేను నిన్ను చంపగలను" అరిచాడు భూపతి.

"నిజంగానే నీ బుర్ర పనిచెయ్యడం

## ఆరుద్ర మార్కు

ఆరుద్ర మార్కు 'హ్యూమరాలజీ' మనల్ని గిలిగింతలు పెడుతుంది.

భార్యా రత్నానికి కంచిపట్టు చీర



నాన్నగారికి చాలు వంకాయకూర/
భార్యాభర్తలు అవాలి పాలూ తేనె
వాళ్లెపుడూ కాకూడదు నీళ్లూ నూనె/
శీర్షికల్లోనూ ఆరుద్రది విశేషమే.
తా'ళ్లూ'-తో'ళ్లూ' (తాబేళ్లూ-తోడేళ్లూ)
ఊష్ణమొస్తే బావుణ్ణు/
నే చెప్పానుగా/ తల్లి 'వూ' అంది/
అణాకో బేడ స్టాంపు/.. ఇలా ఆరోజుల్లోనే తమాషా పేర్లు పెట్టారు.

లేదు. నా మాటలు నెమరేసుకో. చంపలేనని గ్రహిస్తావు"

"సాయంత్రం ఐదన్నావుగా అప్పుడు నన్ను చంపడానికి నువ్వు కాదు, నీ దెయ్యం రావాలి" అన్నాడు భూపతి కటువుగా.

"మరి ఇప్పుడు మాట్లాడుతున్నదెవరనుకున్నావు? "

ఉలిక్కిపడ్డ భూపతి, "హలో, హలో" అన్నాడు కానీ అవతల కట్టయ్యింది.

భూపతికి ఒళ్లు జలదరించింది. ఏమన్నాడు సీతారామయ్య?

"నన్ను చంపడానికి నువ్వు కాదు నీ దెయ్యం రావాలి అని అంటే 'మరిప్పుడు మాట్లాడుతున్నదెవరనుకున్నావు? ' అన్నాడు. ఎంత పొగరు? "

గతంలో సీతారామయ్య శాపనార్థాలు వాద్య సంగీతపు మృదుస్వరాల్లా ఉండేవి. కాళ్లావేళ్లాపడి బ్రతిమాలితే లలిత సంగీతంలా ఆహ్లాదంగా ఉండేది. కానీ ఇప్పటి మాటలు పాప్ మ్యూజిక్కై ఆడిస్తున్నాయి. రెచ్చిపోయిన భూపతి "సీతారామయ్యని చంపేయాలి!" అని గట్టిగా అనుకున్నాడు. అనుకోగానే శ్రీరామ్ గుర్తుకొచ్చాడాయనకు.

శ్రీరామ్ ముఖానికి నవ్వుకీ విడదీయలేని బంధముంది. ఎంతటి విషాదంలోనూ చెరగని చిరునవ్వు అతడి ముఖానికి గొప్ప అలంకారం. అలాగని శ్రీరామ్ సరదా మనిషి కాదు. అతడో కిరాయి హంతకుడు. బేరాలు లేనప్పుడు హింస అతడి హాబీ. హింసిస్తున్నా, చంపుతున్నా అతడి ముఖంలో చిరునవ్వు చెరగదు.

శ్రీరామ్ మనుషుల్ని చంపే పద్ధతులు రెండు. ఒకటి- కత్తితో పొడవడం, రెండు- తలగడతో అదమడం. రెండిటికీ చేతుల బలం కావాలి. తెలిసినవారు అతడి చేతలకంటే చేతులకే భయపడతారు. అతడెవర్నైనా ప్రేమగా భుజం తట్టినా అవతలి మనిషి గట్టిగా చరిచినట్లనిపిస్తుంది. ఆ బాధ ముఖంలో ప్రతిఫలిస్తుంది. శ్రీరామ్ ముఖంలో మాత్రం చిరునవ్వు చెరగదు.

భూపతికి శ్రీరామ్ అంటే ఇష్టం. అతడి నవ్వంటే ఇష్టం. ఆ నవ్వు హింసకు ప్రతిస్పందనగా వస్తే మరింత ఇష్టం. తన పనులకి శ్రీరామ్‌ని నియోగిస్తూంటాడాయన. ఇప్పుడతడికే ఫోన్ చేసి విషయం చెప్పి, "ఈరోజే- అరగంట మించి టైమున్నట్లు లేదు. సరిపోతుంది కదా? " అన్నాడు.

"సర్- మీ ఒంట్లో బాగోలేదా? " అడిగాడు శ్రీరామ్.

"నిజమే కానీ నీకా అనుమానమెలా వచ్చింది? " భూపతి గొంతులో ఆదుర్దా.

"అరగంట సరిపోతుందా? అన్నారు. నా విషయంలో మీకా అనుమానం రావడం ఇదే ప్రథమం!"

"ఓకే- నాది పొరపాటే కానీ- నువ్వు చేస్తున్నదేమిటి? అవతల ముహూర్తం దగ్గర పడుతూంటే నువ్వేమో ఫోన్లో టైం వేస్ట్ చేస్తున్నావు" మందలించాడు భూపతి.

"భలేవారు సర్! మీరు పనప్పగిస్తే పొరపాటు రానిస్తానా? మీరు అరగంట సరిపోతుందా అన్నారు. అందుకని ఇంకో ఐదు నిముషాలు మీతో మాట్లాడిన ఆనందం పొంది అప్పుడు పనికి వెడదామనుకున్నాను. అరగంట నాకు చాలా ఎక్కువ కదా! మరి ఉంటాను సర్"

శ్రీరామ్ ఫోన్ కట్ చేయగానే తనూ రిసీవర్ హుక్ చేసి, "మొత్తం మీద సీతారామయ్య జీవితానికి ఇలాంటి ముగింపు రాసిపెట్టి ఉంది. ఇంతకాలం వాడి జీవితాన్ని శాసించిన నాకే ఇది ఊహకందలేదు" అంటూ నిట్టూర్చాడు భూపతి.

కానీ ఎందుకో తేలికపడ్డానికి బదులు గుండె బరువెక్కింది భూపతికి.




**స్వింగ్**డోర్ తోసుకుని లోపల అడుగెట్టిన మాలతి, "డిస్టర్బ్ చెయ్యడం లేదుగా డాక్టర్!" అంది. అయాసపడుతున్న ఆమెని ఆశ్చర్యంగా చూసి, "అదేమిటమ్మా అలా ఉన్నావ్?" అన్నాడు జయశంకర్.

"డాక్టర్- మనసులో చాలా గాబరాగా ఉంది" అంది మాలతి.

"గాబరా ఎందుకూ- భూపతిగారు బాగానే ఉన్నారుగా?"

"ఆయన బాగోగులు మీ చేతుల్లో ఉన్నాయి"

"కాదమ్మా- నాకంటే ఎక్కువ మీ చేతుల్లో ఉన్నాయి"

"మేము చేసేది చేస్తున్నాం డాక్టర్! ఆయన మనసుకి సంతోషం కలిగేలా అందరం ప్రవర్తిస్తున్నాం. ఐతే ఆయన చాలా మొండిమనిషి. గుండెజబ్బు కూడా లెక్కచెయ్యరు"

"ఒక విధంగా అదీ మంచిదే- ఆయన అనారోగ్యం కూడా మరీ అంత సీరియస్ కాదు"

"కానీ ఆ విషయం ఆయనకి తెలియకూడదు"

"అవునమ్మా! మీరిదివరకే అన్నీ చెప్పారు"

"అయినా నా తృప్తికోసం మళ్లీ చెబుతాను. మీరు బెడ్‌రెస్ట్ అన్నారని మంచం మీదున్నారు. లేకపోతే- పిడుగులా ఉన్నాను నాకేమంటూ వెంటనే ఇంట్లోంచి వెళ్లిపోయేవారు. ఇప్పుడు తను ఇంటి పట్టున ఉండడమే కాదు, మేమంతా ఇంటి పట్టునుండాలని పట్టుపడుతున్నారు"

"వెరీ గుడ్ ఛేంజ్!" అన్నాడు జయశంకర్.

"కానీ ఇంకా మేమెవ్వరం ఇంటిపట్టున ఉండడం లేదు"

"అదేం?"

"ఏళ్లుగా లేని అలవాటు ఉన్న ఫళంగా రమ్మంటే ఎలా? ఎవరి కమిట్‌మెంట్స్ వాళ్లవి. కొంచెం టైమ్ పడుతుంది"

"మరి మీ సంగతి?"

"నాకే సమస్యాలేదు. కానీ నేనూ టైం తీసుకుంటున్నా- కావాలనే!"

"కావాలనా?" జయశంకర్ గొంతులో ఆశ్చర్యం, కుతూహలం.

"ఇంటిల్లిపాదీ ఎక్కడెక్కడో ఉండి ఇరవై నాలుగ్గంటలూ నేనొక్కతెనే పక్కనుంటే ఆయనకి నేనంటే విసుగు పుట్టొచ్చు అది నాకిష్టం లేదు"

"ఈ పాయింటు నాకు తట్టలేదు. కానీ భార్యాభర్తల మధ్య కూడా విసుగనేది ఉంటుందా?"

"తెలియదు. కానీ మా ఇంట్లో ఏ ఇద్దరు మనుషులూ విసుగనిపించేటంత ఎక్కువ సేపు కలిసుండలేదు. ఇప్పుడా ప్రయోగం నాతోనే మొదలవడం నాకిష్టంలేదు"

జయశంకర్ నిట్టూర్చి "ఇంట్లో మనుషులే రోజూ కలిసి కాసేపు గడపాలంటే- అందుకు విశ్వప్రయత్నం చేయాలన్న మాట- ప్రపంచం చిత్రంగా మారిపోయింది" అన్నాడు.

"ఇది మార్పు కాదు డాక్టర్! చిన్నప్పుడు మా అమ్మ అనేది- అన్నయ్య వంకాయ

కూర తెగమెచ్చుకున్నాడని. వెంటవెంటనే మళ్లీ మళ్లీ దాన్ని వండకూడదు, గ్యాపివ్వాలని! ఇదీ అంతే! ఆయన కలిసి గడుపుదామన్నారు. మేము కొంచెం గ్యాపిస్తున్నాం"

"ఇంతకీ మీరు నానుంచి ఏమాసిస్తున్నారు? " అడిగాడు జయశంకర్.

"మావారి సంగతి మీకు తెలుసు. మంచానికి కట్టుబడరు. ఒంట్లో కాస్త ఫరవాలేదనిపిస్తే చాలు- ఆరోగ్యాన్ని అశ్రద్ధ చేస్తారు. అదీ ఇలా అలా అని కాకుండా చాలా అశ్రద్ధ చేస్తారు"

"అందుకేగా అవసరం లేకపోయినా బెడ్‌రెస్ట్ గురించి నొక్కించాను"

"అది చాలదు డాక్టర్! మరి కాస్త భయముండాలి. మీరాయన్ని నిదానంగా, ప్రశాతంగా ఉండమనాలి. మిన్ను విరిగి మీద పడ్డా చలించొద్దనాలి. ఆయన గుండె బలహీనంగా ఉందనీ- ఏమాత్రం కలవరపడినా ప్రాణహాని అని గట్టిగా చెప్పాలి"

"మంచి ఉద్దేశంతో చెప్పిన అబద్ధం మందుకంటే బాగా పనిచేస్తుంది. మీవారి విషయంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధ మెచ్చుకోతగ్గది. భూపతిగారు చాలా అదృష్టవంతులు"

"అదృష్టం నాది డాక్టర్! నా అదృష్టం ఆయన్ని కాపాడుకోవడంలోనే ఉంది. అందుకు నా ప్రాణాలైనా ఇస్తాను" అంది.

"నా దగ్గరంటే అన్నారు కానీ- ఈ మాట భూపతిగారి దగ్గర మాత్రం అనకండి. ఆయనకు మీరు ప్రాణం. ఆ మాట నాతో చాలాసార్లన్నారు" అన్నాడు జయశంకర్.

"అది నాకూ తెలుసు" అని డాక్టర్ వద్ద సెలవు తీసుకుందామె. వెళ్లిపోతున్న ఆమెనే చూస్తూ, "ఏ గ్రేట్ లేడీ మారీడ్ టు ఏ క్రూయల్ మాన్" అని నిట్టూర్చాడు జయశంకర్.

★ ★ ★

మహాభారతంలో కర్ణుడి పాత్ర విశిష్టం. తండ్రి సూర్యుడు. తల్లి రాజకుమారి. ఇద్దరూ కాదంటే ఎక్కడో పెరిగి అసమాన ప్రతిభ చూపినా కులం పేరిట ఎన్నో అవమానాలెదుర్కొన్నాడు. అనాథలకి కర్ణుడు గొప్ప ప్రేరణ. అతడి పేరున వెలసిన అనాథాశ్రమం 'కర్ణకుటీరం'- ఊళ్లోని అటువంటి సంస్థలకు తలమానికమై ఉత్తమ నిర్వహణకి మారుపేరు అనిపించుకుంది. సమాజ సేవలో ఎక్కువ గడిపే మాలతి- ఊళ్లో కొన్ని అనాథ శరణాలయాలకి తరుచుగా వెళుతూంటుంది. అక్కడి పిల్లల్ని పేరు పేరునా పిలిచి అప్యాయంగా పలకరిస్తుంది. వారి కష్టసుఖాలడిగి తెలుసుకుంటుంది. అలా ఆమె ఆ రోజు కర్ణకుటీరానికి వెళ్లింది.

ఐతే కర్ణకుటీరానికి ఆరోజు ప్రత్యేకం.

ఆశ్రమంలో బాగా చదివే విద్యార్థుల్లో ఆరుగుర్ని ఎంపికచేసి ఒక సేవాసంస్థ ద్వారా ఐఐటీ కోచింగ్ ఇప్పించింది మాలతి. ఎప్పటికప్పుడు వాళ్ల ప్రోగ్రెస్ తెలుసుకుంటూ ప్రోత్సహించేదామె. ఇప్పుడు వారిలో ప్రసాద్ అనే కుర్రాడికి ఎంట్రెన్స్ పరీక్షల్లో రాంక్ వచ్చింది. ఆ రోజు మాలతి ప్రసాద్‌ని అభినందిచాలని వచ్చింది.

"నాదేముంది మేడమ్! అంతా మీ చలవ" అన్నాడు ప్రసాద్.

"నా చలవే ఐతే ఆరుగురికి రాంక్స్ రావాలి. నీ ఒక్కడికే రావడం నీ గొప్పతనం" అంది మాలతి.

"థాంక్యూ మేడమ్" అన్నాడు ప్రసాద్.

"యూ ఆర్ వెల్‌కమ్. మనమీరోజు బయటకెళ్లి పార్టీ చేసుకుందాం, ఓకే" అంది మాలతి.

"పార్టీ వద్దు మేడమ్- మీరు తీర్చగలనంటే నాదో చిన్న కోరిక" అన్నాడు ప్రసాద్.

"అడుగు"

# తపాలాబిళ్లతో అద్భుతం




అమెరికన్ ప్రభుత్వం 'ఫండ్ ది క్యూర్' కార్యక్రమంలో భాగంగా ఓ ప్రత్యేక తపాలా బిళ్లని విడుదల చేసింది. దాని ధర నలభై సెంట్లు. కాని అమెరికాలో కవర్‌కి అతికించాల్సింది ముప్పైమూడు సెంట్ల స్టాంపే. దీన్ని కొని అతికిస్తే అదనంగా లభించే ఏడు సెంట్ల ఆదాయం 'బ్రెస్ట్ కేన్సర్ రీసెర్చ్'కి వెచ్చిస్తారు. మొత్తం స్టాంపులని అమ్మితే లభించేది 1.6 కోట్ల డాలర్లు.

ఈ స్టాంపుని అప్పటి ఫస్ట్ లేడీ హిల్లరీ క్లింటన్, వైట్ హౌస్‌లో జులై 29, 1998న విడుదల చేసింది. అమెరికన్ చరిత్రలో ఇలా తపాలా బిళ్ళల అమ్మకం ద్వారా విరాళాలని సేకరించడం ఇదే తొలిసారి.

అమెరికాలో 26 లక్షల స్త్రీలు ఈ వ్యాధి బారిన పడుతున్నారు. సగటున 12 నిముషాలకి ఒకరిలో ఈ వ్యాధి కనుగొనబడుతుంది. అప్పటి ప్రెసిడెంట్ క్లింటన్ కుటుంబంలోని స్త్రీలకి కూడా ఈ వ్యాధి వుంది. అందుకని క్లింటన్ ప్రత్యేక శ్రద్ధతో 'ఫండ్ ది క్యూర్'ని ఆరంభించాడు.




1998లో, 1999లో, 2000లో కలిసి 21 కోట్ల 50 లక్షల నలభై సెంట్ల స్టాంపులు అమ్ముడయ్యాయి. దాన్ని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ కేన్సర్ రీసర్చ్‌కి పంపారు. వీటిని అమెరికాలో ఎవరైనా, ఎప్పుడైనా కొనచ్చు. మన ప్రభుత్వం కూడా ఇలాంటి పథకాన్ని అమలు చేస్తే భారత ప్రజలు ఏ మంచి కారణానికైనా డబ్బు ఇవ్వడానికి ముందుకు వస్తారు.

"నాకు మిమ్మల్ని 'అమ్మా' అని పిలవాలనుంది" అన్నాడు ప్రసాద్.

అతడి కోరిక కొత్తది కాదు. ప్రసాద్ మాలతిల అనుబంధం ఈనాటిది కాదు. చిన్నప్పట్నించీ అతడికామె వద్ద చనువెక్కువ. పిల్లలందర్నీ కన్న బిడ్డల్లా చూసే ఆమెకి ప్రసాద్ ప్రత్యేకం. నాలుగేళ్ల వయసున్నప్పుడు ప్రసాద్ మొదటిసారి ఆమెని 'అమ్మా' అని పిలిస్తే మాలతి వెంటనే తప్పని చెప్పింది. ప్రసాద్‌కి అర్థంకాక సంజాయిషీ అడిగితే పెద్దయ్యేక చెబుతానంది. ఎవరినో ఒకర్ని అమ్మా అని పిలవాలనుందంటే, అక్కడున్న ఆయాల్లో ఒకర్నెన్నుకోమంది.

"ఏమో- వాళ్లని పిలవాలనిపించదు- మిమ్మల్నే పిలవాలనిపిస్తుంది"

"సారీ- నువ్వు నన్నలా పిలవకూడదు" అంది మాలతి.

అక్కడున్న ఓ ఆయా ఈ సంభాషణ వింటోంది. ప్రసాద్ పక్కకెళ్లాక, "ఆ అబ్బాయి సరదా పడుతున్నాడు. అమ్మలా ఆదరిస్తున్నారు కదా- అతడు మిమ్మల్ని అమ్మా అని పిలిచినంత మాత్రాన మీకేం నష్టమమ్మా- ఒప్పుకోవాల్సింది" అంది.

"చూడు, నువ్వు ఆ అబ్బాయికి రోజూ స్నానం చేయిస్తున్నావు. తల దువ్వుతున్నావు. వేళ ప్రకారం పాలు, ఆహారం ఇస్తున్నావు. ఇవన్నీ అమ్మ చేసే పనులు. అవునా?" అంది మాలతి.

"అవును..."

"అయినా ఆ అబ్బాయి నిన్ను అమ్మా అనడం లేదు. ఔనా?"

"అవును..."

"కన్నతల్లి చేసే పనులన్నీ చేస్తున్నా.. నిన్ను ఆ అబ్బాయి అమ్మా అనలేదు. కానీ నన్నంటానంటున్నాడు. అంటే ఆ అబ్బాయికి అమ్మంటే తెలియదు. అప్పుడప్పుడొచ్చి ముద్దులాడే డబ్బున్న మనిషే అమ్మ

## కొత్తగాలి...

**గతి**
**తప్పిస్తుంది సారా**
**వదిలేద్దాం మనసారా**

– సాంధ్యశ్రీ చంద్రిక,
ఖుర్దారోడ్, ఒరిస్సా

నుకుంటున్నాడు. ఆ ఊహకి పాలు పోసి పెంచడం నాకిష్టం లేదు" అంది మాలతి.

"ఎంత లోతుగా ఆలోచించారమ్మా" అంది ఆయా చాటంత మొహం చేసుకుని.

"అమ్మంటే ఆకర్షణ కాదు, సంరక్షణ. అమ్మంటే పిలుపు కాదు, అదో గొప్ప అనుభూతి. అతడికి అమ్మంటే నేను కాదు, నువ్వు. అతడు నీలో అమ్మని చూడాలని నా ఉద్దేశం" అంది మాలతి.

అప్పుడు ఆయాకి మాలతి అంటే మరింత ఆరాధనాభావం కలిగింది.

కొన్నేళ్ళపాటు ప్రసాద్ మాలతి పిలిస్తే వచ్చేవాడు. సన్నిహితంగా మసిలేవాడు. కానీ అమ్మా అంటాననేవాడు కాదు. అతడికి పదేళ్ళ వయసప్పుడో రోజు మాలతిని, "అంతా నన్ను నువ్విప్పుడు చిన్నవాడివి కాదు, పెద్దవాడివయ్యావంటున్నారు. నిజమేనా? " అనడిగాడు.

"నేను కూడా అంటే కానీ నువ్వు పెద్దవాడివి కాదా? " అంది మాలతి నవ్వుతూ.

"నేను పెద్దయ్యేక మిమ్మల్ని అమ్మా అని ఎందుకు పిలవకూడదో చెబుతానన్నారు. ఇంకా మీరు చెప్పకపోతే అనుమానమొచ్చింది" అన్నాడు ప్రసాద్.

అతడు చెప్పేదాకా ఆమెకా విషయమే గుర్తులేదు. ప్రసాద్ ఆ విషయాన్నంతలా గుర్తుంచుకున్నందుకాశ్చర్యపడి, "నీకు నన్ను అమ్మా అని పిలవాలని అంత మనసెందుకు? " అంది.

"అమ్మలున్న పిల్లల్ని చూసినప్పుడల్లా-నాకూ ఓ అమ్మ కావాలనిపిస్తుంది"

అది కోరికలా లేదు. ఆక్రోశంలా ఉంది. మాలతి చలించిపోయింది. అతడికి బదులివ్వలేక కాసేపు ఆలోచించి ప్రసాద్‌నీ మరో ముగ్గురు కుర్రాళ్లనీ కారెక్కించుకుని ఊళ్ళోని కొన్ని ముఖ్య ప్రదేశాలు చూపించింది. మంచి హోటల్లో టిఫిన్ పెట్టించింది. తర్వాత వాళ్ళంతా ఓ పార్కు-కెళ్ళారు. పార్కులో విరబూసిన పూలమొక్కలున్నాయి. పిల్లలాడుకునే సదుపాయాలున్నాయి. రంగులు చిందే జలయంత్రాలున్నాయి. పిల్లలక్కడ కాసేపు ఆడుకున్నాక- ఓ జలయంత్రం ముందు కూర్చున్నారు. మాలతి వాళ్ళతో ఆరోజు చూసిన విశేషాల గురించి ముచ్చటిస్తుండగా ఓ పదేళ్ళ కుర్రాడొచ్చాడు.

మాసిన నిక్కరు. చిరుగుల చొక్కా. చింపిరి జుత్తు. లోతుకు పోయిన కళ్ళు.

"దయగల తల్లివి. ఒక్క రూపాయి దానం చెయ్యమ్మా!" అనడిగాడు వాడు మాలతిని.

మాలతి వాణ్ణి నిశితంగా చూస్తూ, "నువ్వెందుకు అడుక్కుంటున్నావు? " అనడిగింది.

"ఆకలి" అన్నాడు వాడు.

"ఆకలైతే అమ్మ అన్నం పెట్టదా? " అడిగిందామె.

"అమ్మ కూడా అడుక్కుంటుంది"

"నీ వయసు పిల్లలెందరో బడికెళ్ళి చదువుకుంటున్నారు. మరి నీకు చదువుకోవాలని లేదా? "

"నాకు చదువుకోవాలనే ఉంది. కానీ నన్నెవరు చదివిస్తారు? " వాడి గొంతులో నిర్లిప్తత.

"నేను చదివిస్తాను, చదువుకుంటావా? "

ప్రసాద్‌తో సహా ఆమెతో వచ్చిన నలుగురు కుర్రాళ్ళూ- ఆ బిచ్చగాడు ఆశ్చర్యపడతాడనో, సంతోషిస్తాడనో అనుకున్నారు.

కానీ వాడి కళ్ళనిండా చెప్పలేనంత భయం.

"ఊc చెప్పు- నేను చదివిస్తాను, చదువుకుంటావా? " రెట్టించింది మాలతి. ఆ అబ్బాయి పెదవి విప్పలేదు కానీ తల అడ్డంగా ఊపితే, "ఎందుకని? " అంది.

"అమ్మొప్పుకోదు" అని అక్కణ్ణించి కదలబోయాడు వాడు.

"ఎందుకంత తొందర? కాసేపాగి నేనడిగినవాటికి జవాబులు చెప్పు" అంది మాలతి.

"మీకు జవాబులు చెబుతూ కూర్చుంటే అవతల నాకొచ్చే డబ్బులు పోతాయి" తన వృత్తికి అనువుకాని విసుగును దాచుకుందుకు ప్రయత్నిస్తూ అన్నాడు వాడు.

మాలతి తన వాలెట్లోంచీ పది రూపాయల నోటొకటి తీసి చేత్తో పట్టుకుని, "నువ్వు కాసేపిక్కడ కూర్చుని నేనడిగినవాటికి జవాబులు చెబుతానంటే ఈ నోటు నీదే" అంది.

కుర్రాడి కళ్ళు ముందు మెరిసాయి. తర్వాత పెద్దవయ్యాయి. వాడు చటుక్కున వాళ్ళకి కాస్త దూరంగా అక్కడే కూర్చుని, "అడగండి" అన్నాడు.

మాలతి అడుగుతోంది. వాడు చెబుతున్నాడు. వాడు చెప్పే విశేషాలు ప్రసాద్ బృందానికి కొత్తవి. ఆ బిచ్చగాడికి తల్లి, తండ్రి, చెల్లి ఉన్నారు. అంతా అడుక్కుంటారు. వాళ్ళకి ఇల్లు లేదు. చెట్టుకింద వండుకుంటారు, పడుకుంటారు. పిల్లలు అడుక్కు తెచ్చిన డబ్బు తలిదండ్రులకివ్వాలి. డబ్బులు తక్కువైతే అమ్మ అన్నం పెట్టదు. నాన్న తన్నులు తినిపిస్తాడు.

అలాంటి పిల్లలకి ఉత్తినే చదువుచెప్పే బడులున్నాయి. కానీ అమ్మా, నాన్నా- వాణ్ణీ, వాడి చెల్లినీ బడికి పంపరు. వాళ్ళకీ- పిల్లలు తెచ్చిన డబ్బులు, బట్టలు, వంటకాలు కావాలి.

"అమ్మతో నేను మాట్లాడతాను. అడుక్కోవడం మాని నాతో వస్తావా? " అడిగింది మాలతి. నీళ్ళు నమిలాడు వాడు. "చిన్నప్పుడైతే ఏమోకానీ ఇప్పుడు నాకీ జీవితం అలవాటైపోయిందమ్మా" అన్నాడు ఇబ్బందిగా.

"చిన్నప్పుడంటున్నావు. ఇంకా నీకు పట్టుమని పదేళ్ళు లేవు. అప్పుడే పెద్దాణ్ణైపోయాననుకుంటున్నావా? " అంది మాలతి.

వాడేమీ మాట్లాడకపోగా, "ఐనా ఈ జీవితం అలవాటైపోతే నువ్వెప్పటికీ చిన్నవాడిగానే ఉంటావు. పెద్దవాడివి కావాలంటే నువ్వు నాతో రావాలి. వస్తావా మరి!" అంది.

"అమ్మొప్పుకోదు" అన్నాడు వాడు.

అప్పుడు వాడి గొంతులో భయంకంటే నమ్మకమే ఎక్కువుండడం గుర్తించిన మాలతి, "నేనొప్పిస్తాను" అంది తనూ గొంతులో నమ్మకాన్ని ధ్వనింపజేస్తూ.

"మీ దగ్గర ఒప్పుకుంటుంది. తర్వాత పంపుతానని చెప్పి మిమ్మల్ని పంపేస్తుంది. మీరెళ్ళాక చావగొడుతుంది."

వాడు చెప్పేది అబద్ధం కాదని మాలతికి తెలుసు.

ఒకసారి ఆమె బిచ్చమెత్తుకునే కుర్రాడొకణ్ణి బలవంతంగా అనాథ శరణాలయంలో జేర్పించింది. తాముండగా వాడు అనాథ ఎలాగవుతాడంటూ వాడి తల్లిదండ్రులు పెద్ద గొడవ చేసారు. పేదలని స్వేచ్ఛగా బతకనివ్వడంలేదని ఓ రాజకీయ పక్షం అల్లరి చేసింది. అనాథ శరణాలయం పేరిట మరో తరహా వ్యాపారం మొదలైందని ఓ పత్రిక ఘోష పెట్టింది. బిచ్చగాళ్ళు అన్ని వర్గాలకంటే హీనంగా, మృగాల్లా జీవిస్తున్నారు. వాళ్ళు నిత్యం మన కళ్లెదుట తిరిగే దళితులు. అగ్రవర్ణాల అణచివేతకు గురైన వారిని మాత్రమే

దళితులుగా గుర్తించడం వల్లనేమో మన సమాజంలో వీరి గురించి స్పందించేవారు తక్కువ.

మాలతి పది రూపాయల నోటు అంది వ్వగానే ఆ కుర్రాడు తుర్రుమని పారిపో యాడు.

అప్పుడు మాలతి జరిగినదంతా ఆశ్చ ర్యంగా చూస్తున్న ప్రసాద్ బృందంవైపు తిరిగి, "ఇప్పుడు మీకు అమ్మంటే తెలి సిందా? " అంది.

ప్రసాద్ తల అడ్డంగా ఊపాడు. మిగతా వాళ్లు ప్రశ్నార్థకంగా చూశారు.

"అమ్మలంతా మీరు పుస్తకాల్లో చదువు కున్న అమ్మల్లా ఉండరు. ఇప్పుడెళ్లిన బిచ్చ గాడి అమ్మకంటే మీ ఆయాలు ఎన్నో రెట్లు మెరుగని గ్రహించారా? "

నలుగురూ అవునన్నట్లు తలలూపారు.

"ఇప్పుడు మీకింకో కొత్త చోటు చూపి స్తాను" అంటూ అక్కణ్ణించి లేచిందామె.

వాళ్లు, మాలతి ఓ మురికివాడకి వెళ్లారు. అక్కడామె వాళ్లకి బురద గుంటల్లో పందులు, కుక్కల మధ్య వాటితో సమంగా ఆడుకుంటున్న కొందరు పిల్లల్ని చూపించింది.

"వీళ్లకి అమ్మలున్నారు. వాళ్లు పిల్లల్ని ముద్దు చేస్తారు. ఉన్నంతలో తిండి పెడ తారు. కానీ ఎక్కువసేపు ఇలా గాలికొదిలే స్తారు. అదేమంటే డబ్బు లేదంటారు. నాలాంటివాళ్లు డబ్బిస్తే ఒక్క రోజులో హుళక్కి చేస్తారే తప్ప పిల్లల బాగుకి వాడరు. పోనీ నాతో పంపించమంటే- కన్నబిడ్డలు కంటిముందు లేకపోతే బతక లేమంటారు. వాళ్ల దగ్గరే ఉంటే ఎలా ఉన్నారో చూసారు కదా!" అంది మాలతి.

ఆ నలుగురికీ ఒళ్లు గగుర్పొడిచింది.

"ఈ రోజుకు చూసిందీ, తెలుసుకున్నదీ చాలు. కారెక్కండి" అందామె.

నలుగురూ మౌనంగా కారెక్కారు. ఆమె, "మీరు అమ్మలు లేక ఇలా ఉంటే, వాళ్లు అమ్మలుండి అలా ఉన్నారు. మన దేశంలో అమ్మలంతా అమ్మలు కారు" అంది.

అప్పుడు ప్రసాద్ పెదవి మెదిపాడు. "మేమెంత అదృష్టవంతులమో ఇప్పుడు నాకర్థమైంది. కానీ మీరింకా నా ప్రశ్నకి జవాబివ్వలేదు" అన్నాడు.

మాలతి అప్పటికి నవ్వి ఊరుకుంది.

కర్ణకుటీరం చేరుకున్నాక మిగతా ముగ్గుర్నీ లోపలకు పంపేసి ప్రసాద్ నొక్కణ్ణీ ఆగమందామె. ఆమె తన ప్రశ్నకు ఏకాంతంలో జవాబిస్తుందని ప్రసాద్ గ్రహించాడు.

"ఇంకా నీకు నన్నే అమ్మా అని పిలవా లనుందా? ఎందుకు? " అడిగిందామె.

"ఏమో తెలియదు. మీరీవేళ నాకు కొందరు అమ్మల్ని చూపించారు. కానీ ఇది వరలో నేనూ కొందరు అమ్మల్ని చూసాను. వాళ్ళు, ఇప్పుడు మీరు చూపిం చిన అమ్మల్లా లేరు."

"అంటే? "

ప్రసాద్ చెప్పాడు.

అతడికి నాలుగేళ్ళప్పుడు శరణాలయా నికో కుటుంబం వచ్చింది. వాళ్లతోపాటొ చ్చిన ఒకామె తన మూడేళ్ల బాబుతో- తమది వేరే ప్రపంచమన్నట్లు మసలు తూంటే చూడ్డానికెంతో గొప్పగా ఉంది. ఆమె ఆ బాబుతో అంత ప్రత్యేకంగా ఎందుకాడుకుంటోందని అడిగితే- ఆమె అతడికి అమ్మ అని చెప్పిందో ఆయా. అమ్మంటే ఎవరని అడిగితే, ఏం చెప్పాలో తెలియక అమ్మంటే అమ్మే అంది ఆయా. అప్పుడు ప్రసాద్‌కి మాలతి అమ్మలా స్ఫురించింది.

ఆ తర్వాత కూడా ప్రసాద్ తను చదివే స్కూళ్లలో చాలామంది మంచి అమ్మల్ని చూసాడు. అలాంటి అమ్మ కావాలన్న

## కొత్తగాలి...

**చెట్టు**
**నీ దహనం కోసం**
**తను**
**సహనంతో కాలుతుంది**

— లోగిశం లక్ష్మీనాయుడు, సింహాచలం

కోరిక అతడిలో నానాటికీ బలపడుతోంది.

"అమ్మంటే నాన్నకి భార్య. నేను మీ నాన్న భార్యని కాను. కాబట్టి నువ్వు నన్ను అమ్మా అనడం తప్పు" అంది మాలతి.

ప్రసాద్ నవ్వి, "మీరు అమ్మా అననిస్తే మీరే నాకు అమ్మ, అంతే. మీ భర్త నాకు నాన్న. మిమ్మల్ని అమ్మా అంటాను. మీ భర్తని నాన్నా అంటాను" అన్నాడు.

"నువ్వు పిలుస్తానంటే సరిపోతుందా? నా భర్త నిన్ను నాన్నా అని పిలవనివ్వడు" అంది మాలతి.

"నేనాయన కాళ్లు పట్టుకుని బ్రతిమాలి ఒప్పిస్తాను" నమ్మకంగా అన్నాడు ప్రసాద్.

"నో" అంది మాలతి కంగారుగా.

ప్రసాద్ తెల్లబోయి, "నేనేమైనా తప్పుగా మాట్లాడేనా? " అన్నాడు.

మాలతి తమాయించుకుని, "ఇందులో నీ తప్పేం లేదు కానీ, నీకు నా భర్త గురించి తెలియదు. నువ్వొకసారి ఆయన్ను కలుసుకుంటే ఆ తర్వాత- నేను కూడా నిన్ను కలుసుకోలేనేమో" అంది.

అలా ఎందుకవుతుందో ప్రసాద్‌కి అర్థం కాలేదు. కానీ ఆమెని కూడా మిస్సయ్యే ప్రమాదముందని తెలియగానే బెదిరిపోయి, "సారీ- ఈ విషయమై మిమ్మల్నిక విసిగించను" అన్నాడు.

అతడి గొంతులో ధ్వనించిన నిరుత్సాహానికి రవంత చలించిన మాలతి, "నన్ను అమ్మా అని పిలవద్దనడానికిదే కాదు, వేరే కారణముంది" అంది.

"ఏమిటది? " అన్నాడు ప్రసాద్ నిరాసక్తంగా.

"నాకు నీ తల్లి తెలుసు"

ఉలిక్కిపడ్డాడు ప్రసాద్. "మా అమ్మ మీకు తెలుసా? అంటే నాకు అమ్మ ఉందా? " అన్నాడు.

అతడి గొంతులో అపనమ్మకాన్ని గుర్తించిన మాలతి, "నీకు అమ్మ ఉంది. ఆ అమ్మ నాకు తెలుసు. అమ్మేకాదు, నాకు మీ నాన్న కూడా తెలుసు" అంది నెమ్మదిగా.

షాక్ తిన్న ప్రసాద్‌కి కాసేపు నోట మాట రాలేదు. తర్వాత నెమ్మదిగా, "ఐతే మరి నేను అనాథ శరణాలయంలో ఎందుకున్నాను? " అన్నాడు.

"సమయం వచ్చినప్పుడు చెబుతాను"

"నాకిప్పుడే తెలుసుకోవాలనుంది" ప్రసాద్‌లో ఆత్రుత.

మాలతి సానునయంగా చెప్పింది అప్పుడే కుదరదని. కానీ అతడు మరీ మరీ నొక్కిస్తే చిరాకొచ్చి,

"ఇప్పుడే తెలుసుకుంటే అడుక్కుతింటావ్!" అందామె కటువుగా.

"అంటే మా అమ్మా నాన్నా అడుక్కుతినేవాళ్ళా? " నీరసంగా అడిగాడు ప్రసాద్.

"కాదు. కానీ వాళ్ళు శాపగ్రస్తులు. తమ శాపం నీకంటకూడదని నిన్నిక్కడ రహస్యంగా పెంచుతున్నారు. నువ్వు కూడా ఆ రహస్యాన్ని మరికొంతకాలం కాపాడాలి"

"ఎంత కాలం? "

"ముందు నువ్వు బాగా చదువుకో. గొప్పవాడివికా"

"గొప్పవాణ్ణంటే ఏం కావాలి? "

"ఇప్పటి నిర్వచనం ప్రకారం విద్యార్థులకి గొప్పతనమంటే- ఐఐటీల్లోనో, మెడిసిన్లోనో సీటు సంపాదించుకోవడం" అంది మాలతి.

ప్రసాద్ వెంటనే, "ఇంజనీరవ్వాలని నా

కోరిక. ఐఐటీ సీటుకి ప్రయత్నిస్తే" అన్నాడు ఉత్సాహంగా.

"ఆల్ ది బెస్ట్. నీకే కోచింగ్ కావాలన్నా ఖర్చు నాది. మరి ఐఐటీ సీటు నీది కావాలి"

"చూస్తారుగా- మీరన్నది సాధించి తీర తాను. మరి నేను ఐఐటీలో సీటు తెచ్చు కుంటే మీరు నాకు మా అమ్మెవరో చెబు తారు కదూ? " అతడి ఆశలో అనుమానం మిళితమైంది.

"ష్యూర్, అమ్మే కాదు, నాన్నెవరో కూడా చెబుతాను" అంది మాలతి.

"మేడమ్ మీరు నిజమే చెబుతున్నారు కదూ? " ప్రసాద్ గొంతులో ఇంకా అపన మ్మకం పోలేదు.

"నేను అబద్ధం చెప్పను" అంది మాలతి.

ప్రసాద్ కాసేపు ఆమెనే చూస్తూ ఉండి పోయాడు. తర్వాత నెమ్మదిగా, "మీర బద్ధం చెబుతున్నారని నేనంటే ఏమీ అను కోరుకదూ? " అన్నాడు.

అతడలాగంటాడని ఊహించలేదామె. ఐనా ఎందుకో కోపం రాలేదామెకు, "నేన బద్ధం చెబుతున్నానని నీకెందుకనిపిం చిందో చెప్పు, ఏమైనా అనుకున్నదీ లేనిదీ అప్పుడు చెబుతాను" అంది.

"మా క్లాసులో అంతా- నాది ఈడుకు మించిన తెలివి- అంటారు. ఐతే నేనిప్పుడు చెప్పేదానికి పెద్ద తెలివి అవసరం లేదు..." ఆగాడు ప్రసాద్.

"ఉపోద్ఘాతం వద్దు. చెప్పదల్చుకున్నది సూటిగా చెప్పు" అంది మాలతి.

"మనిషికి లక్ష్యముంటే తప్ప ఏమీ సాధించలేడని ఎన్నో కథల్లో చదివాను. నేనేదో సాధించాలని మీ కోరిక. నాకు లక్ష్యమేర్పడాలన్న మంచి ఉద్దేశ్యంతో- మీరబద్ధం చెప్పారని నా అనుమానం. నా అమ్మ, నాన్న గురించి మీకు తెలుసంటే ఎందుకో నాకు నమ్మశక్యంగా లేదు. ఐనా మీ మాట నిజమని నమ్మి నా శాయశ

## కొత్తగాలి...

**బ్రతికుండగా**
**శ్రద్ధ లేదు!**
**చచ్చేక మాత్రం బోల్డంత శ్రాద్ధం!**

**-జి.వి.యస్.ప్రియంవద,**
**అరసవిల్లి**

క్తులా శ్రమిస్తాను. మీరన్న లక్ష్యం సాధి స్తాను" అన్నాడు ప్రసాద్.

మాలతి అతణ్ణి ముచ్చటగా చూసి, "ఇలా ఆలోచించడానికి తెలివి కావాలి. కానీ నాకు నీ అమ్మా, నాన్నా తెలుసు. నేను అబద్ధం చెప్పనని నమ్మాలి"

"మీరు చెప్పింది అబద్ధమా, నిజమా అని ఆలోచించను. ఐఐటీలో నాకు సీటొ స్తుంది. అప్పుడు మీరు నాకు నా తల్లిదం డ్రులెవరో చెప్పాలి. చెప్పరూ- అనుమతి అడక్కుండానే నేను మిమ్మల్ని అమ్మా అని పిలుస్తాను" అన్నాడు ప్రసాద్.

మాలతి ఆశ్చర్యంగా అతణ్ణి చూసింది. "నన్ను అమ్మా అనడం సంగతటుంచు. నీకు నీ తల్లిదండ్రుల గురించి తెలియక పోతే నిరాశపడవా" అంది.

"పడను. నేను మిమ్మల్ని అమ్మగా ఊహించుకుంటున్నాను. ఇంకెవరో అమ్మంటే నిరాశపడతానేమో కూడా. మీరు నన్ను అమ్మా అని పిలవనిస్తే నేన సలు నాన్న గురించి పట్టించుకోను"

మాలతి మరింత ఆశ్చర్యంగా అతడి వంక చూసింది. పరీక్షగా చూస్తే అతడిలో సీతారామయ్య కనిపించాడామెకు. ఆమెకు తెలుసు. అతడు సీతారామయ్య కొడుకు. జీన్సు ద్వారా ప్రేమ కూడా తండ్రి నుంచి కొడుక్కి వచ్చేస్తుందా? నాలుగేళ్ళప్పుడే అతడు తనను అమ్మా అని పిలవాలనుకు న్నాడు- తను వాడికి అమ్మ కాదని తెలి

సినా! తను శరణాలయంలో చేస్తున్న సేవలకు ప్రభావితుడయ్యాడా అనుకుంటే- అలాంటివాళ్లలో ప్రథమస్థానం అనసూయది! సేవాధర్మంలో అనసూయకి ఇప్పటికి కొన్ని అవార్డులు కూడా వచ్చాయి. కొందరామెకి రాజకీయపోకడలున్నాయని, పబ్లిసిటీకి ప్రాకులాడుతుందనీ అంటారు. అయితేనేం- అందుకవసరమైన మూల్యాన్నీ సేవల రూపంలో చెల్లించిందామె.

అయితే ప్రసాద్‌నిక్కడ చేర్చడానికి తనే ఏర్పాటు చేసింది. ఎవరికీ అనుమానం రాకుండా, ఎక్కడా తన పేరు బయటకు రాకుండా ఎన్నో జాగ్రత్తలు తీసుకుంది. అసలిలాంటి అవసరమొస్తుందని ముందుగా ఊహించే తను సంఘసేవిక అయింది. అంతా అనుకున్నట్లు జరిగింది.

సీతారామయ్యది చాలా గొప్ప వ్యక్తిత్వం. సమాజ వికాసానికి ప్రయోజనకరమైన ఆ వ్యక్తిత్వం తన కారణంగా అణగద్రొక్కబడింది. తన కోసం అణగారిపోయింది. ఆ వ్యక్తిత్వానికి వారసులుండాలి. ఆ వారసుల వ్యక్తిత్వ వికాసానికి ఏ అడ్డంకీ ఉండకూడదు.

సీతారామయ్యా వారసులకి జన్మనివ్వాల్సిన వ్యక్తి తను. ఆ అవకాశం పోయింది. ఇప్పుడిక అతడి వారసుల్ని కాపాడాల్సిన బాధ్యత తనది. అందులో సమాజహితం కూడా ఉంది.

ప్రసాద్‌ని చిన్నప్పటినుంచి గమనిస్తోందామె. అతణ్ణి తాకితే ఆమెలో కన్నబిడ్డను తాకిన మధురానుభూతి. అతడు నవ్వితే పరవశం. దుఃఖిస్తే కలవరం. ఎందుకిలా అవుతోందని ఎన్నోసార్లు ఆలోచించిందామె. సమాధానం స్ఫురించినా లోతుగా విశ్లేషించాలంటే మనసుకి భయం.

ఆమెకి తెలుసు. తన మనసులో సీతారామయ్య పట్ల ప్రేమ చావదు. మనసే ముఖ్యమైతే సీతారామయ్యే ఆమె భర్త. మాతృత్వానికి తనువే ముఖ్యం కాదనుకుంటే ప్రసాద్ ఆమె మానసపుత్రుడు. కర్ణకుటీరంలో ప్రసాద్ పట్ల తనకున్న ప్రత్యేకాకర్షణ- ఇతరులు గుర్తించకూడదనే ఆమె అతడితోపాటు మరికొందరు పిల్లల్ని కలిపేది. ఇతర అనాథ శరణాలయాలకీ వెళ్ళిగడిపేది. మాలతి అంతలా జాగ్రత్తపడినా- అమెకి తనంటే ఉన్న ప్రత్యేకాకర్షణ స్పర్శలోనే పసిగట్టగలిగాడు ప్రసాద్. తన ఆకర్షణనతడు దాచుకోలేకపోతే- శరణాలయ నిర్వాహకులు, ఉద్యోగులు, ఆశ్రమవాసులు పసిగట్టేసారు. ప్రసాద్ ఏదో ఒక రోజున ఆమెకి విసుగు తెప్పించి తన భవిష్యత్తు పాడు చేసుకోడు కదా అని వాళ్ళనుమానించేవారు. అలా రోజులు, నెలలు, ఏళ్ళు గడిచాయి. మాలతి చేత తన తల్లిదండ్రుల పేర్లైనా చెప్పించాలి. లేదా తనే ఆమెను అమ్మా అనాలి. అదీ పదేళ్ళ వయసులో ప్రసాద్ తనకంటూ ఏర్పరచుకున్న లక్ష్యం. ఆ లక్ష్యసాధనకు ఐఐటీ సీటు గురిగా పెట్టుకున్నాడు. కష్టపడి చదివాడు. కృషిలో ఏకలవ్యుడి ఏకాగ్రతను పాటించాడు. అర్జునుడికి లభించిన సదుపాయాలందితే సద్వినియోగం చేసుకున్నాడు. అనుకున్నది సాధించాడు. ఐఐటీలో సీటు సాధించడం సామాన్య విశేషం కాదు. అయినా మాలతి పార్టీ చేసుకుందామంటే వద్దని ఆమెని అమ్మా అని పిలిచేందుకు అనుమతి అడిగాడు. తన తల్లిదండ్రుల గురించి అడక్కపోవడాన్ని బట్టి అతడి అసలు లక్ష్యం మాలతేనని స్పష్టమవుతోంది.

ఇప్పుడు ప్రసాద్‌కి- అతడి తల్లిదండ్రుల వివరాలు చెప్పాలా లేక తనని అమ్మా అనేందుకు అనుమతించాలా? ఏంచేసినా ప్రసాద్‌కిచ్చిన మాట తప్పకూడదు.

ప్రసాద్‌కి తల్లిదండ్రుల గురించి చెబితే-

భూపతి నుంచి ప్రమాదం. అతడిచేత అమ్మా అని పిలిపించుకునేందుకు సీతారామయ్య పవిత్రప్రేమ పట్ల అపరాధభావం.

మాలతికి ఆశ్చర్యంగా ఉంటుంది. తొలి రాత్రి భర్త కాంక్షతో తన చేయి పట్టుకుంటే- అతడి స్థానంలో సీతారామయ్యనూహించుకోలేదామె. ఆ తర్వాత భార్యాభర్తలకి సహజమైన దాంపత్య జీవితాన్నీ, సాన్నిహిత్యాన్ని పెంచే శృంగారాన్నీ అలాగే కొనసాగించింది. ఆమెకి భూపతి ఇల్లు తన ఇల్లు. భూపతి తనవాడు. పిల్లలు తమ పిల్లలు. అయితే అదంతా శారీరకబంధం.

సీతారామయ్య విషయానికొస్తే- ఆమెకతడి సాన్నిహిత్యం సంతోషం. అతడి ప్రగతి సంతోషం. అతడి కష్టాలు, నష్టాలు, దుఃఖాలు, అవమానాలు- అన్నీ బాధాకరం. కానీ సీతారామయ్య తన భర్త ప్రత్యర్థి కావడంతో ఆలోచనల్లో అతడి స్థానాన్ని స్తబ్దత నింపింది. తీగ లాగితే డొంకంతా కదిలినట్లు ఆ స్తబ్దతని తాకితే ఏమవుతుందోనని ఆమె భయం. ప్రసాద్ తనని అమ్మా అంటే తన ఆలోచనల్లోని స్తబ్దత తొలగిపోతుందని భయమామెకు.

ప్రసాద్‌ని మానసపుత్రుడిగా భావిస్తున్నానని మాలతికి తెలియదు. తెలిస్తే అది మానసిక వ్యభిచారమనుకుంటుంది. తను కళంకిత అనుకుంటుంది.

ప్రతి వ్యక్తికీ తను నమ్మే పవిత్రతకి తనదంటూ ఓ నిర్వచనముంటుంది. దానికో తర్కముంటుంది. మానసిక సంఘర్షణలో- ఆ తర్కానికి అనుకూలంగా తీర్పునిస్తుంది వ్యక్తిత్వం. క్రిందికోర్టు తీర్పు హైకోర్టు కొట్టేసినట్లు ఒక వ్యక్తి నిర్వచనాన్నీ, తర్కాన్నీ

మరో వ్యక్తి ఆమోదించకపోవచ్చు. అయితే ఇలాంటి విషయాల్లో ఏ వ్యక్తికా వ్యక్తే సుప్రీంకోర్టు.

మాలతి మనసు పవిత్రతతోపాటు, ప్రసాద్ పట్ల బాధ్యతనీ గుర్తించింది. అదామె సందిగ్ధాన్ని పెంచుతోంది. అది చాలదన్నట్లు ప్రసాద్ తన తల్లిదండ్రుల వివరాలడక్కుండా, నేరుగా ఆమెని అమ్మా అనేందుకు అనుమతి అడిగాడు. అతడికేం చెప్పినా అది పూర్తిగా తన నిర్ణయమవుతుంది.

"మేడమ్! మీరు మాట్లాడ్డంలేదు" అన్నాడు ప్రసాద్ అసహనంగా. గురి తప్పలేదని తెలిసినా లక్ష్యం చేరడానికి ఆలస్యమైతే అసహనం సహజమేకదా!

మాలతి అతణ్ణి తీక్షణంగా చూసింది. ముఖభావాలు చదివి నిట్టూర్చింది. నెమ్మదిగా, "నువ్వు నీ తల్లిదండ్రుల వివరాలడక్కుండా ఇంకేవో అడిగావేమిటా అని ఆలోచిస్తున్నాను" అంది.

"ఆ వివరాలు మీకు తెలియవని నా ఆశ. మిమ్మల్ని అమ్మా అనాలని నా కోరిక" అన్నాడు.

అమ్మా అన్నప్పుడు- పరోక్షంగా ఆ అనుభూతిని పొందాలనో ఏమో- ఒక్క క్షణం విరామమిచ్చాడు ప్రసాద్. ఆ పిలుపులోని అనుభూతి ఆమె మనసునీ తాకితే- "సీతారామయ్యకు పుట్టిన ప్రసాద్‌కి అతడి తండ్రి ప్రియురాలినైన తనని అమ్మా అని పిలవాలనిపిస్తోంది. ఇదంతా ఆ జీన్సు ప్రభావమేనా? " అనుకుంది.

మాలతి సందిగ్ధంలోంచి బయటపడింది. గొంతు సవరించుకుని చుట్టూ చూసింది. తన గొంతు నుంచి బయటకొచ్చే స్వరాలని భూపతికి చేరవేసే చారులు కనుచూపు మేరలో లేరని రూఢి చేసుకుంది. అయినా భయంగానే పెదవి విప్పింది.

ప్రసాద్ చెవులు రిక్కించాడు.




**బెడ్** రెస్టుతో భూపతికి క్షణమొక యుగంలా ఉంది. మధ్యలో ఓసారి టైం చూసుకుని, "పదకొండూ నలభై- అంటే సీతారామయ్య చావుకింకా ఇరవై నిముషాలుంది" అనుకున్నాడు. "అనవసరంగా శ్రీరామ్‌కి ఎక్కువ టైమిచ్చానేమో" అని మనసులో తన్ను తనే విసుక్కుని పక్కనున్న ఓ వేదాంతగ్రంథం తీసాడు. చేతి వేళ్ళు పేజీలు తిప్పుతుంటే మనసులో సీతారామయ్య గురించిన ఆలోచనలు తిరుగుతున్నాయి. కానీ ఓ పేజీ దగ్గిర కళ్ళు మనసుని జయించాయి.

ఆ పేజీలో తన కోసమే అన్నట్లు ఓ వ్యాసం. అందులో రావణుడికీ, రాముడికీ తారతమ్యాల చర్చ. రావణాసురుడు సకల భోగాలూ అనుభవించాడు. త్రిలోకాలనూ ఏలాడు. వృద్ధాప్యంలో శ్రీ మహావిష్ణువు అవతారమైన శ్రీరాముడి చేతిలో మరణించి పుణ్యం కూడా సంపాదించుకున్నాడు.

మరి శ్రీరాముడు జీవితంలో సుఖమన్నది ఎరుగడు. ముక్కుపచ్చలారని వయసులో విశ్వామిత్రుడితో అడవికి వెళ్ళి రాక్షసులతో పోరాడేడు. ఇలా పెళ్ళి కాగానే అలా పద్నాలుగేళ్ళ వనవాసానికి వెళ్ళాడు. అక్కడ భార్యని రావణుడెత్తుకుపోతే కొన్నాళ్ళు భోరున ఏడ్చాడు. ఆ తర్వాత

కోతుల సాయంతో భార్య జాడ తెలుసుకుని నానా అవస్థలూపడి సాగరతీరాన్ని చేరి వారధి కట్టి లంకనిచేరి భీకర సమరంలో రావణుడిని చంపాడు. అగ్నిపరీక్షకి నిలబడ్డ సీతని- సామాన్యుడి మాటమీద- అడవికి పంపి భార్యావియోగ దుఃఖంతోనే రాజ్యపాలన చేసాడు.

ఇద్దరిలో ఎవరి జీవితం కోరుకోదగ్గదన డానికా పుస్తకంలో వివరణ గొప్పగా ఉంది.

'పాపీ చిరాయుః' ఎందుకంటే దుష్టుడికి మరణం కాదు, జీవితమే శిక్ష. విజయాల మత్తు, వైభోగాల నిషా, శత్రువుల శాపనార్థాలు- వాటినే సుఖజీవితమనుకునే మూర్ఖత్వం దుష్టులది. అలా అత్యున్నత స్థాయికి చేరుకుని మృత్యువును కూడా జయించానన్న నమ్మకంతో జీవితంపై మమకారం పెంచుకున్న దుష్టుడికి ఏ వయసులోనైనా చావొక పెద్దశాపం. రావణుడనుభవించిన వైభవాలన్నీ- వాటికి దూరమవుతున్నందుకు చివరి రోజుల్లో అతడు పొందిన మనోక్లేశం ముందు దిగదుడుపు. అదే శ్రీరాముడైతే క్రమంగా ఒక్కో సమస్యనే సాధిస్తూ మెట్టుమీద మెట్టెక్కి అత్యున్నతస్థానం చేరుకుని యుగయుగాలకు ఆదర్శపాత్రుడయ్యాడు.

రావణుడెక్కింది మునగచెట్టు. రాముడు చేరుకున్నది మహాపర్వత శిఖరాగ్రం.

ఇదే సీతారామయ్యకి అన్వయిస్తే-

సీతారామయ్యకి బ్రతుకంటే ఆశ. ఏదో సాధిస్తానని నమ్మకం. ఆ ఆశ, నమ్మకంతోనే అన్ని కష్టాలూ ఓర్చుకుంటున్నాడు. డబ్బు లేకున్నా సుఖసంతోషాలకి లోటులేని జీవితమతడిది. కానీ ఇప్పుడతడు ఒక్కడు కాదు. భార్యా పిల్లలు. ఆ పిల్లలకు పిల్లలు. తన పిల్లల్లో, మనుమలో ఏదో సాధిస్తే చూడాలన్న ఆశ తప్పక అతడిలో ఉంటుంది. ఆ ఆశ నెరవేరకుండా చావొచ్చి మీద పడితే?

అటు రావణుడి బ్రతుకూ కాదు, ఇటు రాముడి బ్రతుకూ కాదు. ఏం సాధించినట్లు?

రాముడు-రావణుడు, పాండవులు-దుర్యోధనుడు. అన్నీ ఒకలాంటి కథలే. దుష్టుడికి జీవితాంతం సుఖాలు, పుట్టెడు దుఃఖంతో జీవితాంతం. శిష్టుడికి జీవితాంతం కష్టాలు. పేరు ప్రతిష్ఠలతో జీవితాంతం. మరి సీతారామయ్యకి జీవితాంతం కష్టాలు. అప్పుడు జీవితాంతం..

భూపతికి ఆగకుండా నవ్వొస్తే- ఆ నవ్వాపడానికన్నట్లు ఫోన్ మోగింది. నవ్వాపే ప్రయత్నంలో ఆగకుండా దగ్గొచ్చి- ఫోన్ తియ్యడం జాప్యమైంది. తీసేలోగా ఫోన్ మోగడం ఆగింది.

భూపతి టైం చూసుకుంటే పన్నెండూ అయిదు. "శ్రీరామ్‌కి టైమంటే టైమే కానీ సహనం తక్కువ. ఫోన్ తీసేదాకా ఆగొచ్చుగా" అని మనసులో విసుక్కున్నాడాయన.

అంతలోనే ఆయనలో అనుమానం- సీతారామయ్య చావు ముహూర్తం సరిగ్గా పన్నెండు గంటలకి.

ఎలా చంపినా మనిషి చావుకి నాలుగైదు నిముషాలు పడుతుంది. ఆ తర్వాత అన్నీ నిర్ధారించుకుందుకు కనీసం మరో ఐదు నిమిషాలు. అంటే శ్రీరామ్ పన్నెండూ పదిలోగా ఫోన్ చెయ్యలేడు.

మరి తనకి ఫోన్ పన్నెండూ ఐదుకే వచ్చింది.

భూపతి ఆలోచనల్ని నిర్ధారిస్తూ- పన్నెండూ పదికి ఫోన్ మోగింది. ఆయన ఫోన్ తీయగానే పరిచితమైన గొంతు హలో అంది. "ఊఁ శుభవార్త చెప్పు" అన్నాడాయన.

"శుభవార్తే సర్! సీతారామయ్య చచ్చిపోయాడు"

## కొత్తగాలి...



**అతడు ఒకప్పుడు**
**గుండెలు తీసిన బంటు**
**పాపం ఈ మధ్యే**
**గుండె ఆపరేషన్ చేయించుకున్నాడు**

– కె.వి.సుబ్బారావు,
మురళీనగర్, విశాఖపట్టణం

"వెరీ గుడ్! నాన్చకుండా రపీమని చెప్పావ్. యూ ఆర్ గ్రేట్" భూపతి గొంతులో ఉత్సాహం.

"సర్..." నసిగాడు శ్రీరామ్.

"ఊఁ ఏం చెప్పాలన్నా చెప్పు. ఏం కావాలన్నా అడుగు. సంకోచించకు. నేనిప్పుడు చాలా మంచి మూడ్‌లో ఉన్నాను" ప్రోత్సహించాడు భూపతి.

"సీతారామయ్య చావుకి మీరన్న ముహూర్తం కుదర్లేదు సర్"

"ఫరవాలేదులే. ఓ ఐదు నిమిషాలటూ ఇటూ- అంతేగా!" నవ్వేడాయన.

"ఐదు నిమిషాలు కాదు సర్! పందొమ్మిది గంటలు..." నసిగాడు శ్రీరామ్.

"పందొమ్మిది గంటలేమిటీ- నేను నీకు చెప్పి గంటైనా కాలేదు కదా!" అర్థంకాక అడిగేడాయన.

"నాదేముంది సార్? అంతా మీ సంకల్ప బలం. ఈ రోజనుకున్న పని నిన్నే అయిపోయింది"

"ఇప్పుడేకదా నాన్చలేదని మెచ్చుకుంటే, ఇదేమిటీ, ఎప్పుడూ లేని డొంకతిరుగుడొచ్చింది! అసలేం జరిగిందో చెప్పు" భూపతి గొంతులో అసహనం.

"సీతారామయ్య నిన్న సాయంత్రం ఐదు గంటలకే చచ్చిపోయాడు సార్! శవమింకా ఇంట్లోనే ఉంది. ఇంకో గంటలో దహనమట. ఆ ఇల్లంతా ఒకటే ఏడుపులు సార్!"

భూపతి మ్రాన్పడిపోయాడు.

సీతారామయ్య చచ్చిపోయాడు. అదీ తను చంపకుండా!

అతడి జీవితాన్ని తను శాసించాలనుకున్నాడు, శాసించాడు. చావునీ శాసించాలనుకున్నాడు, కానీ శాసించలేకపోయాడు. ఎలాగైతేనేం? సీతారామయ్య చావడమే తనక్కావాల్సింది. కానీ...

మరి సీతారామయ్య నిన్నే చచ్చిపోతే... ఈ రోజు సీతారామయ్యనంటూ ఫోన్ చేసిందెవరు?

"సార్. మీరు మాట్లాడ్డంలేదు" అవతల శ్రీరామ్ ఆదుర్దా.

"ఫోన్ పెట్టేయ్" అంటూ గద్దించిన భూపతి- శ్రీరామ్ బదులిచ్చేలోగా తనే ఫోన్ పెట్టేశాడు.

అప్పుడాయన వంట్లో సన్నగా వణుకు. ముఖానికి చెమటలు, అతి కష్టం మీద చేతులు స్వాధీనం చేసుకుని కాలింగ్‌బెల్ మీట నొక్కితే- పనివాడొచ్చాడు. ఆయన్ని చూసి కంగారుపడ్డాడు. ఆయన సైగలర్థం చేసుకుని, ఉడుకులాం గుడ్డతో ముఖం తుడిచాడు. ఆయన వెళ్ళమనగానే వెళ్ళాడు.

భూపతికి వళ్ళు కాస్త తేలికనిపించినా మనసు ఎన్నో ప్రశ్నలతో బరువెక్కుతోంది.

ఫోన్లో సీతారామయ్య "నన్ను చంపడం నీకు అసాధ్యం" అంటే- చచ్చిన పామునింకా ఏం చంపుతావని అతడి భావమనుకున్నాడే తప్ప- అతడు చచ్చి దెయ్యమయ్యుండొచ్చని తోచలేదప్పుడు.

ఇప్పుడు ఉన్నట్లుండి, "నిన్ను చంపడం నాకు సాధ్యం" అన్న సీతారామయ్య మాటకి విలువొచ్చింది. ఆ మాట చెవుల్లో గింగురుమంటూ భయపెడుతోంది.

భయం... ప్రాణభయం... అంత వరకూ ఎరుగని ప్రాణభయం... గుండె

నొప్పి వచ్చినప్పుడు కూడా కలుగని ప్రాణ భయం...

బ్రతికుండగా మహా మహావాళ్ళు కూడా భయపెట్టలేని భూపతిని ఇప్పుడు సీతారామయ్యనే ఓ అనామకుడు చచ్చి భయపెడుతున్నాడు.

దెయ్యాలున్నాయా? వాటికి పగలుంటాయా? పగ తీర్చుకునే శక్తి కూడా వాటికుంటుందా?

ధైర్యమున్న మనిషి దెయ్యాల్ని నమ్మడు. మంచి మనసున్న మనిషిని దెయ్యాలు భయపెట్టలేవు. ఆ విషయం భూపతికి తెలుసు. కానీ తన మనసు మంచిదని ఆయనే అనుకోడు. ఇప్పుడాయన ధైర్యమూ అంతంత మాత్రం. అందుకేనేమో సీతారామయ్య దెయ్యం ఆయన్ని భయపెడుతోంది. ఆ సమయంలో ఆ గదిలో అడుగుపెట్టాడు డాక్టర్ జయశంకర్. ఆయన్ని చూడగానే కొండంత ధైర్యం వచ్చింది భూపతికి. జయశంకర్ ఆయనతో, "టైము పన్నెండూ ఇరవై ఐదు. ఒక్క పావుగంట మాత్రం ఇక్కడుంటాను" అన్నాడు.

"నేను మిమ్మల్ని పిలిచినట్లు లేదు...? " ప్రశ్నార్థకంగా అడిగాడు భూపతి.

"మీరు నన్ను పిలవలేదు. మీకు మోరల్ సపోర్ట్ ఇవ్వాలని నా అంతట నేనే వచ్చాను"

"నాకు మోరల్ సపోర్టా? నాకేమైందీ- బాగానే ఉన్నాను కదా" భూపతి మేకపోతు గాంభీర్యం.

జయశంకర్ ఆయన చేయిపట్టి నాడి చూస్తే, "బీపీ చెక్ చేస్తారా? " అడిగాడు భూపతి.

"లేదు కానీ, మీలో ఏదో ఆందోళన. మీ కళ్లలో భయం. మీ నాడిలో వేగం. ఈ సమస్య శారీరకం కాదు. మానసికం. ఏమయిందో కాస్త చెబుతారా? " అన్నాడు.

"డాక్టర్! నేనొకటడుగుతాను. తేలిగ్గా కొట్టేయక జవాబు చెప్పాలి" అన్నాడు భూపతి వెంటనే.

"మీరేమడిగినా నేను సీరియస్‌గానే తీసుకుంటాను. అడగండి" అన్నాడు జయశంకర్.

"దెయ్యాలున్నాయా? "

జయశంకర్ ఆశ్చర్యంగా, "ఇప్పుడు మీకు దెయ్యాలతో ఏంపని? " అన్నాడు.

"ప్లీజ్.. సీరియస్‌గా అడుగుతున్నాను. దెయ్యాలున్నాయా... చెప్పండి డాక్టర్!"

"నేను దెయ్యాల్నెన్నడూ చూడలేదు. కానీ దెయ్యాల్ని చూసి భయపడిన పేషెంట్స్ కొందరు నాకు తెలుసు" సాలోచనగా అన్నాడు జయశంకర్.

"మరి మీ పేషెంట్స్ దెయ్యాలని చూసినట్లు మీరు నమ్మేరా? "

"చూసామన్నది వాళ్లు. దానికి నా నమ్మకంతో పనేముంది? నా అభిప్రాయంలో దెయ్యాలు లేవు. మనిషి భ్రమ"

"మరి అలాంటప్పుడవి కొందరికెలా కనిపిస్తాయి? "

"ఉంటే అందరికీ కనిపించాలి. కొందరికే కనిపిస్తాయనే వాటిని నేను భ్రమ అంటాను"

"పోనీ. ఆ కొందరికీ ఎందుకు కనిపిస్తాయట? "

భూపతి గొంతులో కలవరాన్ని పసిగట్టిన జయశంకర్ ఆయనవంక అనుమానంగా చూస్తూ, "భూపతిగారు! మీరుకానీ దెయ్యాన్ని చూసారా? దెయ్యాల్ని చూసిన కొందర్ని పరీక్షించానుగా! మిమ్మల్ని చూస్తే వాళ్లు గుర్తుకొచ్చారు" అన్నాడు.

"అంటే నేను దెయ్యాన్ని చూసానంటారా? " అడిగాడాయన ఆత్రుతగా.

"దెయ్యాలు లేవు కాబట్టి మీరు దెయ్యాన్ని చూసుండరు. ఐతే మీకు దెయ్యాన్ని చూసిన అనుభూతి కలిగుం

## కొత్తగాలి...

**పరభాషపై ద్వేషం**
**తమిళ తంబికి**
**తన భాషే విషం**
**తెలుగు తమ్మికి!**

– పానుగోటి నరసింహారావు,
దుబ్బాక, నల్లగొండ జిల్లా

డొచ్చు. అదెలాగంటే....” అని గొంతు సవరించుకున్నాడు జయశంకర్.

“ప్రతి మనిషికీ కొన్ని విచిత్రమైన కోరికలుంటాయి. కొందరవి తీర్చుకోగలరు. కొందరికి మాత్రం అవి తీర్చుకుందుకు... సంప్రదాయమో, పరిస్థితులో అడ్డొస్తాయి. అప్పుడవి క్రమంగా బలపడి మనసును వేధిస్తాయి. రిలీఫ్ కోసం మనిషి భ్రమల లోకానికి వెడతాడు. అక్కడ దెయ్యాల్ని చూస్తాడు. అది దెయ్యాలకి సంబంధించిన ఆహ్లాదకరమైన అనుభవం.

అక్రమాలు, అన్యాయాలు, పాపాలు- నిస్సంకోచంగా చేస్తున్నట్లు కనపడే మనిషి మనసులో కూడా ఏ మూలో ఎంతోకొంత పాపభీతి ఉంటుంది. ఆ పాపభీతి నుంచి పుట్టిన భ్రమలు దెయ్యాల్ని చూపిస్తాయి. ఆ దెయ్యాలు భయపెడతాయి. అది దెయ్యాలకు సంబంధించిన భయానక అనుభవం.

అనుభవం ఆహ్లాదకరమైనా, భయానకమైనా... దానికి దెయ్యాలతో సంబంధముందని గుర్తించినప్పుడు ఒళ్లు జలదరిస్తుంది. మనసులో భయం పుడుతుంది. నేనిప్పుడు మీలో ఆ చిహ్నాలు చూసాను” అన్నాడు జయశంకర్ తన వివరణ పూర్తయ్యేక.

“మీరు భ్రమ అన్నారే- అదెలాగుంటుంది? ” అడిగాడు భూపతి.

“దెయ్యంపనే అనిపించే సంఘటనలు జరుగుతాయి. కొందరిది కేవలం మానసికానుభూతి”

“ఫోన్లు రావచ్చా? ” అడిగాడు భూపతి.

“ఆ రావచ్చు? ” అన్నాడు జయశంకర్ ప్రశ్నార్థకంగా చూస్తూ.

సీతారామయ్య ఫోన్ గురించి ఆయనకి చెప్పొచ్చా అని కాసేపు తటపటాయించేడు భూపతి.

“మీరేదో అడగాలనుకుంటున్నారు...? ” అడిగాడు జయశంకర్.

“నాకు దెయ్యం కనపడలేదు. కానీ కనపడుతుందని భయం. ఆ భయమెలా పోతుంది? ”

దెయ్యాలు కూడా భయపడే వ్యక్తిత్వం భూపతిదని తెలిసినా ఆ మాట పైకనలేక “చాలా సింపుల్. మీరే దెయ్యాన్ని భయపెట్టండి” అన్నాడు జయశంకర్.

“భ్రమ లేకపోతే దెయ్యమే కనపడదన్నారు. భ్రమలోనే దెయ్యం కనిపిస్తుందన్నారు. అలాంటప్పుడు భ్రమలో ఉండగా దెయ్యాన్ని భయపెట్టడం సాధ్యమా? ” అడిగాడు భూపతి.

“నాకు తెలుసు. ప్రమాదకరమైన మనిషిని కూడా మీరు భయపెట్టగలరని! దెయ్యాన్ని మనిషిలా ట్రీట్ చెయ్యండి. అప్పుడా దెయ్యం మీకే భయపడుతుంది”

“భయపడకపోతే? ”

జయశంకర్ నవ్వాడు, “మార్పుతో మనిషిని భయపెట్టొచ్చు. క్రూరత్వం పనిచేయకపోతే మంచితనంతో ప్రయత్నించాలి. అలవాటులేని మంచితనం మనిషిలో అనుమానం పుట్టిస్తుంది. అదే భయంగా మారుతుంది”

“మీరు చెప్పింది వినడానికి బాగుంది. ఆచరణలో సాధ్యమా? ”

“సాధ్యమని నమ్మండి. తొందరగా కోలుకుని ఎప్పటిలా ఉక్కుమనిషి అవుతారు. మనసు ప్రశాంతంగా ఉంచుకోండి. నిదా

నంగా ఆలోచిస్తూ మిన్నువిరిగి మీదపడ్డా చలించకండి. లేకుంటే మీ మనసే ఓ దెయ్యమై ప్రాణప్రమాదం తెస్తుంది"

అప్పటికే పావుగంటయిపోయింది. జయశంకర్ వెళ్ళిపోయాడు. మళ్ళీ భూపతిలో ఆలోచనలు... డాక్టరు చెప్పిందాన్ని బట్టి.. పాపభీతి తనలో భయాన్ని సృష్టించింది. ఆ భయంలోంచీ వినిపించింది సీతారామయ్య ఫోన్! అంటే సీతారామయ్య చనిపోయాడు కానీ దెయ్యంగా మారలేదు. మారినా తనకీ ఫోన్ మాత్రం చెయ్యలేదు.

తను విన్నాననుకుంటున్న ఫోను.. ఏ మగతలోనో, కునుకులోనో కన్న కలలోనిదే తప్ప నిజం కాదు.

"చనిపోయిన సీతారామయ్య నాకు ఫోన్ చెయ్యడం- అది విని నేను భయపడ్డం. చాలా బాగుంది"

నవ్వుకున్నాడు భూపతి. అది సత్యమన్నట్లు అప్పుడే గంట కొట్టింది గోడ గడియారం. నవ్వుతూనే భూపతి అటు చూస్తే టైము ఒంటిగంటయింది. సరిగ్గా అప్పుడే పక్కన ఫోన్ మోగింది.

భూపతి ఉలిక్కిపడ్డాడు. సీతారామయ్య కానీ కాదు కదా!

మళ్ళీ భూపతిలో వణుకు. ఫోనలా మోగుతూనే ఉంది.

ఫోన్ తియ్యాలంటే భూపతికి భయం.

అసలు ఫోన్ మోగుతోందా- లేక ఒంటిగంట కాగానే ఫోన్ మోగినట్లు తను భ్రమపడుతున్నాడా?

అది భ్రమో, నిజమో- మోగిమోగి ఫోన్ ఆగిపోయింది. ఆ తర్వాత మళ్ళీ మోగింది.

భూపతి ఫోన్ తియ్యకుండా ఆలోచనలో పడ్డాడు. బెడ్ రెస్ట్ మొదలైనప్పట్నించీ సెల్ దగ్గరుంచుకోవడం లేదు. అత్యవసర పరిస్థితుల్లో ఉపయోగిస్తుందని లాండ్ ఫోన్ పక్కనుంచుకున్నాడు. దాని నంబరు ఇంట్లో వాళ్ళకి తప్ప ఇంకెవరికీ తెలియదు. డిస్టర్బ్ చేయడమెందుకని ఇంట్లో వాళ్ళు తనకి ఫోన్లు చెయ్యడంలేదు.

ఈ రోజొచ్చిన ఫోన్స్‌లో ఒకటి రాంగ్ నంబరు. ఒకటి శ్రీరామ్. మిగతావన్నీ సీతారామయ్య. అది తన భ్రమ అంటారు డాక్టర్. మరిప్పుడు రింగౌతున్నది...?

శ్రీరామ్ ఇందాకా కాలర్ ఐడెంటిటీ చూసి చేసాడు తప్ప అతడికీ నంబరు తెలియదు. ఇప్పుడు తెలిసినా- తన ఫోన్‌కి రెస్పాండవుతాడే తప్ప తనకి తానుగా ఫోన్ చెయ్యడు.

ఫోన్ ఇంకా రింగవుతూనే ఉంటే చప్పున తీసి, "హలో" అన్నాడు భూపతి.

"నేనే భూపతీ! ఇందాకా ఫోనెత్తలేదేం? "

భయపడ్డంతా అయింది. అది సీతారామయ్య ఫోనే!

"ఏయ్! ఎవర్నువ్వు? " అన్నాడు భూపతి తెచ్చిపెట్టుకున్న కోపంతో.

"మళ్ళీ మళ్ళీ చెప్పాలా- నేను సీతారామయ్యని" విసుక్కుంది అవతలి గొంతు.

"నువ్వు సీతారామయ్యవి కాదు. సీతారామయ్య చచ్చిపోయాడు"

"బతికున్నానని నేను మాత్రం అన్నానా? " తాపీగా అంది అవతలి గొంతు. నిశ్చేష్టుడైన భూపతి వింటుండగా, "బ్రతికుండగా నిన్ను చంపగల ధైర్యం నాకెక్కడిది? నా ప్రాణం పోయాక- నీ ప్రాణం కూడా తియ్యకుంటే నా ఆత్మకి శాంతెక్కడిది? నేను నిన్న సాయంత్రం ఐదింటికి మరణించాను. అప్పుడే నిర్ణయించాను- నీ ఆయువు మరో ఇరవై నాలుగు గంటలు మాత్రమేనని"

"వేళాకోళం ఆపు. ఇప్పుడే నువ్వెవరివో తెలుసుకుని నీ అంతు చూస్తాను" జయశంకర్ సలహాను గుర్తు చేసుకుని అన్నాడు భూపతి.

"ఎలా తెలుసుకుంటావ్? ఓహో- కాలర్ ఐడెంటిటీ చూసా? ఆ పప్పులేం ఉడకవు. నేను మాట్లాడుతున్నది నీ సెల్ నుంచే" నవ్వింది గొంతు.

తెల్లబోయిన భూపతి, "నా సెల్ నీకెలా వచ్చిందీ? " అన్నాడు.

"ఇందాకట్నించి అదే చెబుతున్నా. నేనిప్పుడు నీలా మనిషిని కాను. నాకిప్పుడు అసాధ్యమన్నదే లేదు. ఇంకా అనుమానముంటే తోచిన ఓ నంబరు చెప్పు. ఆ నంబర్నించే మాట్లాడతాను"



భూపతికి నోట మాట రాలేదు.

"హలో భూపతీ! నోరు చచ్చుబడిపోయిందేం? తోచిన నంబరు ఏదో ఒకటి చెప్పు. అది ఢిల్లీలో ప్రధానమంత్రిదైనా సరే- అక్కణ్ణించి ఫోన్ చేసి నా శక్తి నిరూపించుకుంటాను"

"ఏ నంబరు చెప్పి ఏం లాభం? ఇప్పుడు నా దగ్గరున్న ఫోన్‌కి కాలర్ ఐడెంటిటీ లేదు"

"పోనీ- ఇంకేమైనా టెస్టు... నీకు తోచిన టెస్టు చేసుకో..."

అది సీతారామయ్య సవాలా- లేక అతడి దెయ్యం తనతో మాట్లాడుతోందన్న భ్రమనుంచి బయట పడేయడానికి తన మనసు కొత్త ఉపాయాన్ని సూచించిందా?

భూపతి ఆలోచనలో పడ్డాడు. తను మాలతిని ప్రేమించేదాక తనూ, సీతారామయ్యా చాలా క్లోజ్‌గా ఉండేవారు. అప్పట్లో తమ ఇద్దరికే తెలిసిన రహస్యాలు కొన్ని ఉన్నాయి.

"నీకు సుభద్ర ఆంటీ గుర్తుందా? " అడిగాడు భూపతి.

"సుభద్ర ఆంటీ అంటే- ఇంజనీరు



కూర్మారావుగారి భార్యే కదూ? "

"ఊc" అని ఉలిక్కిపడ్డాడు భూపతి. అంత కరెక్టుగా అంత ఠక్కున ఎలా చెప్పాడు?

"భలేవాడివే- నీచేత నన్ను 'తుస్సుమన్న అటకవీరుడ'నిపించిన ఆ ఆంటీనెలా మర్చిపోతాను? "

భూపతి గుండె వేగంగా కొట్టుకుంది. మనసు అంతకంటే వేగంగా గతంలోకి వెళ్ళింది.

★ ★ ★

ఒక ప్రైవేట్ బిల్డర్ దగ్గర ఇంజనీరుగా చెలామణీ అవుతున్న కూర్మారావుకి ముప్ఫైఏడో ఏట పెళ్ళాంపోతే- ఇరవై ఏళ్ళ సుభద్రను పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పెద్ద అందగత్తె కాకపోయినా- ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలనిపించే వయసు సొగసులతో ఆకర్షణీయంగా ఉంటుంది.

కూర్మారావు ఇంట్లో ఓ పోర్షన్‌లో ఓ టీచర్ అద్దెకుంటున్నాడు. ఎస్సెస్సీలో ఉండగా భూపతి, సీతారామయ్య- అప్పుడప్పుడు ఆయన వద్దకి డౌట్సు తీర్చుకుందుకు వెళ్ళేవారు.

ఒకరోజు సుభద్ర వాళ్ళిద్దర్నీ తన వాటాలోకి పిలిచి కాఫీ ఇచ్చి తన గురించి చెప్పింది. చిన్నప్పుడు క్లాసులో ఫస్టుట. ఆడపిల్లకి చదువెందుకని తనని చదివించలేదుట. చదువుకునే పిల్లలతో కబుర్లు సరదాట. వస్తూపోతూండమంటే- సరే ఆంటీ అన్నారు వాళ్ళు.

అలా మొదలైంది వాళ్ళ పరిచయం. తనింటికొచ్చినప్పుడల్లా ఆమె వాళ్ళకి తినడానికో తాగడానికో ఏదో ఒకటిచ్చేది. ఒక రోజున సీతారామయ్య మేస్టారితో మాట్లాడుతూండగా- భూపతి సుభద్ర వాటాలో కెళ్ళాడు. అతణ్ణి కూర్చోమని స్నానానికి లోపలకెళ్ళింది సుభద్ర.

సుభద్ర ఓసారి వాళ్ళతో, "మా ఆయన ఇంజనీరే కానీ మా ఇంటి తలుపులకి గడియలు పడవు. ఇల్లన్నా ఇల్లాలన్నా ఆయనకెంత శ్రద్ధో దీన్నిబట్టి తెలుసుకోవచ్చు. ఏదేమైనా ఇంట్లోకొచ్చేటప్పుడు గుమ్మం దగ్గిరాగి ఓ కేకెట్టండి. నేను రమ్మన్నాకే లోపలకి రండి" అని హెచ్చరించింది. భూపతికిప్పుడా విషయం గుర్తొచ్చి- మేస్టారి దగ్గరకెళ్ళాడు. మేస్టారితో మాట్లాడ్డం ముగించి సీరియస్‌గా ఏదో

## కొత్తగాలి...

**విశ్వమంతా**
**చైతన్యంలాగా**
**జీవితం నిండా**
**ప్రేమభావన!**

-జి.సనారా, సికింద్రాబాద్

లెక్క చేస్తున్న సీతారామయ్య భుజంతట్టి, "ఆంటీకి అర్జంటుగా అటకమీంచి ఏదో తీసి పెట్టాలిట. పిలుస్తోంది" అన్నాడు.

"నేనే ఎందుకు? నువ్వు తీసిపెట్టొచ్చుగా" అన్నాడు సీతారామయ్య విసుగ్గా.

"నా నడుం కాస్త నొప్పిగా ఉంది" అని భూపతి అక్కడే ఉండిపోయాడు.

సీతారామయ్య భూపతి మాటలు నమ్మి సంకోచించకుండా సుభద్ర ఇంటి లోపలి గదిలోకి వెడితే- ఆమె అప్పుడే స్నానం చేసొచ్చి బట్టలు తీసుకోబోతుంది. అతణ్ణి చూసి గతుక్కుమని చటుక్కున చీరందుకుని వళ్ళంతా కప్పుకుంది.

"సారీ ఆంటీ" అని వెనక్కి తిరిగాడు సీతారామయ్య.

"అక్కడే ఆగు- కానీ వెనక్కి తిరక్కు" అంది సుభద్ర.

సుభద్ర బట్టలు కట్టుకుని అతడి ఎదుటకొచ్చింది. సీతారామయ్య మొహమాటంతో తలెత్తలేదు.

"బుర్రొంచుకుంటే నువ్వెవరివో నాకెలా తెలుస్తుంది? " మందలిస్తున్నట్లు అందామె.

అతడు తలెత్తి చూస్తే ఆమె ముఖంలో కోపంలేదు. సరికదా నవ్వుతూ, "అరే, నువ్వు సీతారామయ్యవి. నీకిలాంటి బుద్ధులున్నాయని నాకు తెలియదు" అంది ముచ్చటగా.

"లేదాంటీ- అటకమీంచి ఏదో తియ్యాలన్నారని భూపతి చెబితే..." నీళ్లు నమిలాడతడు.

"వెనకటికెవడో నీలాంటివాడే- కొబ్బరి చెట్టెందుకెక్కావంటే దూడగడ్డికోసమన్నాట్ట" అని నవ్వి,

"ఏడీ భూపతి? ఎందుకలాగన్నాడో అడుగుతాను..." అంటూ గది గుమ్మం బయట తొంగిచూసి,

"భూపతి లేడు. నువ్వే పంపించేసి- ఏదో చేద్దామనే లోపలకొచ్చావ్. అవునా? " అంది.

ఈ అభియోగానికేం బదులివ్వాలో తెలియక మరింత సిగ్గుతో తలొంచుకున్నాడతడు.

సుభద్ర అతణ్ణి సమీపించి చేయి పట్టుకుని, "నేనంటే నీకిష్టమైతే నువ్వంటే నాకూ ఇష్టమే" అంది.

సీతారామయ్యకా స్పర్శ కొత్తగా ఏదోలా ఉంది. వెంటనే చేయి విడిపించుకోలేదు.

"మాట్లాడవేం? నేను నీకు నచ్చానా? " అడిగింది సుభద్ర.

అప్పటికి సీతారామయ్యకి విషయం అర్థమై ఒళ్ళంతా చల్లబడింది. "భూపతి వస్తాడేమో" అన్నాడు మృదువుగా ఆమె చేయి విడిపించుకుని.

"అదేగా నీ అభ్యంతరం? " అంటూ ఆమె మళ్ళీ అతడి చేయి పట్టుకునేదాకా అతడికి తన మాటలకింకో అర్థముందని స్ఫురించలేదు. "నా ఉద్దేశమది కాదాంటీ" అన్నాడు నెమ్మదిగా.

సుభద్ర నవ్వి, "నీ ఉద్దేశం నాకు తెలిసిందిలే. తప్పు నీ మీదుండకూడదని- నేనన్నాల్సిన మాటలు నువ్వంటున్నావు. సరేలే- నేనెలాగూ తెలివితక్కువదాన్ని, చదువుకోనిదాన్ని. తప్పు నామీదే ఉంచుకుంటాను. సరా? " అంది.

ఆమె చేతి పట్టు బిగుస్తుంటే- అనుభవం లేకపోయినా ఆమె ఆరాటాన్నర్థంచేసుకునే పరిజ్ఞానం అతడికుంది.

"ఆంటీ, మీరు పెద్దవారు" అన్నాడు. చేయి విడిపించుకోలేదు కానీ మర్యాదగా అక్కణ్ణించి బయటపడమని వివేకం హెచ్చరిస్తోంది.

"అంకుల్ నాకంటే పదిహేడేళ్ళు పెద్ద. నువ్వు నాకంటే ఐదేళ్ళు చిన్న. వయోభేదం మనదే తక్కువ" అంటూ ఆమె అతణ్ణి దగ్గరగా తీసుకుంది.

"ఆంటీ- ప్లీజ్... ఇది తప్పు..." విడిపించుకోబోయాడతడు.

"ఆంటీ కాదు- సుభద్రా అను..." ఆమె గొంతులో అతడెరుగని ఉద్రేకం...

సీతారామయ్య జాప్యం చెయ్యలేదు. బలమంతా ఉపయోగించి ఆమెని విడిపించుకుని అక్కణ్ణించి పరుగుతీసాడు. తర్వాత భూపతిని కలుసుకుని జరిగింది చెప్పి నిష్ఠూరమాడాడు.

తానొకటి తలిస్తే దైవమొకటి తల్చినందుకు మిత్రుడిమీద అసూయ పుట్టి, "అంటే ఈ రోజునుంచీ నీ పేరు సీతారామయ్య కాదు. ఆంటీ నిన్నిక తుస్సుమన్న అటకవీరుడని పిలుస్తుంది. నేనూ నిన్నలాగే పిలిచేదా? " అన్నాడు భూపతి వేళాకోళంగా.

"ప్లీజ్- ఈ విషయం ఇంతటితో మర్చిపో. లేకుంటే ఆంటీకి చెడ్డ పేరు" మందలించాడతడు.

"ఆంటీని మంచి చేసుకుంటా కానీ చెడ్డ పేరెందుకు తెస్తానూ? " అన్నాడు భూపతి.

"వయసుకి తగని ఆలోచనలు చెయ్యకు" హెచ్చరించాడు సీతారామయ్య.

"వయసుకి తగ్గ ఆలోచనలేమిటో నువ్వు కాదు, వయసే చెబుతుంది" అని నవ్వాడు భూపతి.

మర్నాడు ట్యూషన్‌లో సీతారామయ్యని మేస్టారి దగ్గర వదిలి తను సుభద్ర ఇంట్లో దూరాడు. ఆమె అతణ్ణి మామూలుగా పలకరిస్తే తను మాటలు కలిపి, "మనిద్దరం ఫ్రెండ్సుగా ఉందామా? " అనేంత చొరవ చేసాడు.

"ఆంటీ ఆంటీయే- ఫ్రెండెలాగవుతుంది? " ఈసడించిందామె.

"వరసకి ఆంటీవి కానీ నువ్వు నాకంటే ఎంత పెద్ద? ఇక్కడ కాబట్టి ఫ్రెండన్నాను కానీ ఇదే ఫారిన్లోనయితే ఈపాటికి నిన్ను నా గర్ల్‌ఫ్రెండ్‌గా చేసుకునుండేవాణ్ణి తెలుసా? " అన్నాడతడు.

సుభద్ర నవ్వుతూ, "ఏమిటీ- నీకీవేళ పైత్యం చేసినట్లుంది? " అంది.

ఆ నవ్వు చూసి చెయ్యి పట్టుకునేంత చొరవ చేస్తే- "నా గురించి నువ్వేమనుకుంటున్నావురా రాస్కెల్- నిప్పుని- జాగ్రత్త!" హూంకరించిందామె.

"నిప్పువైతే నిన్న సీతారామయ్య చెయ్యెందుకు పట్టుకున్నావుట? " భూపతిలో ఉక్రోషం.

"నిన్నటి సంగతి వదులు. ఇప్పుడు నేను నీ చెయ్యి పట్టుకున్నానా? " అందామె.

"లేదు"

"నేను ఎవరిచెయ్యైనా పట్టుకున్నప్పుడు నిప్పుని కాదు. ఎవరైనా నా చెయ్యి పట్టుకున్నప్పుడే నిప్పుని. నేనే కాదు. ఏ ఆడదైనా అంతే!" నిప్పుని నిర్వచించిందామె.

ఆమె ఆంతర్యం అర్థమైన భూపతి గుర్రుగా చూస్తూ, "నువ్వెలాంటి నిప్పువో- నీ మాటల్లోనే అందరికీ చెబుతాన్లే" అన్నాడు.

సుభద్ర అతణ్ణి సమీపించింది. చటుక్కున అతడి రెండుచెంపలూ ఎడాపెడా వాయించి, "ఎక్కడైనా నా గురించి పిచ్చిగా వాగావో- నేనే కాదు, ఊరంతా నీ చెంపలు పగలగొట్టేలా చేస్తాను" అంది గుడ్లురిమి చూస్తూ. అవాక్కైపోయిన అతణ్ణి నిరసనగా చూసి, "నా బ్రతుకు నా ఇష్టం. నీ ఇష్టం కాదు. వెళ్ళు. మళ్ళీ నీ మొహం నాకు చూపించకు" ఉరిమిందామె.

మర్నాడు భూపతి సీతారామయ్యను కలిసి- అసలు విషయం చెప్పకుండా సుభద్ర మంచిది కాదన్నాడు. అలాంటి ఆడవాళ్ళు సమాజానికే చీడపురుగుల న్నాడు. ఆమెకి బుద్ధి చెప్పడానికి ఉపాయం చెప్పమంటే, "ఆంటీ సమస్యే మిటో మనకు తెలియదు. కానీ ఇలాంటి వ్యవహారాల్లో మనమట్టుకు మనం నిప్పుల్లా ఉంటే సరిపోతుంది" అన్నాడు సీతారామయ్య.

"మనం నిప్పులమే కదా!" అన్నాడు భూపతి బింకంగా.

"నేను ఎవరి చెయ్యైనా పట్టుకున్నప్పుడు నిప్పుని కాదు. ఎవరైనా నా చెయ్యి పట్టు కున్నప్పుడే నిప్పుని. నేనే కాదు, నువ్వైనా అంతే!" నిప్పును నిర్వచించాడతను.

జరిగింది సీతారామయ్య చూసాడని భూపతి గ్రహించాడు. ఆ తర్వాత అతడు సుభద్రకి సారీ కూడా చెప్పాడని తెలిసి, "తప్పు ఆంటీదైతే నువ్వెందుకురా సారీ చెప్పడం? " అన్నాడు.

"అరిటాకు, ముల్లు అంటారు కానీ ఆడ వాళ్ళ విషయంలో మేక, తోడేలు సామ్యం గుర్తొస్తుంది నాకు. ముల్లుపడితే అరిటాకు చిరుగుతుందంతే! మేక తోడేలుతో ఆడినా, తోడేలు మేకతో ఆడినా మేక కది క్రూరమైన వేట. అన్ని విధాలా తామే నష్ట పోయే ఆడాళ్ళని- దేనికీ తప్పు పట్టా లనిపించదు నాకు. మగాడు తప్పు చెయ్యా కపోతే ఆడదానికి తప్పే ఉండదు కదురా"

సీతారామయ్య మాటలు భూపతికి స్త్రీల పట్ల సానుభూతిని కలిగించలేదు. కానీ పెళ్లైన ఆడది నిందవేస్తే తనింట్లోనే తలె త్తుకోవడం కష్టమని అర్థమై- జరిగిన విశే షాన్ని గోప్యంగా ఉంచాడు. ఐతే సీతారా మయ్యని తుస్సుమన్న అటకవీరుడనడం మానలేదు.

★ ★ ★

తుస్సుమన్న అటకవీరుడు ఈ కథ విన గానే భూపతి మెదడులో అయోమయం. మాలతిక్కూడా తెలియని రహస్యమది.

"ఇప్పుడైనా నమ్ముతావా- నేను సీతారా మయ్యనని"

"నమ్మను. నువ్వు సీతారామయ్యవు కాదు. వాడు చచ్చిపోయాడు" అన్నాడు భూపతి బింకంగా.

"అయ్యో- అది నువ్వు చెప్పాలా? చచ్చి పోయానని నేనూ చెబుతున్నానుగా? "

"నీకు ఆటగా ఉంది" ఉక్రోషంగా అన్నాడు భూపతి.

"ఆట నాది కాదు నీది. నేనూ, మాలతీ ఒకటయ్యామన్న ఆకాశరామన్న ఉత్తరాన్ని మాకు చూపించి అది మీ నాన్న కంటబ డితే ప్రమాదమన్నావ్. అది నటన అని తెలియక- నేనా ఉత్తరం మీ నాన్నకి చూపిస్తే ఆయన నిన్ను బలంగా సపోర్ట్ చేసి, నన్ను ఘోరంగా అవమానించాడు. అదంతా నీ ఆట కాదా? "

"ఊc" అన్నాడు భూపతి. అది ఊc కొట్టడం కాదు. అవతలి వ్యక్తి సీతారామ య్యేనని మళ్ళీ మళ్ళీ ధ్రువపడుతూంటే నోట మాటరాక మూలిగితే వచ్చిన శబ్దం- ఊc.

"ఇంకా- నేను మాలతి ఇంటికెడితే అన్న ఇంట్లో ఉందనడం, అన్న ఇంటికెడితే అమ్మానాన్నల దగ్గరుందనడం, నీతో వెడితే మాత్రం రెండు చోట్లా మాలతి దర్శనం- ఇది నీ ఆట కాదూ? " సందేహం లేదు. అతడు సీతారామయ్యే. కానీ చచ్చి పోయిన సీతారామయ్య ఫోనెలా చేస్తాడు? జయశంకర్ అదంతా తన భ్రమంటున్నాడు కానీ- అంతకు మించిన కుట్రేదో తనమీద జరుగుతోందని భూపతి అనుమానం.

ఏడో తరగతి చదువుతూండగా క్లాసులో

స్లిప్‌టెస్ట్. తన పక్కనే ఉన్న సీతారామయ్యతో, "స్లిప్‌టెస్ట్ అంటే స్లిప్ చూసి రాయాలి" అని నెమ్మదిగా జోక్‌చేసి జేబులోంచి స్లిప్ తీసాడు భూపతి.

అతడు కాపీ కొడుతూంటే తనకెందుకులే అని ఊరుకున్నాడు సీతారామయ్య. క్లాస్ టీచరా విషయం గమనించనేలేదు.

ఆ స్కూల్లోనే తొమ్మిదో తరగతి చదువుతున్న సుశీల- అలా కారిడార్లోంచి వెడుతూ ఆ దృశ్యం చూసింది. సుశీల చురుకైనది. నిజాయితీకి, నిర్భయత్వానికీ పెట్టింది పేరు. ఆ ఏడాది స్కూల్లో ఆదర్శబాలికగా ఎన్నికైంది. ఆమె భూపతిని క్లాస్ టీచరుకి పట్టిచ్చింది. మామూలుగా అయితే టీచరేం చేసేవాడో కానీ రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోయిన భూపతినాయన తీవ్రంగా మందలించి క్లాసు పిల్లలందరి ఎదుటా గోడకుర్చీ వేయించాడు.

ఆ సాయంత్రం భూపతి స్కూల్నించి ఇంటికెళ్ళేటప్పుడు సుశీలననుసరించాడు. అతడి పక్కనే ఉన్న సీతారామయ్యకి భూపతి దురుద్దేశం తెలియదు.

దారిలో తాము ముగ్గురమే ఉన్నామని తెలిసేక భూపతి సుశీలను నోటికొచ్చినట్లు తిట్టాడు. సుశీలకా తిట్లు వినిపించాయి. ఆమె మాట్లాడలేదు. వెనక్కి తిరగలేదు. అలాగే నడుస్తోంది. సీతారామయ్య భూపతిని మందలించాడు- ఆడపిల్లనలా తిట్టకూడదని.

"అది ఆడదేంటిరా... దాన్నలాగే తిట్టాలి" అంటూ భూపతి రెచ్చిపోయి మరిన్ని తిట్టాడామెని. ఐనా ఆమె చలించకపోగా సీతారామయ్యతో, "దీన్ని నువ్వు ఆడదన్నావుగా. నీకే కాదు, ఈ రోడ్డు మీద కొచ్చే అందరికీ ఇది ఆడది కాదని తెలియాలి. దీనికి బట్టలిప్పేస్తాను" అని అరిచాడు. అప్పుడు సుశీల వెనక్కి తిరిగి అతడి ముందుకొచ్చి "బట్టలిప్పుతావా, ఏదీ విప్పు, విప్పరా చూస్తాను" అంది సవాలుగా.

ఊహించని ఈ ప్రతిఘాతానికి అప్రతిభుడైన భూపతిని సీతారామయ్య గట్టిగా పట్టుకుని, "సుశీలా... ప్లీజ్! పారిపో. వీణ్ణి నేనెంతోసేపు ఆపలేను" అన్నాడు.

ఏమనుకుందో సుశీల నడకవేగం పెంచింది.

"ఇప్పుడు తప్పించుకున్నావ్ కానీ- ఏదో రోజున నీకు నా చేతిలో ఇలాంటి పరాభవం తప్పదు" అంటూ అరిచాడు కానీ- అతడు సీతారామయ్య పట్టునుంచి విడిపించుకుందుకు ప్రయత్నించలేదు.

ఆ మర్నాడే సుమిత్ర ఆంటీ ఏదో పార్టీ అని భూపతి, సీతారామయ్యల్ని తనింటికి పిలిచింది. ఆమె వయసు నలభై. ఊళ్ళో చాలా మంచి పేరుంది. ఆమె పెళ్ళి చేసుకోలేదు. గొప్ప ఆస్తి. పెద్ద బంగళా. అందులో తరచుగా పార్టీలు. తరచుగా స్కూళ్ళకెళ్ళి ఆమె ఇచ్చే ఉపన్యాసాలంటే- హైస్కూల్నించి- ప్రైమరీ స్కూల్ పిల్లల దాకా అందరికీ ఇష్టం.

పార్టీ అయ్యేక భూపతినీ, సీతారామయ్యని ఓ గదిలోకి తీసుకెళ్ళింది సుమిత్ర. ఆ గదిలో సుశీల, ఆమె పక్కనే కండలు తిరిగిన యువకుడు ఉన్నారు. ఆ యువకుడు భూపతిని సమీపించి, "ఏడో తరగతి చదువుతున్నావ్. వేలెడంత లేవు. ఆడపిల్లకి బట్టలిప్పుతావా? " అన్నాడు.

తెల్లబోయిన భూపతి భయంగా సుమి

## కొత్తగాలి...

**మంచి ఆరోగ్యానికి**
**క్యారెట్**
**మంచి ఆలోచనకి**
**క్యారెక్టర్!**

*- గుడిమెట్ల, అరసవిల్లి*

త్రని చూస్తే, "తప్పు తెలిసిందిగా, వెళ్ళి సుశీలకి క్షమాపణ చెప్పు" అందామె.

★ ★ ★

"నువ్వు సీతారామయ్యవే- సందేహం లేదు" అన్నాడు భూపతి. ఆ గొంతులో భయం.

"అరే... నీ గొంతులో భయం. అయ్యో- చావు నాకింత శక్తినిస్తుందని తెలిస్తే ఎప్పుడో చచ్చిపోయేవాణ్ణి. నాకింత చిన్న విషయం తెలియక నువ్విన్నేళ్లు బతికిపోయావు..."

"ఇప్పుడైతేనేం- నన్ను దేవుడు కూడా చంపలేడు. తెలుసా?"

"అది నిజం. అందుకే నిన్ను చంపడానికి దెయ్యాన్ని నేనొస్తున్నా- సాయంత్రం ఐదింటికి"

"ఎలా వస్తావు? దేవుడు, దెయ్యం, నీరు, గాలి- ఎవరైనా సరే- ఏదైనా సరే- నా అనుమతి లేకుండా నా ఇంటి ఆవరణలోకి చొరబడలేవు"

"ఆహా- సెక్యూరిటీ, కాపలా కుక్కలమీద ఎంత నమ్మకం? కానీ నేను గాలి, నీరు చొరబడని చోటికీ వెళ్లగలను. వాటినాపగలవారు కూడా నన్నాపలేరు. నేనొస్తా. నీ అంతు చూస్తా. ఆ తర్వాత మనమిద్దరం పాతపగలు మరిచిపోయి కొత్త లోకంలో కొత్త జీవితం ప్రారంభిద్దాం" ఫోన్ కట్టయింది.

భూపతి టైం చూస్తే ఒంటిగంటా ఇరవై. అంటే సీతారామయ్య ఇరవై నిముషాలు మాట్లాడాడు. ఈ ఇరవైనిముషాల్లో ఎన్నేళ్ల జీవితం స్ఫురణకు వచ్చింది?

సీతారామయ్య... తన కాలికింద చెప్పు లాంటి సీతారామయ్య... ఈ రోజు తనని భయపెడుతున్నాడు. ఆశ్చర్యంగా తనూ భయపడుతున్నాడు. ఏమైంది తనకి?

డాక్టర్ చెప్పాడు- భ్రమలోంచి దెయ్యాలు పుడతాయని. ఇప్పుడు తనకొచ్చిన ఫోన్ ఓ దెయ్యం నుంచీ అది భ్రమా, నిజమా?

అప్పుడు భూపతికి గుర్తొచ్చింది. సీతారామయ్య తన సెల్ నుంచి ఫోన్ చేస్తున్నానన్నాడు. తన సెల్ మాలతి దగ్గరుంది. అతడు ఫోన్ చేస్తున్నట్లు మాలతికి తెలుసా? అనుమాన నివృత్తికి ఫోన్ చేస్తే, "ఎలా ఉన్నారు?" అందామె వెంటనే.

అంటే సెల్ మాలతి దగ్గరే ఉంది. ఫోనెందుకు చేసాడో చెప్పలేక, "మాలతీ! నువ్విప్పుడిక్కడికి రాగలవా? ఒక్కసారి నిన్ను చూడాలని ఉంది" అన్నాడు.

"నాకూ మిమ్మల్ని చూడాలనుంది. త్వరగా పనులు పూర్తి చేసుకుని సాయంత్రం ఐదు దాటేక మీ దగ్గిరకొస్తాను" బుజ్జగిస్తున్నట్లు అందామె.

సాయంత్రం ఐదనగానే సీతారామయ్య చెప్పిన టైం గుర్తొచ్చింది భూపతికి, "ఎందుకో భయంగా ఉంది మాలతీ! నువ్వొచ్చేలోగా నాకేమైనా అయితే?" అన్నాడు అప్రయత్నంగా.

"ఉక్కుమనిషి భూపతిగారేనా ఇలా మాట్లాడుతున్నది? నాలుగురోజుల బెడ్ రెస్టుకే మీ ధైర్యం నీళ్లుగారిపోయిందా? గుండె కాస్త బలహీనంగా ఉన్నా ప్రమాదేమీలేదన్నాడు జయశంకర్"

"ఆయనిప్పుడే వచ్చి వెళ్లాడు. నా భయం మానసికం అంటాడాయన"

"అయితే మీ దగ్గిరకి రమణమూర్తిగార్ని పంపిస్తా. ఆయన గొప్ప జ్యోతిష్య పండితుడు. భూత భవిష్యత్తు వర్తమానాలు తెలుసు. మంచి చెబుతాడు, చెడు చెప్పడు. ఆయన కబుర్లకి శవం కూడా ప్రాణం పోసుకుని లేస్తుందని మీరు అనేవారు. గుర్తుందా- మీకోసారి వ్యాపారంలో ఊహించని నష్టమొచ్చి డిప్రెషనొస్తే- ఏ మందూ లేకుండా అరగంట కబుర్లతో మామూలు మనిషిని చేసాడాయన"

## మురళితో అమృత ధార

అస్మృతి నిజం

అదొక సంగీత కచ్చేరి. వాద్యగోష్ఠి. మురళిని వాయించే ప్రధాన వాద్య కారుడు ఒక బాలకుడు. పేరు టి.ఆర్. మహాలింగం. ముద్దు పేరు మాలి. వయస్సు ఎనిమిదో, తొమ్మిదో ఏళ్ళుండవచ్చు. అతనికి ఫిడేలు సహకారం ప్రఖ్యాత ఫిడేలు వాద్య కారుడు మైసూర్ టి. చౌడయ్యగారి తమ్ముడు గురురాజప్ప. చౌడప్పగారూ సభలో ఉన్నారు.

బాలుడి మురళి వాదనకు సభ సమ్మోహితమైనది. మురళీ నాదమాధుర్యం, రాగ సౌందర్యం, కచ్చిత కాలప్రమాణం వీటిని సభలోని సంగీత శార్దూలాలు ఆస్వాదిస్తూ ఉన్నాయి. ఆకస్మాత్తుగా చౌడయ్యగారు లేచి నిలబడ్డారు. తమ్ముడిని సమీపించి అతని చేతిలోని ఫిడేలును లాక్కున్నారు.



దీనిని చూసిన సభ స్తంభీభూతమయింది. "ఈ బాలసరస్వతితో కలిసి ఫిడేలు వాయించేందుకు నాకూ అవకాశమివ్వండి" అని సభలోని పెద్ద లను చూస్తూ అన్నాడు. సభ నిశ్శబ్దంగా ఉంది. "ఎవరికీ అభ్యంతరం లేదు కద?" అని మరల అడిగాడు. "దాందేముంది? విద్య ఎక్కడ ఉన్నా పూజార్హమే! వయస్సుతో నిమిత్తం లేదు" ఉన్న వాళ్ళలో పెద్ద అయిన వీణ సుబ్బణ్ణగారు అన్నారు. సభ మరలా మొదలయింది. అర గంటకాలం సాగింది మురళీ గానం. అదొక అమృత ధార.

"థాంక్స్, మాలతీ! బాగా గుర్తు చేసావ్. నాకిప్పుడాయన అవసరముంది. వెంటనే పంపించు"

"వెంటనే కాదు. ముందు బుద్ధిగా కళ్లు మూసుకుని పడుకోండి. ఆయనొచ్చేలోగా కనీసం ఓ గంట నిద్రపోవాలి. మీ కోసం కాకపోయినా నా కోసం"

మాలతికి తన ఆరోగ్యం మీద ఎంత శ్రద్ధ! అది తన బాధ్యత అంటుందామె తేలిగ్గా. ఫోన్లో మాట్లాడ్డమయ్యేక బుద్ధిగా కళ్ళు మూసుకున్నాడు. కానీ ఆలోచనలకి మూత పడలేదు.

సెల్ మాలతి దగ్గరే ఉంది. సీతారామయ్య ఫోనంటూ చేస్తే మాలతి పక్కనే ఉండి చేసుండాలి. కానీ సీతారామయ్య చనిపోయాడని తన నమ్మినబంటు శ్రీరామ్ ధ్రువపరిచాడు. భూపతికి నిద్ర పట్టడంలేదు. అనుమాన నివృత్తి కోసం బోర్లా పడుకుని మరోసారి మాలతి సెల్‌కి ఫోన్‌చేస్తే అది స్విచ్ఛాఫ్పై ఉంది. ఆయన మనసులో కొత్త అనుమానం.

మాలతి సెల్‌ని స్విచ్ఛాఫ్ చేసింది. ఎందుకు?

భూపతికి బుర్ర వేడెక్కిపోతోంది. శ్రీరామ్ చెప్పినా కూడా సీతారామయ్య ఇంకా బ్రతికున్నాడనిపిస్తోంది. క్రమంగా ఆ అనుమానం బలపడుతోంది.

మాలతి దగ్గర సెల్‌ఫోనుంది. అందు లోంచి సీతారామయ్య మాట్లాడాడు. ఆ తర్వాత సెల్‌కి ఫోన్ చేస్తే మాలతి మాట్లాడింది. రెండు రెళ్ళు నాలుగు...

మాలతి సీతారామయ్యతో చేతులు కలిపి తనని హతమార్చాలనుకుంటోందా?

కానీ అంతం చేయాలనుకుంటే మాలతి తనకెప్పుడో ఇంత విషమిచ్చి ఉండేది. ఆమెకి భూపతి భార్యగా సమాజంలో గొప్ప గుర్తింపు. రెండు తరాల సంతాన వృద్ధి వయసుడిగిన మాలతి, వయసుడి గిన సర్వం కోల్పోయిన సీతారామయ్య కోసం- స్వర్గతుల్యమైన తన జీవితాన్ని నాశనం చేసుకుంటుందంటే- అదీ సీతారామయ్య చచ్చాడని శ్రీరామే చెప్పాక- ఛన్నీగా లేదూ?

అప్పుడు గణేష్ గుర్తుకొచ్చాడాయనకు. సీతారామయ్య దినచర్య గమనించడానికి నియమించిన వాళ్ళలో ఆయనతో డైరక్ట్

కాంటాక్ట్ ఉన్నవాడు గణేష్ ఒక్కడే.

సీతారామయ్య కూతురి పెళ్ళి కుదిరినప్పుడూ, కొడుక్కి మెడిసిన్లో సీటొచ్చినప్పుడూ- గణేషే ఆ వార్త ముందు చెప్పాడు. మరిప్పుడు సీతారామయ్య పోయి ఒకరోజు కావస్తున్నా ఇంకా గణేశ్ నుంచి కబురు లేదు. కారణం తెలుసుకుందుకాయన అతడికి ఫోన్ చేస్తే - ముందక్కడ చెప్పుకోతగ్గ విశేషాలు లేవన్నాడు. అనుమాన నివృత్తికి సీతారామయ్య చేత ఫోన్ చేయంచమంటే ఆయన ఊళ్ళో లేరన్నాడు. ఏ ఊరెళ్ళాడని నిలదీస్తే తడబడ్డాడు. సీతారామయ్య పోయినట్లు కబురొచ్చిందంటే కాసేపు ఫోన్లో నిశ్శబ్దం.

"నువ్వు డ్యూటీ సరిగ్గా చేయడం లేదు" హుంకరించాడు భూపతి.

"లేదు సార్- నేను నా డ్యూటీ సక్రమంగానే చేస్తున్నాను. కానీ అమ్మగారు..." నసిగాడు గణేష్.

అమ్మగారంటే మాలతి. సీతారామయ్య మీద గణేష్ని నిఘా ఉంచిన విషయం భూపతి ఆమె వద్ద దాచలేదు. కొంత శాడిజం, కొంత నమ్మకం. కానీ ఇన్నాళ్ళూ గణేష్ విషయంలో జోక్యం చేసుకోని మాలతి ఈ రోజు ఏం చేసింది- ఎందుకు? - "ఊఁ అమ్మగారు? " అన్నాడు భూపతి.

"మీకు బెడ్ రెస్టు కదా- సంచలన వార్తలుంటే- ముందు తనకే చెప్పమన్నారు"

మాలతికి తన ఆరోగ్యం మీద శ్రద్ధకు ముగ్ధుడైన భూపతి, "ఛీ, ఈమెనేనా నేనను మానించాను? నీచత్వానికీ హద్దులుండాలి" అనుకున్నాడు.

"సీతారామయ్య విషయంలో సంచలన వార్త ఉంటే చెప్పు. అమ్మగారి దగ్గిర నీకు మాట రానివ్వన్లే" అన్నాడు.

అప్పుడు గణేష్ సీతారామయ్య మరణ వార్త ధ్రువపర్చాడు.

సీతారామయ్య కుర్చీలో కూర్చుని కబుర్లు చెబుతూ చెబుతూ ఉన్నట్లుండి చేత్తో గుండె పట్టుకుని కుర్చీలోనే వెనక్కు వాలిపోయాట్ట. మనిషి కదలడంలేదని ఇంట్లో ఒకరు డాక్టర్ని పిలవడానికెళ్ళారట. అప్పటికే ఆయన పోయాడని ఇంట్లోవాళ్ళకి అనుమానమొచ్చింది. డాక్టరొచ్చేసరికే ఇంట్లో ఏడ్పులూ, పెడబొబ్బలూ. ఆయన పోయి అరగంటయిందని చెప్పి వెళ్ళాడు డాక్టర్.

సీతారామయ్య పుణ్యాత్ముడు కాబట్టి సునాయాసంగా ప్రాణం పోయిందని చూడ వచ్చినవాళ్ళు కీర్తిస్తున్నారు. ఎప్పుడూ ఎవర్నీ పల్లెత్తుమాట అనని సీతారామయ్య పోయేముందు- "వాడికింక ఇరవైనాలుగ్గంటలే టైము" అన్నాట్ట. అదే ఆయన చివరిమాట. అలా ఎందుకన్నాడూ, ఎవరి గురించన్నాడూ అని ఇంట్లో తర్జనభర్జనలు పడుతున్నారు.

కాసేపటి క్రితమే శవానికి దహన సంస్కారాలయ్యాయి.

ఆ వివరాలతో- సీతారామయ్య పోయాడనే కాదు, దెయ్యమై తనమీద పగ తీర్చుకోనున్నాడనీ అర్థమై భూపతికి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. "నీ సెక్యూరిటీ, కాపలా కుక్కలు, పనివాళ్ళు నన్నాపలేరు. నేనొస్తా, నీ అంతు చూస్తా" అన్న ఆయన మాటలు చెవుల్లో గింగురుమన్నాయి.

అప్పుడు భూపతికి మళ్ళీ మాలతి గుర్తొచ్చింది. ఆమె పక్కనుంటే సీతారామయ్య తన జోలికి రాడనిపించింది. వెంటనే ఆమెకి ఫోన్ చేస్తే సెల్ ఆఫ్లో ఉంది.

భూపతి భార్యని అనుమానించలేదు. మనసారా ప్రేమించిన సీతారామయ్య చనిపోతే- ముందామె భర్త ఆరోగ్యం గురించి ఆలోచించి అతడికా కబురు చేరకుండా ఆపింది. ఎందుకు?

పెళ్ళయ్యేక మాలతి 'మనసంతా నువ్వే'

అనాల్సొస్తే అది భూపతి గురించే! అలాగే భూపతి 'మనసంతా నువ్వే' అనాల్సొస్తే అది సీతారామయ్య గురించే! భూపతికి వ్యాపారమెంత ముఖ్యమో, జీవిత సుఖాలెంత ముఖ్యమో, సీతారామయ్య కూడా అంత ముఖ్యం. సీతారామయ్య మరణానికి ఆయన మనసు అదుపు తప్పి తనువును ప్రభావితం చేస్తుందని మాలతికి తెలుసు.

"నా ఆరోగ్యం గురించి మాలతి శతథా ప్రయత్నిస్తోంది" అనుకున్నాడు భూపతి. ఎన్ని చేసినా ఆమె పక్కనుంటే అది లక్ష ప్రయత్నాల పెట్టనుకుని ఫోన్ తీయబోతే అదే మోగింది. భూపతి మనసులో కలవరం. టైం చూస్తే ఒంటిగంటా నలభై అదు.

సీతారామయ్యేమోనని కలవరపడ్డాడు కానీ ఫోన్లో వినపడ్డ గొంతు మురళిది.

"సార్- గ్రేట్ న్యూస్. సీతారామయ్య మూడోబిడ్డ వివరాలు తెలుసుకున్నాను. ఆ అబ్బాయిని చిన్నప్పుడే ఈ ఊళ్ళోనే ఓ అనాథ శరణాలయంలో జేర్పించారు" మురళి గొంతులో ఉత్సాహం.

కొంచెం షాక్. కొంచెం హుషార్. అంత అయోమయమైన స్థితిలోనే "ఊఁ" అన్నాడాయన అతికష్టం మీద.

"పరిశోధన పూర్తి కావచ్చింది సార్! శరణాలయం పేరు, ఆ అబ్బాయి పేరు, ఫోటో- అన్నింటితో సాయంత్రం ఆరుకల్లా మిమ్మల్ని కలుస్తా" మురళి గొంతులో ఎక్సైట్‌మెంట్.

భూపతిలో కంగారు. ఐదింటికి సీతారామయ్య తనని చంపుతానన్నాడు. ఆలోగానే తను సీతారామయ్య మూడో కొడుకుని ఫినిష్ చేయాలి. తనకెంతో టైం లేదు.

"సాయంత్రం ఆరంటే మరీ లేటు. నువ్వు వెంటనే రాగలవా? " అన్నాడాయన.

"సారీ సార్! ఫినిషింగ్ టచెస్‌లో ఉన్నాను. మీకు హాఫ్‌కుక్డ్ మెటీరియల్ ఇవ్వలేనుగా" అన్నాడు మురళి.

"పోనీ ఆ అబ్బాయి వివరాలు చెప్పగలవా? "

"చాలా బ్రిలియంట్ సార్. ఐఐటీ ఎంట్రెన్సు పరీక్షలో రాంక్ వచ్చినట్లు వినికిడి"

"వినికిడి అంటే? "

"అది నా ట్రేడ్ సీక్రెట్ సార్. సాయంత్రం ఆరుకొస్తాగా, అన్నీ అప్పుడు చెబుతా"

"నువ్వా ఆరుని పట్టుకుని వదలడం లేదు. ఇంకోమాట చెప్పు. పోనీ నాలుగు"

"నో ఛాన్స్. ఈ పరిశోధనలో నా లాస్ట్ అపాయింట్‌మెంటే అయిదుంపావుకి"

భూపతి అసహాయంగా ఊఁ అన్నాడు.

"సీతారామయ్యా- రహస్యంగా మూడో బిడ్డని కని, నా ఊహకందకుండా అనాథ శరణాలయంలో పెంచి ఇప్పుడు ఐఐటీలో చేర్చబోతున్నావ్. నీ తెలివికీ హేట్సాఫ్" అనుకున్నాడు భూపతి.

"ఒరేయ్- సీతారామయ్య కొడుకూ- నేను నిన్ను ఐఐటీలో చేరనివ్వను. నీ తండ్రి బడిపంతులయ్యాడు. అన్న కాంపౌండరయ్యాడు. నిన్ను గేటుకీపర్ని చేస్తాను" కసిగా అనుకున్నాడాయన. అప్పుడే గదిలో గోడ గడియారం రెండు గంటలు కొట్టింది. అప్పుడే ఫోన్ మోగింది. తీస్తే-

"ఇంకా నిద్రపోలేదా, భూపతీ" అంది సీతారామయ్య గొంతు.

ఒళ్ళంతా వణుకుతున్నా, "లేదు, నీ ఫోన్ కాల్‌కోసం ఎదురుచూస్తున్నాను" అన్నాడు బింకంగా.

"చిరకాల మిత్రుడివి. చివరి క్షణాల్లో ఉన్నావు. నా కోసం ఎదురుచూడ్డం సహజమే"

"నాకివి చివరి క్షణాలు కావు" భూపతి గొంతులో ఉక్రోషం.

"నీకివి చివరి క్షణాలే. ఎందుకంటే ఈ క్షణంనుంచీ నీ జాతకం నేను రాస్తున్నా"

"జాతకాలు రాసేది నేను. అది నీవల్ల కాదు"

"సరే. మూడింటికి ఫోన్ చేస్తాను. చేతనయితే అప్పటికి నా జాతకం రాసుంచు" ఫోన్ కట్టయింది. అందుకే ఎదురు చూస్తున్నట్లు - భూపతి వెంటనే మాలతికి ఫోన్ చేసాడు. సెల్ స్విచ్ఛాఫ్. ఏమిటీ మాయ? సీతారామయ్య సెల్‌నుంచి ఫోన్ చేస్తున్నాడు. ఆ సెల్ మాలతి దగ్గరుంది. తను మాలతికి ఫోన్ చేస్తే ఆ సెల్ ఆఫ్‌లో ఉంటోంది.

సీతారామయ్యని ప్రేమించి మర్చిపోయిన మాలతి, సీతారామయ్య పోతే ఆ వార్త తన్ను చేరకుండా చేసిన మాలతి- ఇప్పుడేం చేస్తోంది?

పక్కనుండమంటే ఆరింటికొస్తానని ఎంత బ్రతిమాలినా అంతకంటే ముందు రాలేనంది మాలతి. డిటెక్టివ్ మురళి కూడా ఆరులోగా సీతారామయ్య మూడో బిడ్డ బండారం బయటపెట్ట లేనన్నాడు. సీతారామయ్యేమో తనకు ఐదువరకే టైమిచ్చాడు. ఇప్పుడేం చేస్తోంది మాలతి?

ఆమె సంఘసేవిక. సమాజ సంక్షేమ కార్యక్రమాలు, అనాథ శరణాలయాలు..

ఉలిక్కిపడ్డాడు భూపతి. సీతారామయ్య మూడోబిడ్డ అనాథ శరణాలయంలోనే పెరిగాడు. మాలతి, సీతారామయ్య, అనాథ శరణాలయం- ఈ మూడింటికీ ఏదో ముడి ఉంది.

"ఏమిటి సార్- దీర్ఘాలోచనలో ఉన్నారు? "

భూపతి ఆలోచనల్లోంచి బయటపడి అటు చూస్తే- ఎదురుగా ఓ ఆజానుబాహుడు. తెల్లని పంచెమీద తెల్లని లాల్చీ ముఖంలో తేజస్సు. ఆత్మీయత చిందించే చిరునవ్వు.

రమణమూర్తి... మంచంపక్క కుర్చీలో కూర్చుని, "మాలతమ్మ చెబితే వచ్చా మీ గుండెకి పోటు వద్దామనుకుని, మిమ్మల్ని చూసి భయపడి పారిపోయిందిటగా" అన్నాడు.

భూపతి నవ్వి, "గుండెనొప్పి మృత్యుదేవత మారురూపమంటారు" అన్నాడు.

"మీరంటే మృత్యుదేవతకీ భయమే. మీరు డాక్టరైతే రోగులకి చావుండదు!"

మీరు జ్యోతిష్కులు. మరి నేను డాక్టర్నెందుకు కాలేదో చెప్పండి"

రమణమూర్తి గొంతు సవరించుకుని, "భూలోకంలో పాపభారం పెరిగిపోతోంది. మీరు డాక్టరైతే పాపులక్కూడా చావుండదు. పోనీ దేవుడే ఏదైనా కొత్త అవతారమెత్తాలనుకుంటే మీ అంతటి వారుండగా ఆయనకీ భూమ్మీద అవతారమెత్తాల్సిన అవసరం కనపడదు" అన్నాడు.

"మీరు నన్ను ఆకాశానికెత్తేస్తున్నారు" అన్నాడు భూపతి కొత్త ఉత్సాహంతో.

రమణమూర్తి ఆయన ఉత్సాహాన్ని పసికట్టాడు. "మీరేం చదివితే అందులో నిష్ణాతులై సృష్టి రహస్యాలన్నీ బట్టబయలవుతాయని దేవుడు మీకసలు చదువుపట్లే ఆసక్తి లేకుండా చేసాడు. దాంతో మీకు దేవుడి మీదే కోపమొచ్చి- ఆయనకిష్టమైన మంచి వాళ్ళని బాధించాలనుకున్నారు. అందుకవసరమైన శక్తి సామర్థ్యాలు తపస్సుతోకాక

## కొత్తగాలి...

**మరులు గొలిపితే**
**కనులు అరమోడ్పు**
**సిరులు గొలిపితే**
**కనులు నెత్తికెక్కు**

*- వోలేటి శ్రీనివాసరావు, విజయనగరం*

స్వయంకృషితో సంపాదించారు"

"మొత్తం మీద నన్ను దుర్మార్గుడిగా తేల్చారు"

"ముఖస్తుతి చెయ్యను. నిజాన్ని దాచను. ఉన్నదున్నట్లు కుండబద్దలు కొట్టి నట్లు చెబుతాను. నా మాటలాగుంచి- దుర్మార్గుణ్ణి కాదని గుండెలమీద చెయ్యేసు కుని మీరు చెప్పండి చూద్దాం? "

భూపతి ముఖం ఎర్రబడింది. "ఇది సవాలా? " అన్నాడాయన.

"సవాలైతే నెగ్గగలననా? మీకు తెలియ దేమో- ఇదే సవాలుతో నేనోడించిన వాళ్ళలో- ఈ నగర ప్రముఖులు, మన రాష్ట్ర మంత్రులు, కేంద్రమంత్రులు కూడా ఉన్నారు"

భూపతి ముఖంలోని ఎరుపు గులాబి రంగుకి మారింది. ముఖంలో చిరునవ్వు తొంగి చూసింది.

"ఇది యుగధర్మం! నలభైమందికి మేలు చేయడానికి నలుగుర్నైనా దెబ్బతియ్యాలి. అంటే టెన్ పర్సెంట్. అందుకు విచార మేల- నైన్టీపర్సెంట్ బాగుపడుతుంటే? "

"మూర్తిగారూ- మీరు దుర్మార్గుడన్నా నాకు కోపం రావడం లేదు. దుర్మార్గుణ్ణి కాబట్టి చాలా పాపాలు చేసుండాలి. నా పాపం పండే రోజెప్పుడో చెప్పగలరా? " అడిగాడు భూపతి.

"పాపం పండదండీ- కుళ్ళుతుంది" అన్నాడు రమణమూర్తి.

చురుక్కుమంది భూపతికి. అయినా తేరుకుని, "పోనీ అదే ఎప్పుడో చెప్పండి" అన్నాడు.

"ఫేస్ ఈజ్ ది ఇండెక్సాఫ్ మైండ్ అన్నది ఆంగ్ల సామెత అయినా అక్షర సత్యం. మీ ముఖం చూస్తే ఈ సాయంత్రం ఐదింటికి మీకేదో ప్రమాద ముందనిపిస్తోంది"

భూపతి ఆశ్చర్యంగా, "టైముతో సహా ఎలా చెప్పారు? " అన్నాడు.

"మీ మనసులో ఆ టైముంది. అది ముఖంలో కనిపించింది. వేల మైళ్ళ దృశ్యాల్ని- అప్పటికప్పుడు టీవీలో చూస్తున్నాం. ఎదురుగా ఉన్న మీ ముఖ భావాల్ని చదవడమో గొప్ప విశేషమా? ఈ రోజు సాయంత్రం ఐదింటికి ఏదో అ వుతుందని మీరనుకుంటున్నారు. అందు కేదో కారణముండాలి. లేదా ఏవో భ్రమలు కల్పించిన మరో కారణముండి ఉండాలి"

"భ్రమలంటే- ఫోనొచ్చినట్లూ, ఎవరి తోనో మాట్లాడినట్లూ..." ననిగాడు భూపతి.

"కావచ్చు. ఉదాహరణకి ఒకరోజు మా ఇంట్లో మా అమ్మ ఉదయమే లేచి స్నానం చేసి వంటగదిలో కొబ్బరి చెక్కకోసం వెదు కుతోంది. అదెక్కడిదంటే పూజారి ఇచ్చా డంది. జరిగిందేమిటంటే- అంతకు ముందురోజు సాయంత్రం మేము గుడి కెళ్ళి కొబ్బరికాయ కొట్టి ప్రసాదం చెక్క తీసుకోవడం మర్చిపోయాం. పూజారి తెలి సినవాడే కాబట్టి ఆ రాత్రో మర్నాడు పొద్దున్నో చెక్క తెచ్చి ఇస్తాడనుకుంది అమ్మ. దాని గురించి అమ్మ ఎంతలా ఆలోచించిందంటే- మర్నాడుదయం నిద్ర లేచాక పూజారిగారొచ్చి తనకి కొబ్బరి చెక్కిచ్చి వెళ్లినట్లు భ్రమ కలిగి దానికోసం వెతుక్కుంటోంది.

పూజారి ఇంటికి రాలేదని ఎవరు చెప్పినా వినలేదు" ఆగాడు రమణమూర్తి.

తనకిప్పుడు జరుగుతున్న అనుభవాలని అన్వయించుకుందుకీ విశేషం పనికొస్తుం దని తోచిందేమో, "ఒకవేళ మీ అమ్మగా రిది భ్రమ కాదేమో! పూజారి నిజంగానే కొబ్బరి చెక్కిచ్చి వెడితే ఆమె ఎక్కడో పెట్టి మర్చిపోయారేమో!" అన్నాడు భూపతి.

"అదే చెబుతున్నా. ఓ అరగంట తర్వాత

పూజారి మా ఇంటికొచ్చి ఆ కొబ్బరి చెక్క ఇచ్చి వెళ్ళాడు. వెళ్లేముందాయన మా అమ్మతో- మీరు పొద్దున్నే స్వయంగా మా ఇంటికొచ్చి నిన్నటి ప్రసాదం విషయం గుర్తుచేసారు. నిన్న మర్చిపోవడమే తప్పు. ఈ రోజొచ్చి మీరడిగి వెళ్ళిపోతూంటే అప్పుడేనా ప్రసాదమిచ్చి పంపాలన్న జ్ఞానం లేకుండా అలా చూస్తుండిపోయాను. నా గురించి నేనే ఏమనుకోవాలో తెలియక సిగ్గుతో చస్తున్నానమ్మా! ఈ విషయమై పిసుక్కుపోతూ మీ ఇంటికి రావాలని ఓ గంట నుంచి ప్రయత్నిస్తూంటే గుళ్ళో ఒకటే జనం. చివరకు మా తమ్ముణ్ణక్కడుంచి ఇలా చక్కావచ్చాను- అన్నాడు"

"అంటే మతిమరుపు మీ అమ్మగారిదా, పూజారిదా?" అన్నాడు భూపతి సాలోచనగా.

"మతిమరుపెవ్వరికీ లేదు. అక్కడ పూజారి, ఇక్కడ మా అమ్మ కూడా భ్రమలో పడ్డారు. మా అమ్మ తీవ్రాలోచన ప్రభావంతో పూజారికామెని తనింట్లో చూసిన భ్రమ కలిగితే- అమ్మకి పూజారి మా ఇంటికొచ్చి ప్రసాదమిచ్చినట్లు- భవిషద్దర్శనమూ అయింది. ఆ భవిష్యత్తునే ఆమె వర్తమానంగా భావించింది. అంటే అరగంట తర్వాత రానున్న పూజారినామె ముందే చూసింది"

భూపతి గుండె గుభేల్మంది. సీతారామయ్య చనిపోతూ పోతూ, "వాడికింక ఇరవై నాలుగ్గంటలే టైము" అన్నాడు. తర్వాత ఈరోజు సాయంత్రం ఐదింటికి తనకి చావు ముహూర్తం పెట్టాడు. అది తనకి భవిష్యద్దర్శనమా?

"నా మనసు ఈ రోజు సాయంత్రం ఐదింటికి ప్రమాదాన్ని శంకిస్తోంది. నేనేం చెయ్యాలి?"

"అది భ్రమ. అయితే గతంలో జరిగిన ఏదో విశేషానికి ప్రతిస్పందన"

## కొత్తగాలి...

**పడివుండే పట్టాలు**
**బడుగు జీవులు**
**పరుగెత్తే చక్రాలు**
**బడా బాబులు!**

*-సి.కామేశ్వరరావు, కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా*

"ఆ భ్రమ నిజమవుతుందా?" భూపతి గొంతులో కలవరం.

"అది చెప్పాలంటే- గతంలో జరిగిన ఆ విశేషమేమిటో దాన్ని మీ మనసెలా విశ్లేషించిందో నాకు తెలియాలి"

చెప్పడం భూపతికి ఇష్టంలేదు. అందుకని, "అది నేను చెప్పలేకపోతే?" అన్నాడు.

"ఓ సలహా ఇస్తాను. మనసులో భయానికి చోటిస్తే అది ఇంతింతై అంతై మిమ్మల్ని అధోగతి పాల్జేస్తుంది. అలా జరక్కుండా మీరు మనసును అదుపు చేయాలి. అదెలాగంటే ఇందాకా మీరన్నట్లు ఫోనొస్తుంది. మీరు మాట్లాడతారు కూడా. రెండూ భ్రమే. మనసుని అదుపు చేస్తే- ఆ భ్రమ తొలగిపోతుంది. మరి మీకు ఫోన్ రాదు. వస్తే మనసు అదుపు కాలేదని అర్థం. అప్పుడు మీరు భ్రమ సూచించే ప్రమాదాన్నీ అదుపుచెయ్యలేరు"

తన విషయంలో ఆయన సాయపడగలడనిపించినా భూపతి, "మూడింటికి నాకో ఫోన్ వస్తుంది. అది భ్రమో, నిజమో మీరు చెప్పాలి" అన్నాడు.

"వెరీ ఇంట్రస్టింగ్. అందాకా ఇక్కడే ఉంటాను" అన్నాడు రమణమూర్తి ఉత్సాహంగా. ఇద్దరి మధ్యా మాటలాగిపోయాయి. ఇద్దరూ వాచీలనే చూస్తుంటే ఆ కాసేపూ వారికి క్షణమొక యుగమైంది. మొత్తం మీద టైము మూడయింది. ఫోన్

## కొత్తగాలి...

**కాల నాళికలో
ప్రాచీన తెలుగు
తెలుగోడి నాలుకపై
కనుమరుగు**

– పానుగోటి నరసింహారావు,
కూకట్‌పల్లి, హైదరాబాద్

మోగింది.

భూపతి చటుక్కున రిసీవర్ తీసి, "హలో, భూపతి హియర్" అన్నాడు.

"అదే. అది తెలుసుకుందుకే ఫోన్ చేసాను" అది సీతారామయ్య గొంతే.

భూపతి రమణమూర్తిని చూసాడు. ఆయన ఆశ్చర్యంగా భూపతినే చూస్తు న్నాడు.

సీతారామయ్యని మాటల్లో పెట్టి ఫోన్ రమణమూర్తికివ్వాలని భూపతి ఉద్దేశం. అందుకని, "నీ ఉద్దేశం మరొక్కసారి చెప్పు, వినాలనుంది" అన్నాడు.

"కాసేపట్లో చచ్చేవాడివి- ఏం వింటావ్- సుఖంగా పడుకోక" అవతలి గొంతులో ఈసడింపు.

"షటప్" అన్నాడు భూపతి కోపం పట్ట లేక.

"డన్" అంది అవతలి గొంతు. వెంటనే ఫోన్ కట్టయింది.

ఫోను అంత తొందరగా కట్టవుతుందని ఊహించని భూపతి తెల్లబోయాడు. రిసీ వర్ హుక్‌చేసి రమణమూర్తి వంక తిరిగి, "మీకిచ్చేలోగా ఫోన్ కట్. ఫర్ ది ఫస్ట్ టైం- ది టాక్ ఈజ్ వెరీ బ్రీఫ్" అన్నాడు అసంతృప్తిగా.

"అవతల్నించి ఎవరైనా మాట్లాడేరా? " అన్నాడు రమణమూర్తి ఆశ్చర్యంగా.

"మీకా అనుమానమెందుకొచ్చింది? " అన్నాడు భూపతి ఆశ్చర్యంగా.

"ఏ రింగూ లేకుండా మీరు ఫోన్ తీస్తేనూ..." అన్నాడు రమణమూర్తి.

"రింగవలేదా- గదంతా మోగిపోతేనూ" చిరాగ్గా అన్నాడు భూపతి.

కాసేపిద్దరూ వాదించుకున్నాక, "నాకిప్పు డంతా అర్థమైంది. ఫోన్ రింగ్ మీ భ్రమ. ఫోన్లో మాట్లాడ్డమూ మీ భ్రమ. అది తొందరగా కట్టవడం - మీ మనసు నన్ను నమ్మించడానికి చేసే ప్రయత్నం" అన్నాడు రమణమూర్తి నమ్మకంగా.

"అంటే నేను వేరు, నా మనసు వేరు- అంటారు"

"మీకే కాదు ప్రతి మనిషికీ మనసు వేరే. మీ ఫోన్, మీకు రాబోయే ప్రమాదం మీ ఊహ. మనసు అదుపులో ఉంచండి. భ్రమలకి దూరమవుతారు"

"మనసునదుపు చేయడం ఎలా? " అను మానంగా అడిగాడు భూపతి.

"మీరో అందమైన అమ్మాయితో కబుర్లు చెబుతున్నారనుకోండి. మనసులో ఊహ లు ఒకలా, పైకి చెప్పే కబుర్లు మరొకలా ఉంటాయి. మర్యాద మనసునదుపు చేస్తుంది. అలాగే పదిమందిలో ప్రత్యర్థితో మాట్లాడుతున్నప్పుడు వివేకం మనసున దుపు చేస్తుంది"

"భ్రమో, వాస్తవమో, మనసు అదుపు కావడం లేదేమో చెప్పలేను. ఫోన్ మోగిం దని వివేకం కూడా చెబుతోంది" అన్నాడు భూపతి అసహాయంగా.

రమణమూర్తి ఆయన్ని జాలిగా చూసి, "భూపతిగారూ! మనసునదుపు చేయడా నికి మరో మార్గం - ఆలోచనల దారి మళ్ళించడం. అదెలాగో నా మేనత్త నాగ వల్లి కథవింటే తెలుస్తుంది" అన్నాడు. నాగవల్లి పదహారేళ్ళ వయసులో కులం కాని వాడితో లేచిపోయింది. అయినవాళ్ళా మెని వెలేసారు. మొదట్లో పట్టించుకోలేదు కానీ జీవితంలో పైకొచ్చి భాగ్యవంతురాల య్యాక నాగవల్లిలో తనవాళ్ళను కలవా

లన్న తపన మొదలయ్యింది. భర్త మంచి వాడు కాబట్టి- ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్న ఆమె కన్నవారిని ఆదుకున్నందుకు ఒప్పుకు న్నాడు. కానీ అయినవాళ్లామెని దగ్గరికి రానివ్వలేదు. ముఖ్యంగా బామ్మ రంగమ్మ ఆమెని మరీ ఏవగించుకునేది. ఆవిడవల్లే మిగతావాళ్ళామె విషయంలో మెత్తబడే అవకాశం పోయింది. ఫలితంగా నాగవల్లి తనవాళ్లింటి గడప తొక్కలేకపోయింది... ఎనభై ఐదేళ్ళ వయసులో రంగమ్మ జబ్బుతో మంచం పట్టింది. మందులేం పనిచేయలేదు. వయసైపోయిందని డాక్టర్లు పెదవి విరిచేసారు. నేడో రేపో అనుకుంటూనే మంచంమీదే కొనప్రాణంతో ఏణ్ణర్థంపాటు కొనసాగిందావిడ.

ఊపిరిపీల్చే ఎండుకట్టెలా ఉన్న ఆమెని చూసి ఇంటిల్లపాదీ కళ్ళనీళ్ళు పెట్టుకునే వారు. ఆవిడకి మోక్షమెప్పుడోనని పరిత పించేవారు. అలాంటి పరిస్థితుల్లో దూరపు బంధువొకాయన, "పైకి చెప్పదు కానీ ఆవి డకి నాగవల్లిని చూడాలనుకుంది. అందుకే జీవుడా శరీరాన్ని అంటిపెట్టుకుని వదలడంలేదు. ఒక్కసారి నాగవల్లిని పిలి పించండి" అన్నాడు.

రమణమూర్తి మేనత్తకి కబురు చెప్పాడు. నాగవల్లి మురిసిపోయింది. ఎన్నో ఏళ్ళ తర్వాత తనవారింటికెడితే- చూస్తూనే రంగమ్మ మనుమరాల్ని గుర్తుప ట్టింది. ఆవిడ కళ్ళలో కొత్త మెరుపు కన పడింది. ఆవిడ నాగవల్లిని దగ్గరగా తీసు కుని ఆప్యాయంగా వళ్ళంతా తడిమింది. ఆ తర్వాత- ఐదు నిముషాలు. అంతే. ఆవిడ గుండె కొట్టుకోవడం మానేసింది. "ధృఢ సంకల్పముంటే జీర్ణశరీరమైనా మృత్యువునాపగలదు" అన్నాడు రమణ మూర్తి. "సాయంత్రం ఐదింటికి ఏదో అ వుతుందని భయముంటే- ఆరింటికి ధృఢ సంకల్పంతో మరో ప్రోగ్రాం పెట్టుకోండి. మనసును ఆరింటి ప్రోగ్రాంకి సిద్ధం చేస్తే- ఐదింటి ప్రమాదం తప్పిపోతుంది"

భూపతికిది నచ్చింది. ఆరింటికి సీతారా మయ్య మూడోబిడ్డ వివరాలు చెబుతా నన్నాడు మురళి.

అవి వినాలన్న కోరిక ఎంత బలమైన దంటే- అందాకా- మృత్యువు కూడా తననేం చెయ్యలేదు. రమణమూర్తి ధృఢ సంకల్పమన్నాడు కానీ అది తన జీవితా శయం.

భూపతి గుండె దిటవు చేసుకున్నాడని గ్రహించి రమణమూర్తి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. భూపతి సాయంత్రం ఆరు గంటలమీదే ఆలోచనల్ని కేంద్రీకృతం చేసాడు. అప్పుడాయనకో పెద్ద అనుమాన మొచ్చింది. సీతారామయ్య మూడోబిడ్డ గురించి మురళి ఈరోజే చెబుతాననడం, సీతారామయ్య నుంచి ఈ రోజు బెదిరింపు ఫోన్ రావడం కాకతాళీయమేనా?

బదులు దొరకలేదు కానీ ఆయనకి తల పోటు వచ్చింది. దృష్టి మరల్చుకునేందుకు పక్కనున్న పుస్తకం తీస్తే - 'గాలిబ్ గీతాలు' కవరు తిప్పగానే, "ప్రియమిత్రుడు భూపతికి- ప్రేమతో సీతారామయ్య" అన్న వాక్యం. అది చూస్తూనే- "మనిషికి పుస్త కాన్ని మించి మంచి మిత్రుడుండడు. ఏదో రోజున నీకా విషయం తెలుస్తుంది. అప్పుడే ఇది చదువు" అన్న మిత్రుడి మాటలు స్ఫురణకొచ్చాయి. ఆలోచిస్తూనే పేజీలు తిప్పితే ఒకోచోట ఆగితే, 'మనిషి ఏకాకియైనను మనసులోన, గుంపులుగా భావములు జేరి గోష్ఠి జరుపు' అన్న కవిత.

"ఇప్పుడు నా విషయంలో జరుగుతున్న దేనే" అనుకుంటూ మరో పేజీ దగ్గర ఆగితే- "మృతి నెరుంగని ఒంటి దేవతల కన్న, నలుగురికి మేలు చేసెడి నరుడె మిన్న" అంటూ మరో కవిత. అది

కంటితో చూసినట్లు కాక చెవులకి వినపడు తున్నట్లనిపించింది. మరికొన్ని పేజీలు తిప్పితే- "అన్ని బాధలు నేటితో అంత మొందె, ఇక ఆకస్మాన్మరణబాధ ఒకటే మిగిలె"

అది సీతారామయ్య గొంతు. చప్పున పక్కకి తిరిగితే ఇందాకా రమణమూర్తి కూర్చున్నచోట ఇప్పుడు సీతారామయ్య కని పించాడు.

అంటే- వచ్చేసాడు సీతారామయ్య. చెప్పిన టైముకంటే చాలాముందే! ఐనా ఆశ్చర్యంగా భూపతికి భయమేయలేదు. వణికి పోలేదు. అసలతడు చనిపోయాడని స్ఫురణకి రాలేదు. సీతారామయ్య ముఖంలో ప్రశాంతమైన చిరునవ్వు. ఆయన భూపతినే చూస్తున్నాడు. అడగాల నుకోకపోయినా అప్రయత్నంగా భూపతి నోట పలకరింపు, "చాలా కాలమైంది నిన్ను చూసి. ఎక్కడుంటున్నావురా ఇప్పుడు? "

"నన్ను గూర్చి వార్త నాకు అందనిచోట, నేను వాసముండినాను నేడు" అప్పుడు గుర్తొచ్చింది భూపతికి- సీతారామయ్య చచ్చిపోయాడని. కానీ తనకిప్పుడు భయ మేయదేం? చనిపోయినవాడు తన పక్క కెలాగొచ్చాడూ అని ఆశ్చర్యం కలగదేం? "అవునూ... పాపం, నువ్వు చచ్చిపోయావు కదూ? " జాలిగా అన్నాడాయన.

"ఎంతో ఉత్సాహపడుచు కష్టింతుమౌర, మృతియె లేకున్న రుచి యేది బ్రతుకు లోన" అదే చిరునవ్వు. చచ్చి కూడా చావులో రుచి ఉందనుకునేవాడి చిరు నవ్వు. ఐనా అతడికి చావు రుచి కావచ్చు కానీ తనకు బ్రతుకు తీపి, "నీది దరిద్రపు బ్రతుకు. నాది వైభవోపేతమైన జీవితం. చావులో రుచి ఉందంటే నేనొప్పుకోను" అన్నాడు భూపతి.

"మచ్చలను మృత్యువే కప్పిపుచ్చుకున్న, అంబరములెన్నియున్న దిగంబరుడవె" భూపతి ముఖం పాలిపోయింది. ఎంత మాటన్నాడు సీతారామయ్య? చేసిన పాపాలు మచ్చలైతే వాటిని వైభవం కప్పి పుచ్చదు. అవి పోవాలంటే చావాలి. "మంచమెక్కానని నా పనైపోయిందను కోకు. నాది చిన్న జబ్బు, బెడ్ రెస్ట్ చాల న్నారు డాక్టర్లు. ఒకటి రెండ్రోజుల్లో మళ్ళీ ఎప్పటిలా లేచి తిరుగుతా" అన్నాడాయన.

"బిందువణగారి సింధువై వెలసినట్లు, రుజయు పెంపొంది ఔషధ రూప మందు"

భూపతికోపమొచ్చింది. నీటిచుక్క సముద్రమైనట్లుగా తన జబ్బూ పెరిగి పెరిగి మందుగా మారుతుందట. సముద్రం నేలని ముంచినట్లు, ఆ మందు తన జీవితాన్ని ముంచుతుందిట. జీవితా నికి మృత్యువే పరమావధి అంటున్నాడు సీతారామయ్య. అనకేం చేస్తాడు? తాన తడి జీవితంలో సంతోషాన్నంతా దోచాడు. ఆ పగతో చచ్చి తనూ చావాలనుకుంటే ఆశ్చర్యమేముంది?

అందుకు బదులన్నట్లుగా మళ్ళీ సీతారా మయ్య గొంతు, "దొంగతనమైన పిదప నిద్దుర లభించె, నన్ను దోచిన దొంగకు నతులొనర్తు"

చూస్తే సీతారామయ్య అతడికి జోడిం చాడు. ముఖంలో అదే చిరునవ్వు.

భూపతి తెల్లబోయాడు. సీతారామయ్య గురించి తనెప్పుడూ ఇలా ఆలోచించలేదే మిటి? ఆస్తిపాస్తులకి కాపలా కాసే మని షికి నిద్రకి కరువే. ఏ దొంగలో అవి దోచుకుపోతే అప్పుడు హాయిగా కంటి నిండా కునుకు తీయొచ్చు అందుకని దొంగకి నమస్కారం చేయాలి.

అది అభినందనా- లేక అసహాయతా? కాస్త పరీక్షగా చూస్తే సీతారామయ్య ముఖంలో చిరునవ్వున్నా కళ్ళలో లీలగా

విషాదమున్నదనిపించింది. ఆయన తన మూడోబిడ్డ జోలికెళ్ళొద్దని ప్రాధేయపడు తున్నాడని అర్థమైంది భూపతికి.

"అరే, నాకూ థాట్ రీడింగ్ వచ్చేసింది" అనుకున్నాడు భూపతి.

అప్పుడాయనలో చెప్పలేనంత సంతోషం. తను భయాన్నధిగమించాడు. మనసు చిక్కబట్టుకుని సీతారామయ్యే తనకి భయపడేలా చేసాడు. ఇది రమణ మూర్తి సలహా ప్రభావమా?

"నీ ఘనత వేరొకరికి అంటగట్టకు భూపతీ! నీకు హేట్సాఫ్!" అని తన్ను తనే అభినందించుకుని, "అందితే జుట్టు, అంద కపోతే కాళ్ళు. ఈ రోజు నీ మూలంగా నాక్కలిగిన మానసిక వ్యధ ఇంతా అంతా కాదు. నీ మూడోబిడ్డ క్షేమం తప్ప ఇంకే మైన కోరుకో, ఆలోచిస్తాను" అంటూ సీతా రామయ్యవైపు హుంకరించాడు.

సీతారామయ్య కళ్ళలో చిరునవ్వు మాయమైంది. ఎడంచేయి క్రిందకు వాలింది. కుడిచేయి ముందుకు సాగి పిడి కిలి బిగిసింది. దాంట్లోంచి చూపుడువేలు ముందుకొచ్చింది.

భూపతి బెదరలేదు, "తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదరవు" గద్దించాడు.

సీతారామయ్య కళ్ళు ఎర్రబడ్డాయి. "ప్ర తీది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము, నరుడు నరుడౌట దుష్కరము సుమ్ము"- అది గద్దింపు కాదు, గర్జన!

"నా ఇంటికొచ్చి నన్నే బెదిరిస్తావా?" అంటూ మంచం మీంచి లేవబోయాడు భూపతి.

అంతే, సీతారామయ్య మాయమ య్యాడు. భూపతి కళ్ళు నులుముకు న్నాడు. గదంతా కళ్ళతో వెదికాడు. ఎక్కడా సీతారామయ్య జాడలేదు.

భూపతి కోపంగా కాలింగ్ బెల్ మీట నొక్కాడు. పనివాడొచ్చి వినయంగా చేతులు కట్టుకుని నిలబడితే, "ఇప్పుడే

## కొత్తగాలి...

**జీతం చూసుకుంటే**
**జీవితం లేదు!**
**జీవితమే కావాలనుకుంటే**
**జీతం చాలదు!!**

**– జి.వి.ఎస్. ప్రియంవద, శ్రీకాకుళం**

ఒకడీ గదిలోంచి బయటకెళ్ళాడు. వాణ్ణి లోపలికి పంపిందెవరు?" అన్నాడు. పని వాడు ఆశ్చర్యంగా, "రమణమూర్తిగారి గురించేనా తమరడుగుతున్నది?" అన్నాడు.

"కాదు, ఆ తర్వాత?"

"ఆయనకి ముందు జయశంకరు డాక్ట రుగారొచ్చారు. ఆయన తర్వాత ఇంకెవరూ రాలేదు బాబూ!"

"వచ్చారు" నొక్కించాడు భూపతి. పని వాడు భయంగా తలదించుకున్నాడు.

అప్పుడు భూపతికి గుర్తొచ్చింది. సీతారా మయ్య పారిపోలేదు. ఉన్నఫళంగా మాయమయ్యాడు. అసలతడు గదిలో కూడా ఉన్నట్లుండి ప్రత్యక్షమయ్యాడు. "ఊఁ సరే వెళ్ళు" అని పనివాణ్ణి పంపేసి చేతిలో పుస్తకం చూస్తే- 'ప్రతీది సులభ మ్ముగా సాధ్యపడదు లెమ్ము, నరుడు నరు డౌట దుష్కరము సుమ్ము'- గాలిబ్ గీతాల్లో మొదటి కవిత. అదిప్పుడు సీతా రామయ్య గొంతులో వినపడ్డంలేదు. అక్షర రూపంలో కనిపిస్తోంది.

తనకి సీతారామయ్య ఎన్నోమార్లు గాలిబ్ కవితలతో బదులిచ్చాడు. అందుకే- ఇప్పుడు గాలిబ్ కవితలు చదవ బోతే అతడి గొంతే వినిపించింది? "నాతో సీతారామయ్య మాట్లాడలేదు. పుస్తకంలో ప్రతి కవితకీ స్పందిస్తూ సీతారా మయ్యనూహించుకున్నాను. ఆ స్పందనపై

అదుపులేక సీతారామయ్యా నన్ను బెదిరించినట్లూహించుకున్నాను" అనుకున్నాడాయన.

తనని హెచ్చరిస్తున్నది సీతారామయ్యా కాదు, అంతరాత్మ అని ఆయనకి అర్థమైంది. దాని నోరు నొక్కాలని చూసాడు. కుదరకపోతే మత్తిచ్చి నిద్రపుచ్చాలనీ చూసాడు. లొంగకుండా తప్పులెన్ని అదే పనిగా వేధిస్తుంటే- "ఇలా చంపకు. చేతనైతే పరిష్కారం చెప్పు" అని అరిచాడు.

"జలంధరుడికి బృందలా, ఇంద్రజిత్తుకి సులోచనలా, జమదగ్నికి రేణుకలా, కౌశికుడికి సుమతిలా- మాలతే నీకు పరిష్కారం" అంది అంతరాత్మ.

అప్రయత్నంగా, "మాలతీ!" అంటూ గట్టిగా అరిచాడు భూపతి.

అదెంత దూరం వినిపించిందో ఏమో- పనివాడు పరుగున లోపలికొచ్చాడు. పిలిచారా అన్నాడు. బాత్రూంకి వెళ్ళాలా అన్నాడు. తినడానికేమైనా కావాలా అన్నాడు. మాలీసు కావాలా అన్నాడు. అన్నింటికీ కాదంటుంటే ఏంచేయాలో తెలియనివాణ్ణి చేతిసైగతో పొమ్మని పంపేసాడాయన.

"మాలతి పిలిస్తే రాదు, ఫోన్ చెయ్యాలి" అంది అంతరాత్మ. సరేనని ఫోన్ చేద్దామా అనుకున్నాడో లేదో- ఫోన్ తనంతట తనే మోగింది.

వంట్లోని రక్తం చిక్కబడేలా భూపతికి ఒళ్ళంతా చెమటలు. ఒంటిలోపల వణుకు.

రిసీవర్ తీస్తే, "టైము నాలుగైందని ఫోన్ చేసాను. ఎలా ఉన్నావ్? " సీతారామయ్యా పలకరింపు.

భూపతికి మిడిగుడ్లు పడ్డాయి.

తనకొచ్చే ఫోన్ భ్రమట. భ్రమని అదుపు చేస్తే ఇక ఫోన్ రాదట. అదుపు చేయకపోతే ఊహలో ప్రమాదం వాస్తవమవుతుందట. ఇప్పుడు సీతారామయ్యా ఫోన్. వాస్తవంలాంటి భ్రమ.

"నిద్ర పోకుండా గాలిబ్ గీతాలు చదివితే, స్వప్న ప్రపంచంలో విహరించవచ్చేమో కాని నిద్ర సుఖం దొరకదు. నీ దురదృష్టం. నిద్ర రాసిపెట్టలేదు" ఫోన్లో నిట్టూర్పు.

"నేను గాలిబ్ గీతాలు చదువుతున్నట్లు నీకెలా తెలుసు? "

"పిచ్చి ప్రశ్న. నువ్వు టీవీ ఛానెల్సు మార్చి కావాల్సిన ప్రోగ్రాం చూడవూ? నాకిప్పుడీ భూమ్మీద ఎక్కడి దృశ్యమైనా కావాలనుకోగానే చూపించే ఛానెల్సున్నాయి"

"లేదు. నువ్విక్కడికొచ్చావ్. నన్ను చూసి మాట్లాడావ్" అనుమానంగా అన్నాడు భూపతి.

"సాయంత్రం ఐదన్నాను. నాకు టైమంటే టైమే. నువ్వెంత మనసుపడ్డా ఇంకో గంట ఆగాలి నా దర్శనానికి. అందాకా ఇదిగో- ఫోన్ చేస్తున్నాగా? " ఫోన్లో నవ్వు.

"ఎందుకురా- నన్నిలా ఫోన్లతో వేధిస్తున్నావ్? " భూపతి గొంతులో దైన్యం.

"జీవితమంతా వేధించావ్. కిమ్మనలేదు. ఈ ఒక్కరోజూ నాది. కిమ్మనకు"

"నీ సహనం నాకు లేదు. ఏం చేస్తే ఈ ఫోన్లు మానేస్తావో చెప్పు"

"నీ డిటెక్టివ్ వివరాలు తెలుసుకుని చెప్పాడే. ఆ నా బిడ్డ జోలికెళ్లనని మాటియ్యి"

"ఆ విషయం నీకెలా తెలుసు? " భూపతి ఆశ్చర్యం.

"ఇప్పుడు నేను విశ్వవ్యాపిని"

"అయితే నా డిటెక్టివ్ నిజమే చెప్పాడన్న మాట" భూపతి గొంతులో అనుమాన నివృత్తికై తపన.

"ఆс అక్షరాలా నిజం. సాయంత్రం

ఆరింటికి మొత్తం సమాచారంతో వస్తున్నాడు."

"మరి నువ్వు నన్ను ఐదింటికే చంపేస్తే?" భయాందోళనల్ని వెటకారంగా మలిచే ప్రయత్నం.

"అది నీ కర్మ. దానికా డిటెక్టివేం చేస్తాడు?" ఫోన్లో నవ్వు.

"అంటే- నన్ను చంపగలననే? పిచ్చి ఆశలు పెట్టుకోకు. ఇలా కబురందగానే అలా నీ మూడో కొడుకుని కాలికింద చీమలా నలిపేస్తాను".

"అంటే నీలో ఇంకా రవంతైనా పశ్చాత్తాపం లేదన్నమాట" ఫోన్లో నిట్టూర్పు.

"దైవాంశ సంభూతుణ్ణి. నాకు పశ్చాత్తాపమా?" భూపతి గొంతులో నిరసన.

"దైవాంశ సంగతికేంకానీ ఏకంగా దేవుణ్ణే చూద్దువుగాని ఇంకో గంటలో!"

"గంటెందుకూ. చేతనైతే ఇప్పుడే చూపించు" భూపతి సవాలు.

"కుదరదు. నేను మాటంటే మాటే. ఇన్నాళ్లూ అబద్ధాలు చెప్పి నువ్వు నాతో ఆడుకున్నావ్. ఇప్పుడు నా వంతొచ్చింది. నేను నీతో ఆడుతున్నా, నిజాలు చెప్పి!"

"సాయంత్రం ఆరు దాటేసరికి నీ నిజాల ఆట కట్టు!" నవ్వాడు భూపతి.

"అంటే నువ్వు చచ్చి గంటయ్యేక" ఫోన్లో హెచ్చరిక.

"అదే జరిగిందనుకో. అప్పుడు నేనూ మానవాతీత శక్తినై నీ మూడో కొడుకు అంతు చూస్తాను"

"ఓర్నీ- ఆ రూట్లో వచ్చేవా? అంటే నీ బుద్ధి పుడకలతో కూడా పోదన్నమాట!" ఫోన్ కట్టయింది. భూపతి ఇంకా, "హలో, హలో" అని ఉక్రోషంగా రిసీవర్ పెట్టేశాడు.

"భయపడకు. ఇక సీతారామయ్య నుంచి ఫోన్లు రావు. ఐదయ్యేక తనే వస్తాడు" అంతరాత్మ ఓదార్పు. ఆ ఓదార్పులోంచీ భయం పుట్టి పెరుగుతోంది. తొలగించాలంటే అందడం లేదు. మెదడులో కెడితే గుండెలో కొట్టుకుంటుంది. గుండెలోకెడితే నరాల్లో కదలాడుతుంది. నరాల్లోకెడితే మెదడులో దూరుతుంది. ఒకటే దోబూచులాట!

ఐదు... ఐదు... ఐదు...

ఐదన్న పదం తల్చుకుంటే ఏదో తెలియని బెంగ.

భూపతి చేతి గడియారం చూస్తే అందులోని అంకెలన్నీ అలుముకుపోయినట్లనిపించాయి. గోడ గడియారం చూస్తే ఉన్నట్లుండి అది ఊపందుకుంది. నిముషాల ముల్లు సెకన్ల ముల్లులా గిరగిరా చకచకా తిరిగిపోతోంది. ఆయనకి- తన భర్త ప్రాణాలు కాపాడ్డానికి సూర్యగమనాన్నే ఆపిన సతీసుమతి గుర్తుకొచ్చి, "ఓ గడియారమా! నిన్ను కొన్నది నేను. ఏళ్ళ తరబడి నిర్విరామంగా తిరుగుతూ సేవిస్తున్నావ్. ఈ రోజూ కాసేపు ఆగి నా ఆయువు పెంచు" అన్నాడు.

అడగడంలోనే తేడా తెలిసిపోయిందాయనకి- సుమతిది శాసనమైతే తనది ప్రార్థన!

అప్పట్లో ఒక ఆడదాని శాసనానికి సూర్యుడెలా కట్టుబడ్డాడో గానీ- ఇప్పుడు గడియారం భూపతి ప్రార్థన లెక్క చేయలేదు. నిముషాల ముల్లు శరవేగంతో తిరిగిపోతోంది.

భూపతి మనసులోంచి ఆరు ఎప్పుడో తప్పుకుంది. ఇప్పుడాయన ఐదుకి దగ్గరైపోతున్నానని భయపడుతూ బెల్ కొట్టి పనివాణ్ణి పిలిస్తే వాడొచ్చి సలాం చేశాడు.

"ఇంట్లో కుక్క తిరుగుతోందా?" అడిగాడు భూపతి. ఊఁ అన్నాడు వాడు.

"తోటలో?"- ఊఁ అన్నాడు వాడు.

"సెక్యూరిటీకి చెప్పు. మనింట్లో వాళ్లని తప్ప ఇంకెవర్నీ ఇంట్లో అడుగు పెట్టనివ్వ



ధ్వని"- ఊc అన్నాడు వాడు.

"ఇంట్లో కుక్క తిరుగుతోందా? " మళ్లీ అడిగాడు భూపతి. మళ్లీ ఊc.

అవే ప్రశ్నలు, అవే జవాబులు. చెప్పానుగా అనలేదు పనివాడు. ఈ రోజు మీకేమైందనీ అనలేదు. ఎదురు ప్రశ్నలేయకుండా అడిగిందానికి బదులివ్వడం వాడి ఆరోగ్య రహస్యం.

చివరికాయన వెళ్ళమన్నాడు. వెళ్లాడు వాడు.

మళ్లీ భూపతి ఒంటరి. ఒంటరితనంలో ఆలోచనలు. వాటిలో జీవిత విశ్లేషణ.

తను వైభవోపేతమైన జీవితాన్ని తృప్తిగా అనుభవించక, సీతారామయ్య



నాశనానికి అంకితం చేస్తే, సీతారామయ్య ఉన్నంతలో తన వాళ్లతో కలిసి జీవించాడు. అదెంత గొప్ప అనుభూతినిస్తుందో తెలిసొచ్చేసరికి- జీవితమే కోల్పోయే పరిస్థితి. "తప్పు చేసానా? " అనుకున్నాడాయన.

గతంలో రాజులు రాజ్య విస్తరణ కాంక్షతో యుద్ధాలు చేసారు. క్రీడా వినోదమని వేటాడారు.

ఆ హింసాప్రవృత్తిని నిరసించడానికి మారుగా- కవులు వారి ప్రతాపాన్నీ, నేర్పునూ కీర్తించారు. సీతారామయ్య విషయంలో తనూ అదే చేసాడు, చేస్తున్నాడు. "నాది రాజసం. నేను కావ్యనాయకుణ్ణి. కవులు కీర్తించే గొప్పపనులు నేనింకా చాలా చేయాల్సుంది. వాటిలో ఒకటి ఈ సాయంత్రం ఆరింటికి ప్రారంభించాలి" అనుకున్నాడాయన, మనసుకి ధైర్యం చెప్పే ప్రయత్నంలో.

కానీ ఆరు అనుకోగానే ఆయన ఆలోచనలకో పెద్ద అడ్డుగోడ. ఐదు! దాన్నాయన దాటలేకపోతున్నాడు. ఊహల్లో గడియారం ఐదు దాటి ఒక్క సెకను కూడా ముందుకెళ్ళడంలేదు.

అప్పుడు టైము నాలుగూ నలభై... నలభై ఐదు...

"కాలమా స్తంభించు" ఆయన ప్రార్థన.

"స్తంభిస్తా- ఐదింటికి" కాలం జవాబు- వాగ్దానంలా కాక బెదిరింపులా.

అంతలో ఫోను మోగింది. తటాపటాయిస్తూ రిసీవర్ తీస్తే- అవతల్నించి ఏ గొంతూ వినపడలేదు.

మళ్ళీ "హలో" అన్నాడాయన. అవతల లైన్ కట్టయింది.

భూపతిలో ఉద్వేగం. ఎవరిదా ఫోన్? గొంతు విని ఫోన్ పెట్టేసాడనుకుంటే అసలెందుకు ఫోన్ చేసినట్లు? లైన్ కట్టయిందనుకుంటే మళ్ళీ వెంటనే ప్రయత్నించడేం?

భూపతిలో బెంగ- ఆ ఫోనేమిటో తెలుసుకునేలోగానే తను....

టైము నాలుగూ యాభై.... యాభై ఐదు.....

భూపతిలో మృత్యుభయం. శరీరంలో వణుకు.

ధైర్యం కోసం చుట్టూ చూస్తే- ఆ గదిలో తాను ఒంటరి. ధైర్యం పారిపోయింది.

పనివాణ్ణి పిలవడానికి బెల్ స్విచ్ నొక్కబోతే చెయ్యి లేవలేదు. పిలుద్దామంటే గొంతు పెగలలేదు.

సరిగ్గా అప్పుడే దూరంగా అడుగుల చప్పుడు....

ఎవరది- పనివాడా? పిలవకుండానే వస్తున్నాడా?

మాలతా- హృదయరాణిగా తన హృదయ ఘోష విని వస్తోందా?

తన వాళ్ళలో మరెవ్వరైనా- రక్తపాశమహిమ త్వరపెడితే చూడాలనొస్తున్నారా?

ఐతే ఆయనకు తెలుసు- ఆ వచ్చేదెవరో! ఇతరులను స్మరించి దృష్టిమరల్చే ప్రయత్నాలెన్ని చేసినా- ఆయన ఆలోచనల్లోంచి సీతారామయ్య తప్పుకోవడంలేదు.

ఆ అడుగుల చప్పుడు అక్షరాలై, పదమై- సీతారామయ్య, సీతారామయ్య- అంటూ ధ్వనిస్తోంది.

"వచ్చేది సీతారామయ్య కాదు" భూపతి. ఇంకా తన మనసుకి నచ్చజెపుతున్నాడు.

ఇంటి చుట్టూ కాపలా. తోటలో కుక్క. ఇంటిలో కుక్క.

ఆపైన బయటివాళ్ళనెవర్నీ ఇంట్లో అడుగుపెట్టనివ్వద్దని తన శిలాశాసనం!

అడుగుల చప్పుడు మరింత దగ్గరైంది. ఆ చప్పుడాయింటికి కొత్తకానీ ఆయనకి కొత్త కాదు.

హైస్కూల్లో తన అడుగులకి జతగా పడ్డ అడుగులవి.

స్పెషల్ ఫొటోకి పక్కనున్న బాలుడు... తుస్సుమన్న అటకవీరుడు... ఆకాశరామన్న ఉత్తరంతో తన తండ్రిని కలిసిన ధీరుడు... మాలతి ఇంటికీ ఆమె అన్న ఇంటికీ ప్రదక్షిణాలు చేసిన మగాడు...

అడుగుల చప్పుడు పెద్దదవుతోంది.

ఎన్నో జ్ఞాపకాలు... వాటిని అణచివేస్తూ ఇంకా ఇంకా పెద్దదవుతున్న అడుగుల చప్పుడు...

"నో- సీతారామయ్య అయ్యుండడు... ఎవరో ఇంకెవరో?" భూపతి మనసుకి సర్ది చెబుతున్నాడు.

దానికి బదులుగా- "నన్ను వెతికి వేటాడేవాడివి. ఇప్పుడు నన్ను చూడాలంటేనే భయమేస్తోందా?" అంటూ ఊహలో కూడా సీతారామయ్య పరిహాసమే వినిపిస్తోంది.

అడుగుల చప్పుడు.... ఇంకా ఇంకా దగ్గరౌతోంది. అది నిజమా... తను భ్రమపడుతున్నాడా?

అడుగుల చప్పుడు.... ప్రళయనాదంలా...

భూపతి మెదడులో ఎన్నో దృశ్యాలు సినిమారీళ్ళలా పరుగెడుతున్నాయి. వాటిలో...

సీతారామయ్య రుక్మిణితో ఏడడుగులు వేస్తున్నాడు. అతడి కూతురి మెడలో ఓ గుమస్తా తాళి కడుతున్నాడు. అతడి కొడుకు హాస్పిటల్లో డాక్టరు చెప్పిన మందులు కలుపుతున్నాడు.

అది తన వేట. తన ప్రతాపం. కానీ.... ఉన్నట్లుండి ఓ దివ్యతేజం....

సుమారు పదిహేడేళ్ల యువకుడు. పచ్చని మేనిఛాయ. ముఖంలో జ్ఞానసూర్యుడు.

"నాన్నా! నువ్వు నన్ను రక్షించు. నిన్ను నేను ఉన్నత శిఖరాలకు చేరుస్తాను" అంటున్నాడు.

"నీకు నా రక్షణ ఉంది. భయపడకు" సీతారామయ్య గొంతు.

"కానీ- నాకీ సాయంత్రం ఆరింటికి చాలా పెద్ద గండముంది నాన్నా!" అంటు న్నాడు. ఆ గొంతులో కలవరం.

"ఆ గండానికి అడ్డుగోడ కడుతున్నాను. ఐదింటికల్లా పూర్తౌతుంది" సీతారామయ్య లాలన.

భూపతి చప్పున గడియారం వైపు చూడబోతే- గది గుమ్మంలో అస్పష్టంగా ఓ ఆకారం. కళ్ళు నులుముకుని చూస్తే- ఆకారం క్రమంగా స్పష్టమై పరిచితమైన ముఖంగా మారింది.

పరిచితమైన అడుగుల చప్పుడు- క్రమంగా గుమ్మం నుంచి మంచంవైపుకి...

"భూపతీ- వచ్చేసాన్రా!" అది సీతారా మయ్య గొంతు. ఫోన్లో కాదు- కంటికెదు రుగా...

భూపతికి మిడిగుడ్లు పడ్డాయి. మరి మూసుకోలేదు.

అప్పుడు టైము సరిగ్గా ఐదయింది.




**లె**క్కకి మించిన జనానికి ఆ లంకంత కొంప పుష్పక విమానంలా చోటిస్తోంది.

అయినవాళ్ళు, అవసరార్థులు, సుపరిచి తులు, అపరిచితులు- అంతా భూపతి కోసమే!

మాటలు, కన్నీళ్ళు, ఏడ్పులు, పొగడ్తలు- అన్నీ భూపతి గురించే!

భూపతి అందర్నీ చూస్తున్నాడు. ఒక్కరూ ఆయన్ని పట్టించుకోవడంలేదు.

ఆయన ఇల్లంతా తిరిగి తోటలోకెడితే కుక్కలాయన్ని చూసి మొరిగాయి. ఆప్యా యంగా నిమురుతూంటే- "ఎందుకూరికే మొరగడం? " అంటూ పనివాళ్ళు వాటినా యన్నించి వేరుచేసారు. ఐనా అవి మొరు గుతున్నాయి. పనివాళ్ళు మాత్రం ఆయన్ని పట్టించుకోలేదు.

"వీళ్ళు నన్ను పట్టించుకోవడంలేదు. మాలతికి చెప్పాలి" అనుకున్నాడాయన.

అంతే- ఆయన ఓ పెద్ద హాల్లో ఉన్నాడు. అక్కడుంది. మాలతి.

ఆమె చుట్టూ మనుషులు- ముక్కులు చీదేస్తూ, మాలతి వాళ్ళని ఓదార్పుతూ- "ఆయనకేడుపంటే అసహ్యం. ఎక్కడున్నా ఆయన నన్ను చూస్తూనే ఉంటారు. ఆయన చూస్తూండగా నేనేడ్వను" అంది గంభీరంగా.

"నిజం మాలతీ! నేను నిన్ను చూస్తున్నా. నువ్వూ నన్ను చూడు" అంటూ భూపతి మాలతివైపు నడిస్తే ఎవరూ దారివ్వలేదు. తనే ఎలాగో దారి చేసుకుని ఆమెని సమీపించి మళ్లీ పిలి చాడు. మాలతి అందర్నీ చూస్తోంది. ఆయన వైపు చూడలేదు. ఆయన మాట వినలేదు.

"ఇలా అర్థాంతరంగా చచ్చిపోతావనుకో లేదు నాన్నా!" ఉమ శోకాలు.

"నన్నెదురుగా పెట్టుకుని చచ్చేనంటా వేంటి? " చిరాగ్గా కసిరాడాయన. ఉమ ఏడుపు ఆగలేదు.

"ఇక మీదట రోజూ అంతా కలిసి చిల్లో బొల్లోమంటూ ఉండాలన్నావ్. ఇలా కుయ్యోమొర్రో మనేలా చేసి నీదారి చూసు కున్నావ్" ఉమేష్ కళ్లు తుడుచుకున్నాడు.

భూపతి అతడి భుజం తట్టబోగా "బాబూ, భూపతిగారెక్కడ? ఆ మహాను భావుణ్ణి కడసారి దర్శించుకోవాలి" అన్నా డొకాయన.

"ఈయనికి బాడీ చూపించండి" అన్నారె వరో.

"నేనెదురుగా ఉంటే బాడీ అంటారే మిటి? " అనుకుంటూనే భూపతి ఆయన్న నుసరించి వెడితే- మూసిన కళ్లు. ముక్కులో దూది. ఒకచోట నేలమీద పడు కుంది భూపతి శరీరం. ఎవరెవరో వచ్చి ఒకొక్కరుగా ఆ శరీరానికి ప్రదక్షిణం చేసి భక్తిగా నమస్కరించి వెడుతున్నారు.

"అయ్యో- ఆయనెవరో కానీ అచ్చం నాకులాగే ఉన్నాడు. ఇక్కడున్న వాళ్లంతా ఆయనే నేనన్న భ్రమలో ఉన్నారు" అను కున్నాడు భూపతి.

అప్పుడు- సీతారామయ్య ఆత్మ ఫోన్ చేసి బెదిరిస్తున్నట్లు తనకి భ్రమ. ఇప్పుడు- బ్రతికున్న తను చచ్చిపోయినట్లు తనవారిందరి భ్రమ. వాళ్లనా భ్రమలోంచి బయటపడేయాలి? ఎలా? భూపతి చూస్తూండగా ఆయన కళ్లెదుటే - అచ్చం భూపతిలాగే ఉన్న ఆ శరీరానికి దహనసంస్కారం జరిగింది. కర్మకాండ పూర్తయింది. ఒకొక్కరుగా బంధుజనం వెళ్లిపోయి లంకంత కొంపలో లంకా సురులే మిగిలారు. ఎప్పటి రోటీన్‌లో మసలుతున్నారు. మధ్య మధ్య భూపతి వాళ్లలో ప్రతి ఒక్కర్నీ పలకరించి తన గోడు వినిపిస్తున్నాడు. వాళ్లాయన్ని శూన్యంలా చూస్తున్నారు. మధ్య మధ్య చనిపోయిన భూపతిని తల్చుకుని కంట నీరు పెడుతున్నారు.

అంతమంది తనని గుర్తించడంలేదంటే- భ్రమ వాళ్లదా, తనదా? "నేను గానీ నిజంగా చచ్చిపోలేదు కదా!" అని క్రమంగా భూపతికి అనుమానమొచ్చింది.

గతాన్ని నెమరెసుకుంటే- సీతారామయ్య తనని సమీపంచి, "భూపతీ- వచ్చేసా(న్రా!" అనడం గుర్తుంది. ఆ వెంటనే తనకేదో అయ్యింది. అదే మరణమా?

"నేను చచ్చిపోతే- మరిప్పుడు నేనె వరు? " భూపతిలో అయోమయం.

ఈ సంపద.. ఈ వైభవం.. దీనితో రుణం తీరిపోయిందా?

"నా చావు నిజమేనేమో! కానీ అది సహ జమరణం కాదు. సీతారామయ్య నన్ను చంపాడు. ఇక్కడ నా వాళ్లెవరూ దాని గురించి మాట్లాడరేం? వాడు చచ్చి దెయ్యమై నన్ను చంపడం వల్ల అసలు విషయం ఎవరికీ తెలియడం లేదా? నేను బ్రతికుండగా- చచ్చి కూడా కనిపించిన సీతారామయ్య ఇప్పుడు నాకు కనిపిం చడేం? అసలిపుడు నేనెవర్ని? నన్నెవరు చూస్తారు? " భూపతి ఆక్రోశం. అంతే- ఉన్నట్లుండి ఆయన చుట్టూ కొత్త మను షులు. ఒకరు కాదు... ఇద్దరు కాదు... ఎందరో... వాళ్లలో సుపరిచితులున్నారు. అపరిచితులున్నారు.

పరిచితులనాయన గుర్తుపట్టాడు- వాళ్లందరూ చనిపోయినవాళ్లే. "ఇంతసేపూ ఒక్కరు లేరు. ఉన్నట్లుండి ఇప్పుడింత మంది ఎక్కణ్ణుంచొచ్చారు? " ఆశ్చర్యంగా అడిగాడు భూపతి.

"నీది లేత ప్రేతాత్మ. ప్రాణం పోయి నట్లు నీకింకా తెలియదు. చూస్తే భయప డతావని ఇంతసేపూ కనపడలేదు. ఇప్పుడి ప్పుడే నిజం తెలుసుకుంటున్నావని కని పించాం" అన్నాడో పరిచితుడు.

"అంటే నేను నిజంగా చనిపోయానా? "

"అం.. నీ చావు అక్షరాలా నిజం"

"మరి నేనిప్పుడెక్కడున్నాను"

"చనిపోయినవారుండేచోట"

"ఇక్కడ మనమేం చేస్తాం? "

"తెలియదు"

"తెలియకుండా ఎలా బ్రతుకుతాం? "

"బతుకు బ్రతికున్నవాళ్ళకి"

"మరి మనమేమౌతాం? "

"అది ఎవరికివారు తెలుసుకోవాల్సిందే!"

అర్థమైంది భూపతికి. మానవ జన్మ ఉత్కృష్టం. రసభరితం. సృష్టిలో అలాంటిది మరొకటి లేదు. ఇప్పుడు తనకి జీవితం రసహీనం. అర్థ విహీనం. ఎలా గడపాలీ భయంకర జీవితాన్ని? అప్పుడు భూపతికి సీతారామయ్య గుర్తుకొచ్చి ఆయన గురించి వాకబు చేసాడు. ఆయన తనకంటే ఒకరోజు ముందు పోయాడని చెబితే, "లేత ప్రేతాత్మ కదా- తన ఇంటి చుట్టూ పరిభ్రమిస్తూండొచ్చు" అని జవాబొచ్చింది.

"అరే, నాకింతవరకూ ఇది స్ఫురించలేదే? " అనుకున్నాడు భూపతి. అనుకున్న మరుక్షణం ఆయన సీతారామయ్య ఇంట్లో ఉన్నాడు. అక్కడ సీతారామయ్యని చూసి, "నేను నా ఇంట్లో... వీడు తనింట్లో... ఇలా తిరుగుతున్నాం" అని నవ్వుకున్నాడు. తనూ ఆయన్ని హడలగొట్టాలని, "ఒరేయ్- నేనూ వచ్చేసాన్రా!" అంటూ రెండు చేతులూ ఆయనవైపు సాచాడు.

సీతారామయ్య భూపతిని పట్టించుకోకుండా తనవాళ్లతో ముచ్చటిస్తున్నాడు. ఆయన ముఖంలో, వాళ్ల ముఖాల్లో చెప్పలేనంత సంతోషం!

ఆయన్ని పలకరించి బెదించాలని మరి కొన్ని ప్రయత్నాలు చేసాక- సీతారామయ్యకి తను కనబడ్డం లేదనీ, ఆయన తన వాళ్లకి కనబడుతున్నాడనీ అర్థమైంది భూపతికి. అంటే సీతారామయ్య ఇంకా బతికేవున్నాడు. అదీ ఉత్సాహంగా, తనవాళ్లతో సుఖసంతోషాల మధ్య!

"నేను కోరి పొందలేకపోయిన జీవిత మిది. సీతారామయ్య అనుభవిస్తున్నాడు" భూపతిలో అసూయ, ఉక్రోషం. వాటి లోంచి దుఃఖం. క్రమంగా ఆ దుఃఖం కోపంగా మారింది.

ఆయన సీతారామయ్యని శాపనార్థాలు పెట్టసాగాడు. గట్టిగా ఇల్లదిరిపోయేలా అరిచి అరిచి అలిసిపోయాడు కానీ సీతారామయ్య మీద ఏ ప్రభావం లేదు. రొప్పుతూ శాపనార్థాలు ఆపి నిస్పృహాయంగా చూస్తుంటే వినిపించాయి పొగడ్తలు. అవీ భూపతినుద్దేశించి.

సీతారామయ్యే కాదు. ఆ ఇంట్లో అంతా భూపతిని పొగడ్తలతో ముంచెత్తుతున్నారు.

"ఇంతలా పొగడ్డానికి వీళ్ళకి నేనేం చేసాను? " అని ఆశ్చర్యపడుతూ అక్కడున్న వారందర్నీ ఒక్కొక్కరుగా చూసాడు భూపతి.

డాక్టరవుదామనుకుని తన మూలంగా కాంపౌండరైన శేఖర్. ఇప్పుడు భూపతి దయవల్ల మందుల షాపు పెట్టుకున్నాట్ట.

అమెరికా వెళ్ళబోయి ఇండియాలో గుమస్తా భార్యగా స్థిరపడ్డ శారద. భూపతి దయవల్ల ఆ గుమస్తా ఇప్పుడో పెద్ద కంపెనీలో మేనేజరయ్యాట్ట.

ఇంకా సీతారామయ్య భార్య, అల్లుడు, కోడలు, మనుమలు. అందరికీ లభించింది భూపతి దయ. ఇంకా అక్కడ ప్రసాద్. సీతారామయ్య మూడో బిడ్డ. తండ్రి జీన్సుతో వచ్చిన హీరో పర్సనాలిటీ. చదువు తేజస్సుతో కాంతులీనుతున్న ముఖం. భూపతి దయతో ఐటీలో చేరతాట్ట!

ఈ ప్రసాద్ పుట్టుక రహస్యం, పెరుగుదలా రహస్యం. వీడికోసం ఎంతగానో అన్వేషించాడు.

ఆచూకీ తెలిసేక వీణ్ణి చంపాలని చావునే జయించాలనుకున్నాడు. కానీ తనే చచ్చిపోయాడు. వీడు కూడా అంతా తన దయ అంటున్నాడు.

"నా దయ ఎలాగుంటుందో ఇప్పుడు చూపిస్తా" భూపతిలో ఆవేశం. ఆయన ఉన్నచోటునించే చేతులు జాపాడు. అవి పొడుగ్గా సాగి ప్రసాద్ పీక పట్టుకున్నాయి. ఆవేశాన్ని బలంగా మార్చి- ఆ బలమంతా ఉపయోగించి అతడి గొంతు నులిమాడు. ప్రసాద్ చెక్కు చెదరలేదు.

"భూపతి దయ, భూపతి దయ"- అతడి నోటినుంచి పొగడ్తలు ఆగడం లేదు.

చేతులు వెనక్కి తీసుకుని ఎగిరి ప్రసాద్ మీద దూకాడు భూపతి. ప్రసాద్ చెక్కు చెదరలేదు.

"భూపతి దయ, భూపతి దయ"- అతడి నోటినుంచి పొగడ్తలు ఆగడం లేదు.

భూపతి ఆవేశం అణగారింది. క్రమంగా అది ఆశ్చర్యంగా మారింది.

"ఎందుకురా- మీరంతా నన్ను పొగుడుతున్నారు? " అరిచాడాయన.

అది భ్రమో- నిజమో- ఆయన సందేహానికి సమాధానాలు మొదలయ్యాయి.

"నాన్నో! ఏదో అదృశ్యశక్తి నామీద పగ బట్టింది. జీవితం నాశనమౌతుంటే- ఒక్కసారి కాదు, ఎన్నోసార్లు- ఆత్మహత్య చేసుకోవాలనుకున్నా. కానీ నువ్వు- కూడు, గుడ్డ, నీడ ఉన్న మనిషి చావు గురించి ఆలోచించరాదన్నావ్. చచ్చి సాధించేదేమీ ఉండదన్నావ్. జీవితమనే ఆటలో గెలుపు లక్ష్యమేకానీ పరమార్థం కాదన్నావ్. లక్ష్య సాధన జీవితానికి ఊపిరి పోస్తుందనీ, మంచిని విడువని మనిషికి మంచిరోజులొస్తాయనీ అన్నావ్. నీ మాటలు గీతావాక్యాలై నాకు కర్తవ్యబోధ చేసాయి. ఫలితం ఈ రోజు కనిపిస్తోంది" అన్నాడు శేఖర్.

"నిజం నాన్నా! ఆ మధ్య ఇండియాకి క్రికెట్లో వరుస పరాజయాలు. ఇప్పుడు వరుస విజయాలు. గెలుపే పరమార్థమనుకుంటే ఇండియా ఎప్పుడో క్రికెట్ మానేసుండేది" అన్నాడు ప్రసాద్.

"బాగా చెప్పావ్. నాకిప్పుడు జీవితమొక రంగుల కల. ఒకప్పుడు కొండ అంచున ఉన్నట్లూ, ఒక్కడుగు ముందుకేస్తే లోయలో పడిపోతాననీ భయపడేవాణ్ణి. ఇప్పుడు నాకు ఎక్కాల్సిన మెట్లు ఇంకా చాలా ఉన్నాయనిపిస్తోంది. అన్నీ ఎక్కగలననీ అనిపిస్తోంది" అన్నాడు శేఖర్.

"అంతా భూపతి దయ. అది మర్చిపోకు" హెచ్చరించాడు సీతారామయ్య.

"భూపతి దయ, భూపతి దయ"- ఆ మాట వినడం ఇబ్బందిగా ఉంది భూపతికి.

సీతారామయ్యని అణగద్రొక్కడం తన జీవితాశయం. ఇప్పుడు తనకి జీవితమూ పోయింది. ఆశయమూ నెరవేరలేదు. తానిలా చనిపోగానే అలా ఎదగడం మొదలెట్టాడు సీతారామయ్య. అందుకతడూ, అతడి కుటుంబ సభ్యులూ తనని పొగుడుతుంటే సిగ్గేస్తోందే తప్ప సంతోషంగా లేదు.

ఆ సిగ్గులోంచే భూపతిలో చిన్న ఆశ- సీతారామయ్యని ఆయనింట్లో వాళ్ళు గుర్తించినట్లే ఇప్పుడు తనవాళ్ళూ తనని గుర్తిస్తారేమోనని.

అలాగనుకుని తనింటికెడితే పనివాళ్ళతో సహా అక్కడెవరూ ఆయన పేరైనా స్మరించడం లేదు. ఎవరి పనులువారివి, ఎవరి ఆలోచనలు వారివి.

భూపతి మనసంతా బాధ. తనవల్ల పైకొచ్చిన తనవాళ్ళెవరూ తననిప్పుడు తల్చుకోవడం లేదు. తనవల్ల నాశనమైపోయిన సీతారామయ్య కుటుంబ సభ్యులందరూ తనని పొగుడుతున్నారు.

జీవితంలో తన అంచనాలు తప్పయ్యాయా? తను తప్పు చేసాడా?

తను తప్పు చేసాననుకుందుకాయనకి మనస్కరించలేదు. అందువల్ల ఆయన ఆలోచనలు అర్థవంతమైన విశ్లేషణకి సహ

కరించలేదు.

తనవాళ్ళు తనవాళ్ళనుకున్నవారెవరూ తనవాళ్ళు కారు- 'నాతి చరామి' అన్న వేద మంత్రంతో తనదాన్ని చేసుకున్న మాలతి తప్ప! ఆమె తన అదృష్టం, సర్వసం.

తనామెని ప్రేమించాడు. ఆమె సీతారామయ్యని ప్రేమిస్తే- సీతారామయ్యని అణగద్రొక్కాలనుకున్నాడే తప్ప ఆమెని ద్వేషించలేదు. తన ఇల్లాలైనా- ఆమె మనసులో సీతారామయ్యకి స్థానముందని తెలిసీ ఆమెకి ఇంట్లో గౌరవస్థానమిచ్చాడు. ఆమె సాన్నిధ్యంలో ప్రతిక్షణం మధురమే! ఆ మాధుర్యం తనివి తీరక- మనసింకా ఆమె సాన్నిహిత్యాన్ని కోరుతోంది.

తను చనిపోయి చాలా రోజులైంది. భూపతిగా ఇంకెన్నాళ్ళో ఉండలేడు. క్రమంగా పాతవాసనలు తొలగిపోతాయి. పేరు కూడా మర్చిపోతాడు. ఆ తర్వాత మరేమవుతాడో?

ఇంకా మాలతి మీద మోజు చావని భూపతి- పాత వాసనలున్నంతకాలం మాలతినే అంటిపెట్టుకుని ఉండాలనుకున్నాడు.

ఆమె ఉదయం నిద్రలేచి స్నానానంతరం దేవుడి గదిలో ఉన్న భర్త పటానికి నమస్కరించింది. ఫలహారం, భోజనం వీలునుబట్టి తనవారితో కలిసి చేస్తుంది. పగలు, రాత్రి పడుకోబోయే ముందు పుస్తకాలు చదువుతుంది. ఇప్పుడిప్పుడే మళ్ళీ సమాజసేవా కార్యక్రమాల్లో పాల్గొంటోంది.

భూపతి ఆమెననుసరించే ఉంటున్నాడు. పలకరిస్తూ, తాకుతూ తనని గమనించదేం, గుర్తించదేం అని దిగులు పడుతున్నాడు. ఏదో రోజున తనని చూడగలదని ఆశపడుతున్నాడు.

మాలతి గురించి ఆయనలో ఎన్నో ప్రశ్నలు, అవామెను చేరడంలేదని ఆయన బాధ.

చనిపోయినవారు దెయ్యాలైతే తమవారికి కనిపిస్తారంటారు. కానీ తను ప్రాణప్రదమనుకున్న భార్యక్కూడా కనిపించడం లేదు.

★ ★ ★

ఆ రోజు ఇంట్లో మాలతి ఒక్కతే ఉంది. డ్రాయింగ్‌రూంలో కూర్చుని పేపరు చూస్తున్న ఆమెని అబ్బురంగా చూస్తున్నాడు భూపతి, ఎదుటి సోఫాలో కూర్చుని.

సరిగ్గా అప్పుడే పక్కనున్న ఫోన్ మోగితే రిసీవరెత్తిందామె. ఫోన్ మోగగానే సీతారామయ్య గుర్తుకొచ్చి ఓసారి ఉలిక్కిపడ్డాడు భూపతి. "ఎవరూ, సీతారామయ్యగారా? లోపలకు పంపండి" అన్న మాలతి మాటకి మరోసారి ఉలిక్కిపడ్డాడు.

ఫోన్ సెక్యూరిటీనుంచి అని అర్థమైందామెకు. కానీ వచ్చేది సీతారామయ్యని ఊహించలేదు.

ఇప్పుడు తను లేడని నిర్భయంగా మాలతిని కలుసుకుందుకొస్తున్నాడా?

భూపతి ఆలోచిస్తూండగానే సీతారామయ్య వచ్చాడు.

"కూర్చో" అంది మాలతి ఆత్మీయంగా.

సీతారామయ్య కూర్చోలేదు. ఆమె పక్కనున్న పనివాణ్ణి చూసాడు.

"ఈయన పేరు సీతారామయ్య. అయ్యగారి ప్రాణహితుడు"

మాలతి పరిచయం చేయగా వెంటనే నమస్కరించాడు పనివాడు.

"ఇతడి పేరు విజయబాబు. జీడిపప్పు ఉప్మా ఇతడి స్పెషాలిటీ" అంది మాలతి.

విజయబాబు మొహమాటంగా కళ్ళు దించుకున్నాడు.

"అలా సిగ్గుపడ్డం కాదు. అయ్యగారు మెచ్చుకునేలా జీడిపప్పు ఉప్మా చెయ్యాలి" అందామె.

"అందులోకి పుదీనా వేసిన కొబ్బరి పచ్చడి ఇంకా బాగుంటుంది" అన్నాడు సీతారామయ్య.

"చిటికెలో రెండూ చేసి తెస్తానమ్మా" అంటూ విజయబాబు అక్కణ్ణించి కదలబోయాడు.

"చిటికెలో చేయి కానీ చిటికెలో రాకు. పిలిచేదాకా నువ్విటు రాకు. ఎవర్నీ రానివ్వకు" అందామె.

విజయబాబు వెళ్ళగానే సీతారామయ్య నవ్వి, "చాలా తెలివిగా అతణ్ణి పంపేసావ్" అంటూ సోఫా దగ్గరకొచ్చాడు. భూపతిని గమనించకుండా కూర్చోబోయాడు. "ఇది నా చోటు- అలా పక్కగా కూర్చో" అని అరిచాడాయన. కానీ సీతారామయ్య ఆయన మీదే కూర్చున్నాడు.

భూపతికి తన పరిస్థితి అర్థమైంది. మొదటిసారిగా తన స్థానాన్ని సీతారామయ్యకొదిలి పక్కకి తప్పుకున్నాడు.

"ఉప్మా చెయ్యమని పంపాను. అందులో తెలివేముంది? " అంది మాలతి.

"జీడిపప్పు ఉప్మా ఇష్టమైంది నీకు, నాక్కాదు" నవ్వాడు సీతారామయ్య.

"తెలుసు. నేనెదురుగా ఉన్నప్పుడు నన్ను చూస్తూ జీడిపప్పు ఉప్మా తినడం నీకిష్టమని చాలా సార్లన్నావు. గుర్తుండే ఉంటుంది- అందుకే చట్నీ కూడా చెప్పావు" అంది మాలతి.

"మనం విడిపోయినప్పట్నించీ మళ్ళీ నేనా చట్నీ ముట్టుకోలేదు. ఈ రోజు నీకెదురుగా కూర్చుని ఉప్మాతినే అవకాశమొచ్చిందికదా అని చట్నీ కూడా చెప్పాను" అన్నాడు సీతారామయ్య.

మాలతి నిట్టూర్చి, "నువ్వూ నేనూ ఒకే దారిలో నడుస్తున్నాం. మనం విడిపోయాక జీడిపప్పు ఉప్మా తినడం నాకూ ఈరోజే మొదలు" అంది.

గతుక్కుమన్నాడు భూపతి. ఆయనకి జీడిపప్పు ఉప్మా చాలా ఇష్టం. కానీ మాలతి వేలేసి ముట్టుకునేది కాదు. చూస్తేనే కడుపులో తిప్పుతుందని సంజాయిషీ ఇచ్చేది.

ఎంతప్రేమో మాలతికి సీతారామయ్యమీద? ఈరోజామె భర్త చావుని తన పాతప్రియుడితో సెలబ్రేట్ చేసుకుంటోంది.

"మళ్ళీ ఇలా కలుసుకుంటామనుకోలేదు" అన్నాడు సీతారామయ్య ఉత్సాహంగా.

"కానీ నేననుకున్నా" అంది మాలతి. భూపతి మళ్ళీ ఉలిక్కిపడేలా, "గుర్తుందో లేదో- మా పెళ్ళికి ముందు నువ్వోసారి ఆయన్ని చంపాలని ప్రపోజల్ తెచ్చావు, కానీ హత్య చేయడం నీ వల్లకాదనీ, వల్లనైతే నన్ను ప్రయత్నించమనీ అన్నావు. ఆ సందర్భంగానే ఆయన భస్మాసురుడు, నేను మోహిని, నువ్వు శివుడు- అన్నావు. నా కారణంగా ఆయన నాశనమవుతాడన్నావు. ఎవరూ నాశనం చేయలేని రాక్షసులు తమని తామే నాశనం చేసుకుంటారన్నావు. అప్పుడే అది నా బుర్రలో నాటుకుంది. అమలుచేయడానికింత కాలం పట్టింది"

భూపతి వింటున్నాడు. మాలతిలో కొత్త వ్యక్తిత్వాన్ని చూస్తున్నాడాయన.

"నిజానికి నువ్వు నన్ను ప్రేమించలేదు. నేనే నిన్ను ప్రేమించి నన్ను ప్రేమించేలా చేసుకున్నాను. కానీ నా ప్రేమని చంపుకోవాల్సిన పరిస్థితేర్పడింది. ప్రేమకి చావులేదని నా నమ్మకం. ఆయన్ని పెళ్ళి చేసుకున్నాక ఆ నమ్మకం భయంగా మారింది. సమాజం నన్ను మెచ్చవచ్చు. ఆయన నన్ననుమానించకపోవచ్చు. కానీ మనసులో నిన్నుంచుకుని కాపురం ఆయనతో చేస్తే- నేను మాత్రం అపవిత్రురాలిననే భావిస్తాను. అది సంప్రదాయం నాకిచ్చిన



సంస్కారం. అందుకని పెళ్ళయ్యేక నా మనసులో నిన్ను మనిషి స్థానంనించి తప్పించి దేవుడిగా ప్రతిష్ఠించుకున్నాను. భార్యగా నేనాయనకి ఏలోటు చేయలేదు. ఇంటి బాధ్యతలు సక్రమంగా నిర్వహించాను. అయితే నీ పట్ల ఆయన ఆగడాలు శృతిమించుతూంటే- రావణుడి గురించి మండోదరి, జలంధరుడి గురించి బృంద- ఎలాగో అలాగే బాధపడ్డాను. ఆయన మూటకట్టుకుంటున్న పాపం నన్ను కలవరపెట్టేది. ఆయనకి మరణానంతరం ఉత్తమ లోక ప్రాప్తి కలగాలన్నా- అప్పటి మన పథకం అమలు పరచక తప్పదనుకున్నాను" అంది మాలతి.

భూపతి వింటున్నాడు. సీతారామయ్యని అణగద్రొక్కి మాలతి హృదయాన్ని గెలవాలనుకున్నాడు తను. తను గెలిచిన మాలతి హృదయంలో దేవుడిగా ప్రతిష్ఠించబడ్డాడతడు. అంటే అతడి చేతిలో ఎప్పుడో ఓడిపోయాడు తను.

అది తెలియక గెలుపుకోసం ఆరాటపడుతూ అతణ్ణింకా ఇంకా వేధించాడు. కానీ మాలతి తన సమస్యని ఎంత అద్భుతంగా పరిష్కరించుకుంది? సతికి పరపురుషుణ్ణి ప్రేమించడం తప్పు కావచ్చు. కానీ దేవుణ్ణి ఆరాధించడం తప్పుకాదు. అందుకని ఆమె తన ప్రియుణ్ణి దేవుణ్ణి చేసుకుని భర్తతో కాపురం చేసింది.

భూపతి ఆలోచనలకి ఫుల్‌స్టాప్ పెడుతూ, "మాలతీ! స్త్రీ హృదయపు లోతులు తెలుసుకోవడం కష్టమంటారు. ఆ విషయం నాకిప్పుడు అర్థమౌతుంది" అన్నాడు సీతారామయ్య.

"నా పరిస్థితుల్లో సంప్రదాయాన్ని నమ్మిన ఒక మామూలు ఆడదేం చేస్తుందో అదే చేసాను. నువ్వేమో హృదయపు లోతులదాకా వెళ్లావు" నవ్వింది మాలతి.

"నువ్వు సామాన్య స్త్రీవి కాదు. దేవతవి. నీవంటి దేవత నావంటి సామాన్యుణ్ణి దేవుడిగా భావించడం నా అదృష్టం" అన్నాడు సీతారామయ్య.

"నువ్వు సామాన్యుడివా? నా భర్తని మనసులో తిట్టుకో. ఆయన ఎదుటపడి ఎన్ని శాపనార్థాలైనా పెట్టుకో- కానీ నీ వాళ్లకి మాత్రం ఆయన గురించి చెడుగా చెప్పొద్దన్నాను. కష్టాల్లో అయినవాళ్లనుంచి లభించే ఉపశమనాన్నిక్కూడా దూరంచేసే కఠోరమైన కోరిక అది. అయినా నువ్వు తూచా తప్పకుండా పాటించి నిజంగా గరళకంఠుడివయ్యావు" అంది మాలతి.

మాలతి అలా కోరడం ఆశ్చర్యం! కానీ సీతారామయ్య పాటించడం ఇంకా ఆశ్చర్యం!

"అదేం కాదు మాలతీ! మా కష్టాలక్కారణం ఓ అదృశ్య దుష్టశక్తి అనే తప్ప అది మీ ఆయనేనని వాళ్లకి తెలియదు. అప్పుడప్పుడు అనుమానం పుట్టినా మొగ్గలోనే త్రుంచేసేవాణ్ణి. నీకు మాటివ్వకపోయినా అదే చేసేవాణ్ణి. భూపతి అంటే నేను మనసారా ప్రేమించిన మాలతి భర్త. అతని మీద దుష్ప్రచారం చేస్తానా, జరగనిస్తానా? "

మాలతి పాత ప్రియుడని తానతడిపై కక్ష పూనాడు. తను మాలతి భర్త అని అతడు తనకి చెడ్డపేరు రానివ్వలేదు. ప్రేమంటే అదా, ఇదా?

"నీది దివ్యప్రేమ. అందుకే నువ్వు నాకు దేవుడివయ్యావ్. నీ గొప్పతనం తెలుసు కాబట్టి నీ పట్ల ఆయన దురాగతాలు నన్ను మరింత బాధించేవి. అప్పటికీ మా పిల్లలపై ఆయన నీడ పడకుండా చూసుకున్నాను. విచిత్రమేమిటంటే నా పిల్లలన్నా నాకు ఆత్మీయతా భావం పుట్టలేదు. ఆయనకి భార్యనైనట్లే వాళ్లకి తల్లినయ్యాను. అందరి పట్లా నా విధులు సక్రమంగా నిర్వహించాను. వాళ్లకి తండ్రి బుద్ధులు రానివ్వకపోవడం కూడా నా విధి నిర్వహణలో భాగం మాత్రమే. అయితే అదృష్టం నాక్కలిసొచ్చింది. నా భర్తని కన్నతండ్రే చెడుదారిలో నడవమని ప్రోత్సహించాడు. నా భర్త మాత్రం పిల్లల పెంపకంలో కలుగజేసుకోలేదు సరికదా- నేను తన పిల్లల్ని మంచిదారిలో నడిపిస్తున్నందుకు సంతోషించేవారు. నన్నుకరించేవారో ఏమో- పిల్లలకాయనంటే పెద్దగా ఆసక్తి, అభిమానం, ఆత్మీయతాభావం ఉండేవి కాదు. అందువల్ల ఓ చెడ్డవాడికి భార్యనైన నేను- చెడ్డవాళ్లకి తల్లిననిపించుకునే అగత్యం తప్పింది" మాలతి ఆగింది.

"భగవంతుడా... ఛీ- ఎలాంటి మాటలు వినాల్సొచ్చింది? " చెవులు మూసుకున్నాడు భూపతి.

"ఆగావేం చెప్పు మాలతీ! నీ మాటలు వినడానికి బాగున్నాయి" అన్నాడు సీతారామయ్య.

"ఆయన నిన్ను అణగద్రొక్కుతూనే ఉన్నా ఆయనకి నువ్వంటే భయం. ఆ భయాన్నుపయోగించుకునేదాన్ని. ఆయన నీ పతనానికి మురిసిపోతే ఓర్వలేక- ఏదో మాట అని కలవరపర్చేదాన్ని. ఇటీవలే నువ్వు సర్వనాశనమైపోయావని బ్రహ్మానందపడిపోతున్న ఆయన్ని చూసి కసి ఆగక- నీ మూడో బిడ్డ గురించి అనుమానం రేకెత్తించాను. ఆరా తీయడా

## మే-09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. శ్రీనివాస - తిమ్మాపూర్‌పేట, రాయచూరు జిల్లా
2. డి.విజయకుమారి - ముషీరాబాద్, హైదరాబాద్
3. ఎం.రామచంద్రరావు - హిల్‌కాలనీ, పెదవూర మండలం
4. త్రిపురనేని నాగేంద్రమ్మ - రోటరీనగర్, ఖమ్మం
5. ఎం.కృష్ణమూర్తి - మున్నలూరు, కృష్ణా జిల్లా



### సరైన జవాబులు

1. మంగమ్మ 2. సీతామహలక్ష్మి 3. రసూల్ 4. బ్రహ్మయ్య 5. రంగూన్ రామారావు 6. మైఖేల్ మధుసూదన్‌దత్త 7. ఆలివర్ గోల్డ్‌స్మిత్ 8. 1911 9. సుబ్రమణ్యం 10. శ్రియ

నికాయన మురళీ అనే డిటెక్టివ్‌ని నియమిస్తే నేనెవరో తెలియనివ్వకుండానే అతడికి కొంత సమాచారమిచ్చాను. రిస్కని తెలుసు. కానీ రిస్కు లేకుండా ఘనకార్యాలు సాధించలేం కదా!"

షాక్ తిన్నాడు భూపతి. మాలతి తనకి ఛాతిలో నొప్పిరావాలని కోరుకుందా? అందుకోసం మురళికి తనే సమాచారమందించిందా? మురళీ చెప్పుకునే ట్రేడ్ సీక్రెట్ మాలతా?

"నా రిస్క్ ఫలించిందా.. ఆయనకి గుండెనొప్పొచ్చింది" అంది మాలతి.

"భూపతికి గుండెనొప్పేమిటి? ఛాతిలో నొప్పి అనాలి. వాడికి గుండె అనేది లేదని ఎప్పుడో రుజువైపోయింది కదా!" అన్నాడు సీతారామయ్య నవ్వుతూ.

మాలతికూడా నవ్వింది. అప్పుడు భూపతికి ఉందో లేదో తెలియని ఆ గుండె మండింది.

"నిజమే- ఆయనకొచ్చింది ఛాతీలో నొప్పే! కలిగిన వాళ్లమని పెద్ద హాస్పిటల్ డాక్టర్లు గోరంతలు కొండంతలు చేసి ఆయన్ని హాస్పిటల్లో ఉంచేయమన్నారు కానీ- అది మామూలు నొప్పేనని నాకు మా ఫ్యామిలీ డాక్టరు జయశంకర్ చెప్పాడు. ఆయనద్వారా వాళ్లకి నచ్చజెప్పించి మావార్ని ఇంటికి తెచ్చుకున్నాను. తర్వాత నా బుర్ర చురుగ్గా పనిచేసింది. మావారి ఆరోగ్యం ప్రమాదకరంగా ఉన్నట్లు ఆయన్ని మభ్యపెట్టమని జయశంకర్‌ని కోరాను. అలాగంటే తప్ప మావారు ఆరోగ్యాన్ని అశ్రద్ధ చేస్తారంటే ఆయనా కన్విన్స్ అయ్యాడు. అప్పట్నించీ ఆయన అనారోగ్యాన్ని గోరంతలు కొండతలు చేసి ఇంట్లో పనివాళ్లనీ, సెక్యూరిటినీ నా గుప్పిట్లోకి తెచ్చుకున్నాను. ఆయన ఆలోచనలు సక్రమంగా లేవనీ ఆయనేం చెప్పినా నాకు చెప్పకుండా అమలు చేయొద్దని వాళ్లకి చెప్పాను"

"ఇంత పకడ్బందీగా నేనే ఎప్పుడూ పథకాలు వెయ్యలేదు. ఒక ఇల్లాలు- తనని పూర్తిగా నమ్మిన భర్తని దెబ్బతీయడానికి

ఎంతకి తెగించిందీ?" ఆలోచిస్తున్నాడు భూపతి.

భూపతి వ్యవహారాలన్నీ ఆమెకి తెలుసు. ఆయన ముఖ్యానుచరగణమంతా ఆమెకు తెలుసు.

తను మంచం పట్టగానే శ్రీరామ్, గణేష్ వగైరాలందరూ ఆమె ఆదేశాలని పాటిస్తూ తన ఆదేశాలను పాటిస్తున్నట్లు నటించారు. వాళ్లెవరికీ ఆమెపై అనుమానం లేదు.

మనిషికి జబ్బు చేస్తే అనారోగ్యం అతడి ఆలోచనలకీ విస్తరించవచ్చు. తప్పుడు నిర్ణయంతో నిష్కారణంగా అమాయకుల ప్రాణాలు తీయమనొచ్చు. జబ్బు తగ్గేక అది పొరపాటని తెలిసినా పోయిన ప్రాణాలని తిరిగి పోయలేం కదా!

ఇదీ మాలతి ఆయన అనుచరగణంపై ప్రయోగించిన తర్కం.

భూపతికి భార్యంటే ఎంతో గౌరవమని ఆయన అనుచరగణానికి తెలుసు. అందుకే ఆయన మంచం పట్టగానే వారంతా ఆమె అనుచరగణంగా మారిపోయారు.

శ్రీరామ్, గణేష్, మురళీ వగైరాలందరూ ఆమె పథకంలో భాగమయ్యారే తప్ప- మాలతి భూపతి చుట్టూ ఉచ్చు బిగుస్తోందని ఒక్కరూ ఊహించలేదు.

మంచం పట్టిన భూపతికి అన్నీ కొత్త కొత్త అనుభవాలు, విశేషాలు. ఆయనకి ఇంట్లోనే ఉండి తనవాళ్లందరితోనూ సరదాగా గడపడమొక కొత్త అనుభవం. అలాంటి జీవితమే రోజూ కావాలనుకునేటంత బాగుందది. అందుకు ఇంట్లో అంతా ఒప్పుకుంటే జీవితమంటే కొత్త ఆశ పుట్టింది.

అప్పుడే సీతారామయ్య మూడో బిడ్డ ఆచూకీ తెలిసింది. అతణ్ణి అంతం చేయాలన్న కొత్త బాధ్యత కూడా జీవితం మీద ఆశ పెంచింది.

జీవితాశయాలు జీవితాశను పెంచాయో- మనిషికి పతనం ప్రారంభమైనట్లే!

పాము కరిచిన మనిషికి కూడా అది కరిచినట్లు తెలిస్తేనే విషమెక్కుతుందనటానికి విజ్ఞాన శాస్త్రంలో కూడా ఉదాహరణలున్నాయి.

సాధారణంగా ఘోరాలు చేసేవారికి దురాలోచనే తప్ప దూరాలోచన ఉండదు. జీవితాశయాలెన్నున్నా జీవితాశ తక్కువ.

జీవితాన్ని అనుభవించడమే ప్రధానమనుకున్నన్నాళ్లు భూపతి ఘోరకృత్యాలకి తటపటాయించలేదు. తనేమైపోతాడని భయపడలేదు. మంచం పట్టాక తన జీవితం గొప్పతనాన్ని, తన అదృష్టాన్నీ గుర్తించాడు. దాంతో జీవితాన్ని కాపాడుకోవాలన్న తపన కూడా ప్రారంభమైంది. వివియన్ రిచర్డ్స్, ఆడమ్ గిల్‌క్రిస్ట్, జయసూర్య, వీరేంద్ర సెహ్వాగ్, సచిన్ టెండూల్కర్ వికెట్ గురించి ఆలోచించనంతసేపూ తమ సహజధోరణిలో విజృంభించి ఆడి ప్రత్యర్థులు ప్రచండంగా బౌల్ చేసినా బౌలర్లకు సింహస్వప్నమవుతారు. తమ వికెట్ కాపాడుకోవాలన్న స్ఫురణ కలిగితే ఆ వెంటనే మామూలు బంతులకే అవుటవుతారు.

భూపతికి జీవితం విలువ తెలియగానే సీతారామయ్య ఫోన్. అప్పట్నించీ వరుసగా భయోద్వేగం పుట్టించి పెంచే సంఘటనలు. సీతారామయ్య ఎదుటికొస్తే తట్టుకోలేని మానసిక స్థితి.

తమకి తెలియకుండానే ఇందుకు మాలతికి సహకరించిన వారెందరో. మాలతి పథకం సామాన్యమైనది కాదు.

సీతారామయ్యలాంటి సామాన్యుడు భూపతిని బెదిరించే ఫోన్లు చేస్తాడంటే ఎవరూ నమ్మరు. అంతా అది భ్రమగా



# ప్యాంటీ దొంగ

ఆస్ట్రేలియాలో బ్రిస్‌బేన్‌లోని న్యూమార్కెట్ అనేచోట ఓ దొంగ ఇరవై మూడేళ్ల అమ్మాయి ప్యాంటీని అందరి ముందు దొంగలించాడు. మిస్ లిజామేరి సాయంత్రం 4.30 గంటలకు ఇంటికి నడచుకుంటూ వెళుతుంటే దొంగ ఆమెని వెనక నుంచి పట్టుకుని ఆమె గౌనుని ఎత్తి, ఆ ప్యాంటీని విప్పేసి, దాంతోపాటు ఆమె హేండ్ బ్యాగ్‌ని లాక్కొని పారిపోయాడు.

"ఆమె బేగ్ ఎత్తుకెళ్లడం అర్థం చేసుకోవచ్చు. కానీ పేంటీని ఎందుకెత్తుకెళ్లాడు? దాన్ని ఏదేని ట్రోఫీలాగా భావించాడా? ఇంతకు దానిపై ఎందుకు అతడికి మోజు? దొంగ దొరికితే కాని ఏ సంగతీ తేలదు" అని ఈ కేసుని విచారించే డిటెక్టివ్ సార్జెంట్ బ్రాడ్‌రిక్స్ హాస్యంగా కామెంట్ చేశాడు.



కొట్టిపారేస్తారు.

భూపతి ఆరోగ్యం కోసం మాలతి చేస్తున్న ప్రయత్నాలకి సహకరిస్తున్నామనే అంతా నమ్మారు. భూపతి కూడా మాలతిని అనుమానించలేదు. ఎప్పుడైనా రవంత అనుమానం పుట్టినా దాని మనుగడకి తగిన తర్కం దొరకలేదు. అందుక్కారణం అసలు తననంతం చేయడానికి లాంటి పథకమొకటి రూపుదిద్దుకొంటోదన్న విషయం ఆయన ఊహకందకపోవడమే!

మాలతి నమ్మకద్రోహి. ప్రేమించిన సీతారామయ్యని దేవుణ్ణి చేయడం సంస్కారం అనుకోవచ్చు. కానీ ఆ దేవుడి కోసం తాళి కట్టిన భర్తను తుదముట్టించడం రాక్షసత్వం.

"దేవతవనుకున్నా. దేవతలా గౌరవించా, కానీ రాక్షసిగా మారావేం? " ఆక్రోశించాడు భూపతి.

మాలతి జవాబు "మనిషి పాపాలకీ పరిమితి ఉంటుంది. ఆయనా పరిమితి దాటేశారు. ఆయన్నాపడం పతివ్రతాధర్మం. అందుకాయన మృత్యువొక్కటే మార్గం"

"నా పాపాలు, నా ఇష్టం. నువ్వెవరు వాటినాపడానికి" అరిచాడాయన.

మాలతి కొనసాగించింది, "ఇప్పుడాయన తప్పిదాలు సరిదిద్దుతాను. పాపాలకి పరిహారం చెల్లిస్తాను. మన సమాజంలో స్త్రీకి శాపమైన వైధవ్యాన్ని నవ్వుతూ భరిస్తాను. ఆయన వారసులు ఆయనకి భిన్నంగా ఉత్తములనిపించుకునేందుకు కృషి చేస్తాను. ఇంతకాలం ఆయనకి శాపనార్థాలు పెట్టినవాళ్ళు కూడా ఆయన్ని పుణ్యాత్ముడని కీర్తించేలా చేస్తాను. ఆత్మలంటూ ఉంటే ఆయన ఆత్మకి పట్టరాని సంతోషం కలిగేటన్ని పొగడ్తలు వినిపిస్తాను. పుణ్యలోకమంటూ ఉంటే దాన్నాయన చేరుకుందుకు చెయ్యవలసిందంతా చేస్తాను. ఇలా అనుకునే ఆయన అంతానికి పథకం వేశాను. నా పథకంలో తండ్రి మాటమీద తల్లిని చంపిన పరశురాముని సంస్కారముందని నా నమ్మకం. ఎటొచ్చీ ఆయన్ని మామూలుగా చంపడం సాధ్యం కాదు"

"అందుకని నన్ను రంగంలోకి దింపావు. మనమిద్దరం కలిసి భూపతిని నిర్దాక్షిణ్యంగా చంపేశాం" సీతారామయ్య నిట్టూ

ర్నాడు.

భూపతికి ఎప్పుడో అర్థమైంది- వాళ్లి ద్దరూ తోడు దొంగలని.

మాలతి తల అడ్డంగా ఊపింది, "మన మాయన్ని చంపలేదు. దేవుడాయనకి శక్తు లిస్తే వాటితో ఆయన దేవుడిలాంటి నీకు నాశనం తలపెట్టారు. లోకకంటకుడైన ఆ భస్మాసురుణ్ణి అంతం చేయాలని నేను మోహినీతాండవం చేశాను. ఆయన తన్ని తానే హతమార్చుకున్నారు"

"మాలతీ! నువ్వు చెప్పిందాన్ని బట్టి నీ భర్తలో పరివర్తన వచ్చింది. మృగంనించి మనిషిలా మారాలనుకున్నాడు. మనం వాడికా అవకాశమివ్వకపోవడం, అన్యాయం కదూ? "

మాలతి మళ్ళీ తల అడ్డంగా ఊపింది, "అవకాశాలు ఒకరిస్తే తీసుకునేవి కాదు. ఒకరివ్వలేదని పోయేవి కావు. నా భర్తలో మార్పు రాదు, వస్తే ఆపై ఆయనకి జీవిత ముండదు. అదే ఆయనకి శిక్ష. అప్పుడే ఆయనకి పాప విముక్తి. నేనాయనకి చావు కాదు, మోక్షాన్ని కోరాను"

సీతారామయ్య ఆమెనే దీక్షగా చూస్తూ, "హృదయదీపమ్ము మలిగిపోయినదిగాన, పగ వినీలాంబరము కట్టి పొగులజొచ్చె" అన్నాడు చటుక్కున.

"అదేమిటీ- ఉన్నట్లుండి అర్థం లేకుండా అలా అన్నావు? " అంది మాలతి ఆశ్చ ర్యంగా.

"అర్థం లేకపోవడమేమిటి మాలతీ! నువ్వు భూపతికి అసలుసిసలు అర్ధాంగివి. నేనిప్పుడు నీలో భర్తని పోగొట్టుకున్న ఓ విషాదమూర్తిని చూస్తున్నాను"

"మన సంప్రదాయంలో తమాషా అదే! బాలవితంతువుల్ని పక్కనపెడితే అవమాన కరమైన వైధవ్యాన్ని కూడా ఐచ్ఛికంగా పాటిస్తున్నారు మన మహిళలు. నా సంగ తలా ఉంచు. నన్ను విషాదమూర్తి అంటున్న నీలో కూడా నాకో విషాదమూర్తి కనపడుతున్నాడు కారణం? "

"మాలతీ! నువ్వు నా బ్రతుకు నిలబె ట్టావు. అందుకు నీ జీవితాన్ని నాశనం చేసుకున్నావు. అది నాకు బాధగా ఉండదూ? "

మాలతి అదోలా నవ్వింది, "నేను జీవి తాన్ని ప్రేమించలేదు. నాకు ప్రేమే జీవితం. ఇంకా చెప్పాలంటే నాకు జీవితం కంటే ప్రేమ గొప్పది. నువ్వు నా జీవితం నాశనమైందనుకుంటున్నావు కానీ ఇన్నా ళ్లకి నేను నా ప్రేమకి న్యాయం చేసానని పిస్తోంది" అందామె.

"నీ ప్రేమకి న్యాయం జరిగింది సరే- మరి నీ భర్తకేం న్యాయం జరిగింది? "

"ఆయన విషయమా? భస్మాసురుడు మోహినిని కోరి భస్మమైతే- ఆ తప్పు మోహినిదా, భస్మాసురుడిదా? " మళ్లీ నవ్వింది మాలతి.

అప్పుడు భూపతికి కోపం రాలేదు. ఉక్రోషం పుట్టలేదు. మాలతినే చూస్తున్నా డాయన. ఆమె నవ్వుతూంటే ఆ నవ్వు చూసి ముగ్ధుడవుతున్నాడాయన.

మనస్ఫూర్తిగా నిండుగా, పున్నమి వెన్నె లలా ఈ ప్రపంచానికే ఓ అద్భుతంలా ఉందా నవ్వు.

"ఈ నవ్వు ప్రతిరోజూ చూడగల ఆవకా శాన్ని వదులుకుని సీతారామయ్యా చుట్టూ పరిభ్రమించిన మూర్ఖుణ్ణి. నా ఈ చివరి క్షణాల్లోనైనా మనోహరమైన నీ నవ్వు చూడగలిగాను. ధన్యుణ్ణి మాలతీ- ధన్యుణ్ణి!" అన్నాడు భూపతి.

ఆయనకిప్పుడు మాలతి గురించిన నిజం తెలిసింది.

అయితే అది నిజంలాకాక సందేశంలా ఉంది. అదేమి సందేశమో- ఆ తర్వాత భూపతికి ఉనికి లేదు. ©

# దోపిడి

'అర్జంటుగా పదిహేనొందలు కావాలి'

'పదిహేనొందలే? నాదగ్గర ఎక్కడుందిరా? '

'ప్లీజ్.. ప్లీజ్ ఎలాగైనా చూడ్రా మామా.. ప్రాణావసరం!'

'సారీ బాబాయ్.. వందో యాభయ్యో అంటే ఓకే కానీ అంతంటే సారీ!' అంటూ వెళ్లిపోయాడు కిరణ్.

చివరి ఆశ కూడా అడుగంటడంతో నీరుకారిపోయాడు రవి.




'ఛీ.. నీయవ్వ ఏం బతుకు? పదిహేనొందల కోసం ఉదయం నుంచీ కాళ్లరిగేలా ఎన్నిచోట్ల తిరిగాడు? ఎంతమందిని అడిగాడు? ఒక్కడు.. ఒక్కడు కూడా సరే అనలేదు.. సన్నాసులు' కసిగా తిట్టుకున్నాడు.

ఉసూరంటూ హాస్టల్ గదికి వచ్చిన అతనికి టేబుల్ మీద జానకి రాసిన ఉత్తరం ఫ్యాన్‌గాలికి రెపరెపలాడుతూ కన్పించింది. నీరసంగా కుర్చీలో వాలాడు. జానకి రాసిన విషయమే మనసులో సుళ్లుతిరుగుతోంది.

'అన్నయ్యా.. వచ్చే సోమవారంలోగా పరీక్షఫీజు కట్టకపోతే ఇక కాలేజికి రావద్దన్నారు... ప్లీజ్ ఎలాగైనా చూడన్నయ్యా'

హాస్టల్‌లో కటకటగా రోజులు గడుపుతున్న తనకి హఠాత్తుగా ఎక్కడినుంచి వస్తాయి పదిహేనొందలు? అక్కడికీ ఆప్తమిత్రుల్నే కాదు.. తెలిసిన వాళ్లందరినీ అడిగాడు.. అంతా చేతులెత్తేశారు. పాపం వాళ్లూ తనలాంటివాళ్లే! ఎక్కడనుంచి తెస్తారు? ఆశాకిరణం కిరణ్ కూడా లేవన్నాడు. నిజంగానే లేవేమో! ఎందుకంటే గతంలో ఎన్నిసార్లు వాడివ్వలేదు? ఇప్పుడేం చేయాలి? తెల్లారితే శుక్రవారం! కేవలం మూడురోజుల్లో డబ్బు సంపాదించాలి. టౌనుకు వెళ్లి జానకికి ఇచ్చి రావాలి. తనమీదే ఆశ పెట్టుకుంది. తనే ఆమెను చదవమని పదేపదే ప్రోత్సహించాడు.

అంతలో అతని మెదడులో మెరుపులాంటి ఆలోచన!

తప్పేమో? అని ఒకక్షణం మనసు తటపటాయించింది. అయినా తప్పదనుకున్నాడు. ఆ రాత్రి తన పథకాన్ని ఆప్తమిత్రుడు గిరికి చెప్పాడు. 'భేష్' వెన్నుతట్టాడతను. చెల్లి చదువు కోసం ఏంచేసినా తప్పుకాదన్నాడు..

★ ★ ★

శుక్రవారం తెల్లవారు జామున 4 గంటలు!

ట్యాంక్‌బండ్‌పై దీపాలు మత్తుగా వెలుగుతున్నాయి. అడపాదడపా ఒకటీ అరా వాహనాలు తప్ప మరే అలికిడీ లేదు..

ఎప్పటిలాగే లక్ష్మీనారాయణ మాస్టారు ఉదయం నడకకు ట్యాంక్‌బండ్‌కు వచ్చారు. ఏడుపదులు దాటిన ఆయన చేతి కర్ర ఊతంతో నడుస్తున్నారు. 'పొడగంటినయ్యా నిన్ను పురుషోత్తమా..' అన్నమయ్య కీర్తన మెల్లగా ఆలపిస్తున్నారు.

వెనకే మంకీ క్యాప్‌లు ధరించిన ఇద్దరు యువకులు అనుసరిస్తున్నారు. వారెవరో కాదు రవి, గిరి..

నిర్మానుష్యవేళ అలాంటి ఒంటరిని అటకాయించి ఉంగరాలో, మెడ గొలుసో కొట్టేయాలన్నది వారి ప్లాన్. బెదిరించడమే తప్ప టార్గెట్‌ను గాయపరచద్దని గిరిని ముందే హెచ్చరించాడు రవి.

గత్యంతరం లేకే ఈ అమానుషానికి

పొల్పడుతున్నానని అతను తన మనసుకు సర్దిచెప్పుకుంటున్నాడు.

ఈ ముసలోడ్ని అటకాయించడం వల్ల తమపని అవుతుందా? లేక చిక్కుల్లో పడ తామా అని ఆలోచిస్తున్నాడు గిరి.

అతని ఆలోచన పసిగట్టిన రవి 'ఆయన కుడిచేతికి ఒకటి, ఎడమచేతికి రెండు ఉంగరాలున్నాయి ఇందాకే చూశా' అన్నాడు లోగొంతుకతో.

సరే ఇంకెందుకు ఆలశ్యం? అన్నట్లు చూశాడు గిరి.

ఇద్దరూ సైగచేసుకుని ఆయన మీదకు దూకబోయే వేళ... సాగర్‌మీద నుంచి భయంకరంగా అరుచుకుంటూ ఎగిరిపో యిందో పిట్ట.

ఉలిక్కిపడి ఆగిపోయారిద్దరూ. మాస్టారు మాత్రం కీర్తనలు పాడుకుంటూ ముందుకు కదుల్తూనే ఉన్నారు. ఆయనకు పిట్ట అరుపు వినబడలేదా? ఏమో? ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

నడక కొనసాగుతూనే ఉంది.

'మీనమేషాలు లెక్కిస్తుంటే కాదు.. తెల్లా రుతోంది. వాకింగ్‌కు వచ్చేవాళ్లు పెరుగు తారు' గొణిగాడు గిరి.

అంతే! కొన్ని క్షణాల్లోనే ఇద్దరూ రెండం గల్లో మాస్టారికి ఇరువైపులా వచ్చి నిలబ డ్డారు.

ఉలిక్కిపడిన ఆయన వారివంక భయంగా చూశారు..

'మర్యాదగా నీ చేతి ఉంగరాలు తీసివ్వు!' జేబులోంచి కత్తితీశాడు గిరి.

లైటువెలుగులో తళతళ మెరుస్తున్న కత్తిని చూసి వణికిపోయిన మాస్టారికి తల తిరిగినట్లుంది.. కళ్లుమూతలు పడిపో యాయి. ఒకపక్కకు వాలిపోయారు..

ఈ హఠాత్పరిణామానికి ఖిన్నుడయ్యాడు రవి. పడిపోతున్న మాస్టార్ని పడకుండా



పొదివిపట్టుకున్నాడు..

'ఇదేంట్రా కొంపతీసి పోయాడా? హార్ట్ ఎటాకా?' అడిగాడు రవి ఏడుపు గొంతుతో.

'అదేంకాదు! బీపీ ఎక్కువైంది.. కళ్లు తిరిగినట్లున్నాయ్.. చకచక ఆ ఉంగరాలు తీయి.. నేనివి తీస్తాను. ఎవరన్నా వచ్చే లోగా జారుకోకుంటే చచ్చామన్నమాటే.. హరీయప్!' అన్నాడు గిరి.

'వద్దురా? ఇప్పటికే తప్పుచేశాం. చెల్లి చదువుకోసం రెపరెపలాడుతున్న ఓ ప్రాణాన్ని గాలికి ఒదిలేసి పోవడం నాకిష్టం లేదు. ఉంగరాలొద్దూ పాడూ వద్దు. ముందు ఏదైనా ఆటోచూడు.. లేదంటే 108కి ఫోన్‌చేయ్'

గిరి వింతగా చూశాడు. తర్వాత కోపంగా- 'ఏం తమాషాగా ఉందా? నీకోసం... నీ చెల్లికోసం రిస్క్‌తీసుకుని ఇక్కడిదాకా వస్తే ఇప్పుడేంటీ నీతులు? ఎవరైనా వచ్చినా... లేక ఆయనకు స్పృహ వచ్చినా ఇంతేసంగతులు! త్వరగా వచ్చిన పని చూడు. లేదంటే నా దారిన నేను పోతా' అన్నాడు ముఖం గంటుపెట్టుకుని.



వాదోపవాదాలు జరిగాయి. నీ చావు నువ్వు చావు అంటూ గిరి వెళ్లిపోయాడు.

శిక్షపడ్డా పర్లేదనుకుని రవి 108కి కాల్ చేసి మాస్టార్ని ఆస్పత్రికి తీసుకువెళ్లాడు..

★ ★ ★

శుక్రవారం ఉదయం 6 గంటలు.

హాస్పిటల్ రూమ్‌లో లక్ష్మీనారాయణ గారి బెడ్‌పక్కనే కూర్చున్నాడు రవి. ఆయనకు ఇంకా స్పృహరాలేదు. ఆప్తమిత్రుడ్ని కష్టం మధ్యలో వదిలి వెళ్లానని బాధపడ్డ గిరికూడా ఆ సరికి అక్కడకే చేరుకున్నాడు.

మిత్రుడ్ని చిరునవ్వుతో ఆహ్వానించాడు రవి. మనస్ఫూర్తిగా 'సారీ' చెప్పాడు గిరి.

ఏదేమైనా మనం చేసింది తప్పు. దాన్ని దిద్దుకుందాం. ఈ ప్రయత్నంలో చిక్కులెదురైనా ఓకే అనుకున్నారు మిత్రులిద్దరూ.

అప్పటికే డాక్టర్‌కి విషయం రవి చెప్పేయడంతో ఆయన ఫిర్యాదు మేరకు పోలీసులు వచ్చారు.

'ముసలాయన మీద ఎటాక్ చేసింది మీరేనా? ' గదిలోకి వస్తూనే అడిగాడు ఇన్‌స్పెక్టర్.

'ఎస్సార్..' అనివారనబోతుండగా-

'నో సార్' అని పీలగా విన్పించింది.

అందరూ ఆశ్చర్యంగా ఆ వైపు చూశారు. బెడ్‌మీది లక్ష్మీనారాయణ కళ్లుతెరిచి చూస్తున్నాడు.

'మార్నింగ్ వాక్‌కు వెళ్లి ట్యాంక్‌బండ్‌పై కళ్లు తిరిగిపడిపోతే అంబులెన్స్ తెప్పించి వీళ్లే నన్ను కాపాడారు' అన్నాడాయన.

డాక్టర్ ద్వారా అసలు విషయం తెలుసుకున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కూడా నవ్వుకుంటూ వెళ్లిపోయాడు.

ఆశ్చర్యంతో నోరుతెరిచిన మిత్రులిద్దరినీ చూస్తూ-

'అరగంట నుంచీ హాస్పిటల్‌లో నా బెడ్ పక్కన కూర్చుని మీరు మాట్లాడుకునేదంతా విన్నా! మీ చెల్లికి పరీక్షఫీజు నేను కడతా.. డోంట్‌వర్రీ! మీలాంటి మంచివాళ్లు ఉండాల్సింది కటకటాల వెనక మాత్రంకాదు..' అన్నారు మాస్టారు.

తన కాళ్లమీద పడబోయిన వాళ్లిద్దర్నీ ప్రేమగా గుండెకు హత్తుకున్నారాయన.

-చంద్రప్రతాప్



అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాషగా హిందీది దేశంలో అగ్రస్థానం. 19వ శతాబ్దంలో భారతేందు హరిశ్చంద్రతో ఆరంభమైన ఆధునిక హిందీ సాహితీ రంగాన్ని మహావీర ప్రసాద్ ద్వివేది, మైథిలీశరణ్‌గుప్త, జయశంకర్ ప్రసాద్, బృందావన్ లాల్‌వర్మ, సుమిత్రానందన్ పంత్, రాంధారీసింగ్ దిన్‌కర్, రాహుల్ సాంకృత్యాయన్ తదితరులు విరాజిల్లజేశారు. ఛాయావాద కవితకు పట్టంగట్టడంతోపాటు సుమిత్రానందన్ పంత్ హిందీ కవితకు మనోజ్ఞ రూపలావణ్యాలు, మాధురిని చేకూర్చి, కవిలోకానికి నూతన దిశానిర్దేశం చేశారు. ఆయన 'చిదంబర' కావ్యం 1968లో జ్ఞానపీఠం అందుకుంది. హిందీలో ప్రథమ జ్ఞానపీఠ స్వీకర్త పంత్ కావడం గమనార్హం.

# సుమిత్రానందన్ పంత్

ఉత్తరప్రదేశ్‌లోని అల్మోరా జిల్లా కౌసానీ గ్రామంలో పంత్ 1900 మే 20న జన్మించారు. ఆ ప్రాంతం కుమాయున్ పర్వతాల మధ్య ప్రకృతి రామణీయతకు కాణాచి. తండ్రి గంగాదత్, తల్లి సరస్వతీదేవి. ఆమె బిడ్డను ప్రసవించిన ఆరు గంటలకే చనిపోయింది. పంత్ చిన్ననాటి పేరు గోసాయిదత్ పంత్. పెద్దయ్యాక పేరు మార్చుకున్నారు. తల్లిలేని కొడుకుపై తండ్రి గారాబానికి అంతులేదు. మేనత్త పెంపకంలో పెరిగాడు పంత్. చదువుల్లో దిట్ట. తండ్రి ఆంగ్లం, అన్న హిందీ, మామయ్య సంస్కృతంపట్ల అభిమానం పెంచారు. పదేళ్ళకే పంత్ అమరకోశం చదివాడు. చాణక్యనీతి, రామరక్షాస్తోత్రం శ్లోకాలు కంఠస్థం చేశాడు. సంగీతం నేర్చుకున్నాడు. కవిత్వంపై అభిరుచి పెంచుకున్నాడు. స్వస్థలంలో ప్రాథమిక విద్య తర్వాత అల్మోరాలో, కాశీలో చదువు సాగించి మెట్రిక్ ఉత్తీర్ణుడయ్యాడు. బెంగాలీ నేర్చుకున్నాడు. రచనా వ్యాసంగం ఆరంభమయింది. రవీంద్రుడు, వివేకానంద, అరవిందుడు, మార్క్స్, కీట్స్, షెల్లీ, కాళిదాసు, వర్డ్స్‌వర్త్ తదితరుల రచనలు అధ్యయనం చేశాడు. ఉపనిషత్తులు, వేదాంత గ్రంథాలు చదివాడు. అలహాబాదులోని కళాశాలలో చేరినా 1921 గాంధీ పిలుపు నందుకుని పైచదువులకు స్వస్తి చెప్పాడు. పాండిచ్చేరి వెళ్ళి అరవిందాశ్రమంలో కొంతకాలం గడిపాడు. అటుపిమ్మట పంత్ ఉద్యోగాన్వేషణ చేయదలచుకోలేదు. సాహితీ సృజనకే జీవితం అంకితం చేయాలని నిశ్చయించుకుని, దానిని త్రికరణ శుద్ధితో అనుసరించారు. అభిమానుల ప్రోద్బలంపై కొన్నేళ్లు అలహాబాదు ఆకాశవాణి కేంద్రంలో హిందీ కార్యక్రమ ప్రయోక్తగా వ్యవహరించక తప్పలేదు.




పంత్ విద్యార్థి దశలోనే రచనలు ప్రారంభించారు. అప్పుడవి పత్రికల్లో ప్రచురితమయ్యాయి కూడా. ప్రధానంగా ఆయన కవి అయినా కథ, నవల, వ్యాసం, నాటకం వంటి ప్రక్రియల్లో రచ

నలు చేశారు. వాస్తవానికి ఉన్నత పాఠశాల విద్యార్థిగా 'హార్' నవల రాశారు. మనిషి రూపసి. మనస్సు కోమలం. తాను పెరిగిన కూర్మాంచల్ ప్రదేశంలోని ప్రకృతి సౌందర్యం చెరగని ముద్ర వేసింది. అందుకే ఆయన కవితలు కమనీయ రసాభావ నిష్యందాలు. శైలి, భావుకత, అభివ్యక్తి మనోహరాలు. పంత్ ప్రకృతి వర్ణనలు పరవశింపజేస్తాయి. 'ప్రకృతే నాకు కవితా సాధన ప్రేరకమయింది. ఈ గౌరవం నేను పుట్టి పెరిగిన కూర్మాంచల్ ప్రాంతానికి దక్కుతుంది' అంటారాయన. సంస్కృత పద చాలన ప్రియుడు. పంత్ గాంధీతత్త్వం, సామ్యవాదం, మార్క్సిజం మేళనంతో రాసిన కావ్యం 'పల్లవ్'. 'గ్రామ్య' కావ్యంలో కమ్యూనిజాన్ని గాంధీతత్వంతో సమన్వయం చేశారు. 'వీణ', 'గుంజన్', 'గ్రంథి' మున్నగు కావ్యాల్లో ఛాయావాదం ఆవిష్కృతమవుతుంది. 'యువరాణి', 'యుగాంత్' వంటి కృతులు పంత్ అభ్యుదయ భావాలను, సామాజిక స్పృహను ప్రతిబింబిస్తాయి. మధుజ్వాల, సత్యకామ్, ఉచ్ఛ్వాస్, స్వర్ణ కిరణ్, యుగపథ్, రజత్‌శిఖర్, శంఖధ్వని, ఉత్తర, చిదంబర వంటి 34 పద్యకృతులు ఆయన కవితా వైదుష్యాన్ని చాటుతాయి. 'లోకాయతన్' ప్రబంధం. 'కాలా ఔర్ బూఢా చాంద్' తాత్త్విక గీతరచన. 'శశికీతరీ' ఆధ్యాత్మిక భావబంధురం. 'జ్యోత్స్న' చంపూ నాటకం. 'శిల్పి' పద్యరూపక సంపుటి. ఆయన ఇతర రచనలు. 1 కథా సంపుటి, 1 నవల, 3 నాటకాలు, 1 వ్యాస సంపుటి, 1 గేయనాటిక, 1 అనువాదం, 1 సంస్కరణాత్మక రచన. మొత్తం 43.

జ్ఞానపీఠ బహూకృతికి పాత్రమైన 'చిదంబర' బృహద్గ్రంథం.. 196 ఖండికలున్నాయి. ఇది వాస్తవానికి పంత్ 1937-57 మధ్య రచించిన 11 పద్యకావ్యాల సమాహారం. అవి యుగవాణి, గ్రామ్య, స్వర్ణకిరణ్, స్వర్ణధూళి, యుగపథ్, ఉత్తర, రజత శిఖర్, శిల్పి, సౌవర్ణ, అతిమ, వాణి. 'చిదంబర' గురించి కావ్యకర్త పంత్ ఇలా వివరిస్తారు. "ఆధ్యాత్మిక, మానసిక, భౌతిక, సామాజిక అంశాలపై భావాలను వ్యక్తీకరించిన రచనలను ఏకత్రం చేసి, వాటి సామరస్య సూత్ర సంధానానికి యత్నించాను. ఈ యుగ బాహ్య, ఆంతరిక జీవన చైతన్యాన్ని నవమానవ భావజాలంతో అలంకృతం చేసి సాహితీకరించాను. అనంతర రచనల్లో సమన్వయ దృక్పరిధులను దాటి సువిశాల దిగంతాలను చిత్రీకరించాను. విశాల సామాజిక చైతన్యాన్ని దర్శించాను. నా కావ్య చైతన్యం ప్రధానంగా నూతన సాంస్కృతిక చైతన్యం. నేటి యుగ సంఘర్షణ చోటు చేసుకుంటుంది" కావ్య స్వరూపాన్ని కావ్యకర్తే విశదం చేశారు. ఇది పంత్ కావ్యరచనా ప్రస్థానం తెలిపే రచన. ఇది ప్రకృతి సౌందర్య చిత్రణతో ప్రారంభించి, యథార్థ జీవిత తత్త్వం తెలుపుతూ, ఆధ్యాత్మిక సత్యసాక్షాత్కారం విశదం చేస్తూ, అనంత వ్యాప్తమైన యుగ సంఘర్షణను విస్తృతంగా చూపుతుంది. 'యుగ సమర్పణ' ఖండికకు ఇలపావులూరి పాండురంగారావు తెలుగు అనుకృతి నుంచి కొన్ని పంక్తులు. "భవవిశ్లథ హృదయంబున ఆనందము కురియవలయు/ జగతికినీ లోకోత్తర దివ్యత్త్వము కూడవలయు/ నరుని అరయ హృదయము నీ కరుణ ధారలరయ వలయు/ సహజీవన కార్య నిరతి భువినీకరించవలయు". 'సౌవర్ణ' అనే రూపకంలో దివిజాంగన నోట పలికించిన పంక్తులకు డా. ఇలపావులూరి వారి తెనిగింపు- "పోదము పదమనుజ భువికి, ధరాస్వర్గమది ఇప్పుడు/ ప్రగతి విముఖ చిర నిష్క్రియమమరావతి భోగభూమి- /రతిలాలసులకు ప్రియమది, వదలుడు, మానవులుకందు, /మర్త్యలోకమే భవిష్యనందన వనమయి తీరును!" పంత్ తన మహత్తర కావ్యంలో ఇచ్చిన అద్భుత సందేశమిది.

పంత్ అనేక పురస్కారాలందుకున్నారు. 'ద్వివేది' స్వర్ణపతకం, 'దేవ్' పురస్కారం, కాశీనాగరీ ప్రచారిణీ సభ బహుమతి, ఉత్తరప్రదేశ్ బహూకృతి, ప్రయాగ హిందీ సాహిత్య సమ్మేళనం 'సాహిత్య వాచస్పతి' బిరుదం, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం-ఫెలోషిప్, రష్యా నెహ్రూ శాంతి బహుమానం మొదలైనవి కొన్ని.. కేంద్ర ప్రభుత్వం 1961లో 'పద్మభూషణ్' గౌరవం ప్రదానం చేసింది. విక్రమ్, గోరఖ్‌పూర్ విశ్వవిద్యాలయాలు పంత్‌కు గౌరవ డాక్టరేట్లు ఇచ్చి సత్కరించాయి. పంత్ 'కౌసాన' గ్రామంలో జన్మించిన ఇంటిని ప్రభుత్వం 'మ్యూజియం'గా తీర్చిదిద్దింది. అందులో ఆయన గ్రంథాలు, రాత ప్రతులు, వాడిన వస్తువులు, ఆయనకు వచ్చిన లేఖలు, అందుకున్న పురస్కారాలు మొదలైనవి భద్రపరిచారు.

1977 డిసెంబరు 28న పరమపదించారు సుమిత్రానందన్ పంత్. ఆయన కవితా తేజః పుంజం ఆచంద్రతారార్కం ప్రకాశిస్తూనే ఉంటుంది.

–గోవిందరాజు రామకృష్ణారావు

## కాలాతీతం



## లారెన్స్ స్టెర్న్

# ట్రిస్ట్రాం షాండీ




**నా** పేరు ట్రిస్ట్రాం షాండీ. 1718లో నవంబరు 5న భూమ్మీదపడ్డాను. చంద్రుడిమీదో, మరేదైనా గ్రహంమీదో పుట్టినా నా పరిస్థితి ఇంతకన్నా అధ్వాన్నంగా ఏమీ ఉండేది కాదేమో? ఏం చెప్పమంటారు నా కష్టాలు? అందరూ నన్ను చూసి నవ్వేవాళ్లే. ఎందుకో అంత లోకువ? నాలో ఏం లోపముందని? తమకు పుట్టబోయే సంతానం ఎలా ఉండబోతోందో మా అమ్మా నాన్నా ముందే ఊహించి ఉంటే నాకిన్ని కష్టాలు తప్పేవి. నా జన్మ గురించి చెప్పి, జ్ఞానం ప్రసాదించిన మా అంకుల్ టోబీషాండీ రుణం తీర్చుకోలేను. “మా ట్రిస్ట్రాంగాడు పుట్టటానికి తొమ్మిది నెలలు ముందే వాడి కష్టాలు ప్రారంభమయ్యాయి” అన్నాడట మానాన్న.

ఎప్పుడు పుట్టానో చెప్పాను గదా! ఇక, ‘ఎలాగ?’ అన్న విషయం తెలుసుకోవాలి. కాస్త ఓపిక పట్టండి. మీరెవరో నాకు తెలియదు. ముఖపరిచయం కూడా లేనివారికి రహస్యాలన్నీ చెప్పమంటే ఎలా?

మా ఊళ్లోనే ఓ మంత్రసాని కూడా ఉందట. ఆమె చేసిన కాన్పులన్నీ సుఖ ప్రసవాలేనని పేరు గడించింది. ఈ ప్రయత్నాలలో ప్రకృతి సహకరించి ఉంటుందే తప్ప, ఆమె నైపుణ్యమేమిటో నాకు అంతుపట్టదు. అయినా ఆ వూరికి నాలుగు మైళ్ల వ్యాసార్ధంలో అలాంటి మంత్రసాని మరొకరు లేరని నాన్న కూడా అంగీకరించాడు.

ప్రసవం కోసం అమ్మ లండన్‌కెందుకెళ్ల లేదంటే దానికో కారణముంది. అది నాన్న నిర్ణయం. అందువల్ల మంత్రసానినే పిలవక తప్పలేదు. అయితే ఇందులో ఆయనను తప్పు పట్టటానికిలేదు. పెళ్లినాటి ఒప్పందం ప్రకారం అమ్మ లండన్‌లోనే నీళ్లాడాలి. కాని నొప్పులు రాకుండానే, వచ్చినట్టు నటించి లండన్‌కెళితే మాత్రం తర్వాత ప్రసవానికి ఈ సదుపాయం వర్తించదు. మొత్తంమీద చివరికి ఆరోజు రానే వచ్చింది. అరుపులతో,

కేకలతో ఇల్లంతా ఒక్కటి చేసి తన బిడ్డ ప్రాణాల్ని మంత్రసాని చేతుల్లో పెట్టింది అమ్మ. శాస్త్రీయ పద్ధతులంటే గౌరవం వున్న నాన్న, ఈ వ్యవహారంలో సలహాలకోసం డాక్టర్ స్లాప్‌ను ఇంటికి రప్పించాడు. అమ్మను మంత్రసానికి అప్పగించి, ఆయనా, నాన్నా, అంకుల్ టోబీ పక్కగదిలో వైన్ తాగుతూ వైద్య విషయాలు చర్చించారు.

మా నాన్న గొప్ప మేధావి, జ్ఞాని. పేర్ల గురించి ఆయనకు కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయి. వాటిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం కన్న జామెట్రీలోని కఠినాతి కఠినమైన సమస్యను పరిష్కరించటం సులభం. ఉదాహరణకు, 'ట్రిస్మెజిస్టస్', 'ఆర్కిమెడీస్'లు గొప్పవాళ్లు కావటానికీ, 'నైకె', 'సింకిన్'లు అనామకంగా ఉండిపోవటానికీ వాళ్ల పేర్లే కారణమంటాడు. సరైన పేరు లేకపోతే పిల్లల్లో ఎదుగుదల సరిగా వుండదు. జాక్, డిక్, టాం లాంటి పేర్లు ఆయనకు నచ్చవు. అయితే ఈ లోకంలో ఉన్న పేర్లన్నింటిలోకీ, 'ట్రైస్ట్రాం' అంటే మాత్రం ఆయనకు అసలు గిట్టదు. అంత కన్న ఛండాలమైన పేరు మరొకటి లేదు. ఈ పుస్తకం మీద కనిపించే పేరు చూసి పాఠక మహాశయులకు నా మీద జాలి కలుగుతుందనే అనుకుంటాను. ఈ విషయం మీద మరింత వివరణ ఇవ్వక తప్పదు.




నేను పుట్టటానికి కొన్ని గంటల ముందు ఏం జరిగిందంటే- "పైన అరుపులు వినిపిస్తున్నాయెందుకు? " అంటూ నాన్న అంకుల్ టోబీ వైపు చూశాడు.

"అమ్మగారికి నొప్పులొస్తున్నాయి. మంత్రసాని కోసం పంపించా" అన్నాడు.

"డాక్టర్ స్లాప్‌కు తక్షణమే కబురు పెట్టండి" అన్నాడు నాన్న. ఆయన ఆ వాక్యమైనా ముగించకుండానే, మంత్రసాని కోసం పనిమనిషి వెళ్లిన రెండు నిమిషాల, పదమూడు సెకండ్లలోనే పెరటి తలుపు తీసుకుని ప్రవేశించాడు డాక్టర్ స్లాప్.

నాలుగున్నర అడుగుల ఎత్తూ, అందులో సగం అడ్డంగా పెరిగిన శరీరంతో ఓ వింత మనిషిని ఊహించుకోండి. అతడే డాక్టర్ స్లాప్. గుర్రం పిల్లనెక్కి వచ్చిన డాక్టరు గారు బురదలోపడి, లేచి, విచిత్ర వేషధారణతో, హామ్లెట్ ప్రేతం లాగ దర్శనమిచ్చాడు. గుమ్మంలో స్థాణువులాగ నిల్చున్నాడేగాని కదలడు, మాట్లాడడు.

"డాక్టర్ మీ కోసమే నిరీక్షిస్తున్నాం. పరికరాలు తెచ్చుకొన్నారా? " అంటూ స్వాగతం పలికాడు నాన్న.

మొత్తం మీద దుస్తులు మార్చుకుని, డాక్టర్‌వంటగదిలోకి ప్రవేశించాడు.

మా నాన్నా, అంకుల్ టోబీ తమ జ్ఞానచర్చలు కొనసాగించారు.

"డాక్టర్‌గారేరి? "

"బిడ్డను లాగేప్పుడు ముక్కునలిగిందట సరిచేస్తున్నాడు" అన్నాడు పనిమనిషి.

"ఇది నా కొడుక్కు తొలి ప్రమాదం. వాడికి 'ట్రిస్మెజిస్టస్' పేరు పెడతాను. ఆయన గొప్ప చక్రవర్తి. అదే మా వాడికి సరైన పేరు. ఇంతకూ మీ అమ్మగారెలా వుంది? " పనిమనిషిని అడిగాడు నాన్న.

"ఎలా ఉంటారండి? ఎలా ఉండాలో అలాగే ఉన్నారు"

అర్థం లేని ప్రశ్నకు అర్థం లేని జవాబు.

"నా కర్థం కానిదేమంటే..." అంటూ తాత్విక మీమాంస కొనసాగించాడు నాన్న.

"... ఒక్క స్త్రీ ప్రసవిస్తే ఇంట్లోని ఆడవా

ళ్లంతా, పనిమనిషితో సహా, అదేదో ఘనకార్యమన్నట్టు ఓ అంగుళం పొడుగు పెరుగుతారేమిటి? "

"నా అభిప్రాయంలో పురుషులు ఓ అంగుళం ముడుచుకుపోతారు" అన్నాడు అంకుల్ టోబీ.

తర్వాత నాన్న, కాసేపు కళ్లు మూసుకుని పడుకున్నాడో లేదో, పనిమనిషి వచ్చి ఆయన్ను తట్టిలేపింది.

"పిల్లాడి మొహం ఎందుకోగాని నల్లబడుతున్నదండి. వాడికి నామకరణం చెయ్యటానికి క్యూరేట్ ఒకవైపు నిరీక్షిస్తున్నాడు. మరి కెప్టెన్ షాండీ (అంకుల్ టోబీ) వాడికి గాడ్‌ఫాదర్‌లా ఉంటున్నాడు. అన్ని పనులూ ఒక్కదాన్ని నేనే చూడాలి... " అంటూ తన సోది ప్రారంభించింది.

"ఏమైంది వాడికి? 'ట్రిస్మెజిస్టస్' లాంటి గొప్ప పేరు వృథా అవుతుందా ఏమిటి? " అన్నాడు నాన్న ఆందోళనగా.

"అవన్నీ ఆలోచించటానికి టైం లేదు ఆ పేరేదో క్యూరేట్‌కు చెప్పాలి."

"పేరు బాగా జ్ఞాపకం పెట్టుకో.. ట్రిస్మెజిస్టస్. మరోసారి చెబుతున్నాను, జాగ్రత్తగా విను - ట్రిస్మెజిస్టస్"

"ట్రిస్... ట్రిస్" అంటూ పరిగెత్తింది పనిమనిషి.

క్యూరేట్‌కు ఆ పేరు అర్థంకాలేదు.

'ట్రిస్'తో ప్రారంభమయ్యే పేరు. ట్రిస్టాం అన్నాడు.

"ఆc అదే ట్రిస్ట్రాం జిస్టస్" అంది పనిమనిషి.

"నా మొహం జిస్టస్ గిస్టస్ ఏంలేదు. ట్రిస్ట్రాం" అన్నాడు క్యూరేట్.

"అలా నాపేరు 'ట్రిస్ట్రాం' అయింది.

పేరుతో వచ్చిన ఈ పరిణామం నాన్నను ఎంత కుంగదీసిందో! ముక్కులేకపోయినా ఫర్వాలేదుకాని పేరు మారిందే. ఇక వాడి జీవితంలో ఎన్ని ఉపద్రవాలు సంభవించనున్నాయో గదా!

పరిస్థితులు కాస్త సర్దుకున్నాక ఒకనాడు తీరిగ్గా నాకోసం 'ట్రిస్ట్రాపీడియా' లేక 'విద్యా ప్రణాళిక' తయారు చేశాడు నాన్న.

కొన్నాళ్లు గడిచాయి. నాకు 'ఒకచోట' గాయమైంది. డాక్టర్ స్లాప్ పరీక్షించి కట్టుకడతానన్నాడు. పడుచు పనిమనిషి నన్ను 'అక్కడ' ముట్టుకోవటానికి సిగ్గుపడటం చూసి, నాకు ఆడ ఆయాలు గాక, మగ గవర్నర్‌ల అవసరముందని గ్రహించాడు. దేని గురించైనా క్షుణ్ణంగా విచారించి మరీ నిర్ణయం తీసుకోవటం ఆయన అలవాటు. ఈ విషయంలో గోత్స్ (అనాగరికులు/మూర్ఖులు) ఆలోచనా పద్ధతి ఆయనకు ఆదర్శం. వాళ్లు ప్రతి విషయాన్నీ రెండు సార్లు చర్చిస్తారట. ఒకటి తప్పతాగినప్పుడూ, మరోసారి మత్తు దిగిన తర్వాత. ఒకసారి తోచింది చెయ్యాలనిపిస్తే, మరోసారి వివేచన ముఖ్యమనిపిస్తుంది. రోజూ మంచినీళ్లు తప్ప మరే డ్రింకూ తీసుకోని మానాన్నా, రోజుల తరబడి ఆలోచించి, వెయ్యిసార్లు రిహార్సల్స్ వేసుకుని ఓ నిర్ణయానికొచ్చాడు. ప్రతినెలా శని, ఆదివారాల్లో (రాత్రుళ్లు) మా అమ్మతో మాట్లాడి తమ మధ్యవున్న అభిప్రాయభేదాలను తగ్గించుకోవాలి. పడకగదిలోవున్న మంచాలకు ఆయన 'బెడ్స్ ఆఫ్ జస్టిస్' అని పేరు పెట్టాడు. తాగినా, తాగకపోయినా ఇరుపక్షాలకు అంగీకారయోగ్యమైనదేదైనా ఉత్తమమేననటంలో సందేహం లేదుగదా.

ఇప్పుడు కథ కొత్త మలుపులు తిరుగుతుంది. నా చిన్ననాటి దుస్తుల్ని వదిలి, అమ్మనూ, డాక్టర్ స్లాప్ చేతిలో నాకు జరిగిన అవమానాలనూ మరిచి అంకుల్ టోబీ కిచెన్ గార్డెన్‌లోకి ప్రవేశిద్దాం.

అంకుల్‌లాంటి జెంటిల్మన్, ఆత్మాభిమాని మా బంధువుల్లో లేరు. ఎక్కడా, ఎవరి ముందూ దర్పం ప్రదర్శించడు. వినయం

# లారెన్స్ స్టెర్న్
## ( 1713 - 1768 )

లారెన్స్ స్టెర్న్ జననం ఐర్లాండ్‌లోని క్లామెల్‌లో. తండ్రి బ్రిటిష్ సైన్యంలో పనిచేశాడు. అతడు పుట్టిన తర్వాత వారి కుటుంబం యార్క్‌షైర్‌లో స్థిరపడింది. హాలిఫాక్స్‌లోనూ, తరువాత కేంబ్రిడ్జి జీసస్ కాలేజీలో బి.ఎ. పూర్తిచేసిన లారెన్స్ 1739లో డీకన్‌గా నియమితుడయ్యాడు. తరువాత యార్క్‌షైర్ సమీపంలోని ఒక గ్రామానికి వికార్‌గా పనిచేశాడు. 1741లో ఎలిజబెత్ లమ్లీని పెళ్లిచేసుకున్నాడు. భార్య గయ్యాళి. పైగా అనారోగ్యంతో మంచం పట్టింది. డబ్బుల్లేవు. ఆ కష్టాల కడలిని ఈదే క్రమంలో ప్రారంభమైంది ఈ అత్యద్భుత హాస్య వ్యంగ్య నవల 'ట్రిస్ట్రాం షాండీ'. మొదట్లో ప్రచురించటానికి నిరాకరించాడు పబ్లిషర్. భార్య చావుబతుకుల్లో ఉంది. లారెన్స్‌ను క్షయవ్యాధి పట్టుకుంది. చికిత్స కోసం 1762లో ఫ్రాన్స్‌కు వెళ్లాడు. అప్పటికే స్వంత ఖర్చుతో అచ్చేసిన నవల తొలి రెండు సంపుటాలు అక్కడ పెను సంచలనం సృష్టించాయి. ఫ్రెంచి రచయితలు, మేధావులు బ్రహ్మరథం పట్టారు. తిరిగి వచ్చేనాటికి ఇంగ్లండులో కూడా స్టెర్న్ కీర్తి ప్రతిష్ఠలు పెరిగాయి. నవల అత్యధికంగా అమ్ముడుపోయి కొత్త రికార్డులు సృష్టించింది. అయితే స్టెర్న్ ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. ఈయన అనేక సెర్మన్స్, వ్యాసాలే కాకుండా 'ఎ సెంటిమెంటల్ జర్నీ త్రూ ఫ్రాన్స్ అండ్ ఇటలీ'(1768)అనే నవల ప్రచురించాడు.

### ఇదో గొప్ప కళాఖండం

ఈ నవల మొత్తం పేరు, 'ది లైఫ్ అండ్ ఒపీనియన్స్ ఆఫ్ ట్రిస్ట్రాం షాండీ, జెంటిల్మన'. మొత్తం తొమ్మిది సంపుటాలుగా ప్రచురితమైంది. సమకాలీన ఫ్రెంచి, జర్మన్ రచయితలను ఎంతో ప్రభావితం చేసిన ఈ నవలలో రచయిత ఏదీ సూటిగా చెప్పడు- ముక్కు చూపించమంటే తల వెనుక నుండి చేయి పెట్టినట్టుగా. ఈ డైగ్రెసివ్ టెక్నిక్ ఇందులోని హాస్యాన్ని మరింత పెంచుతుంది. ఉదాహరణకు మూడవ సంపుటందాకా, 'ట్రిస్ట్రాం' పుట్టడు. కథలో ఇతివృత్తం లేదు. కాని అద్భుతమైన పాత్ర చిత్రణ మనల్ని ఆకట్టుకుంటుంది.

వ్యక్తుల అంతర్లోకాలను, మానసిక జీవితాన్ని ఆవిష్కరించటమే లక్ష్యంగా సాగిన ఈ నవలలో సంఘటనల క్రమం కూడా కాలానుగుణంగా ఉండదు. ఫ్లాష్‌బాక్‌లు, జరగబోయే విషయాల గురించిన వూహలు, కలగలిసి రంగులరాట్నం ఎక్కినట్టుగా బుర్ర గిర్రున తిరుగుతుంది.

టెక్నికల్‌గా తన కాలం కన్నా ఎంతో ముందున్న స్టెర్న్, ఇరవయ్యో శతాబ్ది ప్రయోగాత్మక రచయితలు జేమ్స్ జాయ్స్, మార్సెల్ ప్రూస్ట్, థామస్ మాన్, వర్జీనియా వూల్ఫ్, థామస్ పించన్ వగైరాలకు మార్గదర్శి. "ఇది ఒక స్ట్రేంజ్ మాస్టర్ పీస్" అన్నాడు ప్రముఖ విమర్శకుడు థామస్ ఫ్రీడ్‌మాన్ ట్రిస్ట్రాం షాండీ గురించి.

---

అంటే ఏమిటో ఆయన్ను చూసే నేర్చుకోవాలంటారు. కాని పాపం, అలాంటి సజ్జనుడు కూడా, 'ఆంట్ డినా' గురించి మాట్లాడినప్పుడు మొహం కందగడ్డ చేసుకుంటాడు. ఆమె కోచ్‌మాన్‌తో లేచిపోయిన విషయం నాన్న ప్రస్తావించినప్పుడల్లా తల గోడకేసి బాదుకుంటాడు.

ఏది ఏమైనప్పటికీ అంకుల్ గొప్పవాడనటంలో సందేహంలేదు. 'నాముర్' యుద్ధంలో గాయాలపాలైన తర్వాత ఆయన్ను సైన్యం నుండి డిశ్చార్జి చేశారు. ఇంగ్లండుకు తిరిగివచ్చి మాయింటికి ఎదురుగా మరోయిల్లు కొనుక్కుని సెటిలయ్యాడు. సైనికుడి నోట యుద్ధ విశేషాలు వినాలనే కోరిక లేనివారెవరు? అలా వచ్చిన వాళ్లందరికీ నాముర్ ఎక్కడుంది? ఎక్కడ ముళ్ల కంచెలు, అగడ్తలున్నాయి వగైరా చెప్పి చెప్పి విసిగిపోయి చివరికి ఒక పెద్ద మ్యాప్ తెచ్చి అందులో ఒక్కొక్క ప్రదే

శమూ చూపేవాడు. క్రమంగా ఈ మ్యాప్‌ల సేకరణ ఆయన హాబీగా మారింది. ఇప్పుడాయన దగ్గర అన్ని నగరాల మ్యాపులూ ఉన్నాయి. హాబీకీ, వ్యసనానికీ తేడావుందా? కొత్తనగరం ఒకటి వెలిసిందని తెలిసిన వెంటనే దాని మ్యాప్ తెప్పిస్తాడు. పత్రికల్లో వార్తలు చదివి ఏ సంఘటన, ఎక్కడ, ఏ వీధిలో జరిగిందో కూడా వివరిస్తాడు. ఇక యుద్ధాల సంగతి చెప్పక్కర్లేదు. మా అంకుల్ సలహాలు తీసుకుని డ్యూక్ ఆఫ్ మార్ల్‌బరో, లాండెన్, డన్‌సెన్, ఆస్టెండ్, ఎత్, డిండర్‌మాండ్ వగైరా నగరాల్లో విజయఢంకా మోగించాడు.

యుద్ధాలు అనేక రకాలు. ముళ్లకంచెలు, అగడ్తలకు బదులు ఇప్పుడు అంకుల్ టోబీ దృష్టి మధురానుభవాలవైపు మళ్లింది. రణభేరికి బదులు ల్యూట్ (సంగీత వాయిద్యం) ఆయన్ను ఆకర్షించింది. ప్రేమాంకురం పెరిగి వటవృక్షమైంది. విడో వాడ్‌మాన్ ఆయన మనసు దోచుకుంది. ఆమెలేని జీవితం వృథా అనుకున్నాడు అంకుల్ టోబీ.

మద్యం ముట్టనివాళ్లకు ఈ లోకాన్ని మార్చేశక్తి వుంటుంది. వాళ్లు ఎదుటి మనుషుల్ని శాసించగలరు. పరిస్థితుల్ని తమకనుకూలంగా మలచుకోగలరు. అంకుల్ టోబీకి కూడా ఈ సుగుణముంటే ఎంత బాగుండేది. యుద్ధానుభవాలు వర్ణించటానికి తనింటికివచ్చిన అంకుల్‌తో విడో వాడ్‌మాన్ ప్రేమలో పడింది.

అయితే అప్పుడు ఓ నగర విధ్వంసానికి ప్రణాళిక రచిస్తున్నాడు అంకుల్. పాపం, వాడ్‌మాన్ ఏం చేస్తుంది? స్పందన కోసం తన ప్రేమను వాయిదా వేసుకోలేదు గదా?

ఈ ప్రేమికుల ఇళ్లు కూడా వాళ్లలాగే, ఒకదాన్నంటి ఒకటి ఉన్నాయి. గార్డెన్‌లో నిల్చుని అంకుల్‌ని చిత్తుచేసే లక్ష్యంతో ఆమె తన ప్రేమ యుద్ధాన్ని ప్రకటించింది. నిజానికి ప్రేమలో వాడే ఆయుధాలు, యుద్ధంలో వాడే ఆయుధాలకన్నా ప్రమాదకరమైనవి. శత్రువులు తప్పించుకోగలరేమోగాని, ప్రేమికులకది అసాధ్యం. ఈలోగా వాడ్‌మాన్ పనిమనిషి బ్రిడ్జెట్, అంకుల్ టోబీ సహాయకుడు ట్రిమ్‌కు కన్నుగీటింది.

నిరంతర పోరాట ఫలితంగా వాడ్‌మాన్ దుర్భేద్యమైన అంకుల్ టోబీ మనసును గెల్చుకుంది. ఒకనాడు ఆమె తన వికెట్ గేట్ తెరిచి, ఇంట్లోకి ప్రవేశించినప్పుడు అంకుల్ చేతులెత్తెయ్యక తప్పలేదు. యుద్ధవిద్యలో ఎంత ఆరితేరిన వాడైనప్పటికీ, ఇలా మెరుపుదాడి జరుగుతుందని ఊహించలేదాయె.

"కంట్లో నలుసు పడింది కెప్టెన్ షాండీ.. కాస్త సాయం చెయ్యరా? " అంటూ సుగంధ భరితమైన తన జేబు రుమాలు చెక్కిలి కద్దుకుంది వాడ్‌మాన్.

ఒక్కసారి ఆ దృశ్యాన్ని మీ మనోఫలకం మీద ముద్రించుకోండి. ఒకవైపు కళ్లు రుద్దుకుంటూ ఆవిడ సమీపిస్తే ప్రళయం సంభవిస్తుందేమో అన్నట్టుగా అతడు. కాని దగ్గరగా వెళ్లి కంట్లో కన్నుపెట్టి చూస్తేగాని తెలియదుగా- నలుసూ లేదు, పొలుసూ లేదని.

"ఒంటరిగా ఎలా ఉంటున్నారు కెప్టెన్ షాండీ? ఒకతోడు కావాలని ఎప్పుడూ అనిపించలేదా? " బ్రహ్మచారులను పాదాక్రాంతం చేసుకోవటానికి నెరజాణలు ఉపయోగించే శతఘ్ని అది.

"నేను ప్రేమలో పడ్డానురా" అంటూ తన సేవకుడు ట్రిమ్ ముందర నేరం అంగీకరించాడు అంకుల్.

"కొత్తేముంది? రోజూ పడుతూనే ఉన్నారుగా" అన్నాడు ట్రిమ్.

ప్రేమకు ముహూర్తాలుండవు.

అంకుల్ టోబీ, విడో వాడ్‌మాన్ ఇంటికీ, బ్రిడ్జెట్ రమ్మన్నచోటికి ట్రిమ్ చేరుకున్నారు.

–వసంత




# రెండు ముఖాలు

రెండుసార్లు అమెరికన్ అధ్యక్ష పదవి నిర్వహించిన వ్యక్తి మూడోసారి ఆ పదవిని చేపట్టడానికి అర్హుడు కాదని అమెరికన్ రాజ్యాంగంలో వుంది. దాంతో రెండవసారి అధ్యక్షుడైన జార్జి బుష్, తను పదవి దిగిపోయాక ప్రజలు తనను గుర్తుంచుకోడానికి ఏం చేయాలన్న ఆలోచనలో పడ్డాడు. తన మునుపటి అధ్యక్షులకు కట్టించినట్లుగా, ఏదైనా తన పేరుమీద కూడా కట్టడమో, విగ్రహమో నిర్మిస్తే ఎలా ఉంటుందనిపించింది.

వెంటనే బుష్ తన మిత్రుడైన మిస్టర్ జేమ్స్‌ని పిలిచి అతనికి ఆ నిర్మాణ బాధ్యతని అప్పగించాడు. ఆ నిర్మాణ కమిటీ అధ్యక్షుడిగా అతనికి ఐదు లక్షల డాలర్లు సేకరించే అధికారం కూడా ఇచ్చాడు.

"ఎలాంటిదయితే బావుంటుందో నువ్వే డిసైడ్ చేయి" అన్నాడు బుష్.

మళ్ళీ నెల తర్వాత ఈ విషయం మీద అదే తేదీన కలుద్దామని కూడా బుష్ అతనితో చెప్పాడు.

సరిగ్గా మళ్ళీ వాళ్ళు వాషింగ్టన్ డిసిలోని పెన్సిల్వేనియా అవెన్యూలో ఉన్న వైట్‌హౌస్‌లోని ఓవల్ రూంలో కలుసుకున్నారు.

"ఎందాక వచ్చింది జేమ్స్?" అడిగాడు బుష్.

గొంతు సర్దుకుని జేమ్స్ ఇలా చెప్పాడు-

"నలుగురు అమెరికన్ ప్రెసిడెంట్ల ముఖాలని మౌంట్ రష్‌మోర్‌లోని ఓ పర్వతం మీద వారి జ్ఞాపకార్థం చెక్కారు కదా? మీది కూడా 50 లక్షల డాలర్లతో అక్కడ చెక్కించాలని డిసైడ్

# చెత్తకుప్పలోంచి అమెరికాకు



అమెరికాలో మసాచుసెట్స్‌లో నివసించే సూసన్ జీవితాంతం మదర్ థెరీసాకి రుణపడి వుంటుంది. 39 ఏళ్ళ క్రితం కలకత్తాలో ఓ షూ బాక్స్‌లో ఆమెను చెత్తబుట్ట పక్కన వదిలివెళ్ళారు. తమకు పుట్టిన పిల్లల్ని ఇలా వదిలేయడం కలకత్తాలో మామూలే. అలాంటి వారికోసం వెదికే థెరీసా కంట పడిందామె.

మదర్ ఆ పాపకి షకులా అనే పేరు పెట్టింది. బెంగాలీలో దానర్థం ప్రేమ. తనకి దొరికిన అనాథలని పిల్లలులేని పాశ్చాత్యులకి ఆమె దత్తతగా ఇస్తూండేది. 6 నెలలు షకులా మదర్ వద్ద పెరిగాక, ఓరోజు అక్కడికి ఇండియాలో పనిచేసే ఓ బ్రిటిష్ డాక్టర్ తన అమెరికన్ భార్యతో వచ్చాడు. పిల్లలులేని వారు షకులాని దత్తత తీసుకున్నారు. ఆమెకు సూసన్ అనే పేరు పెట్టారు. ఏడాదిలోగా ఆ కుటుంబం అమెరికాకి వెళ్ళిపోయింది.



సూసన్ పన్నెండోఏట 1980లో తల్లిదండ్రులు ఆమెను దత్తత తీసుకున్న విషయం చెప్పారు. ఆ విధంగా థెరీసా గురించి తెలుసుకున్న సూసన్ ఎప్పటికైనా ఆమెని కలవాలనుకుంది. 1995లో పదిహేనేళ్ళ తర్వాత, సూసన్ 27వ ఏటా న్యూబెడ్ ఫోర్డ్‌లోని మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి మదర్ థెరీసా వస్తుందని తెలుసుకుంది. దాదాపు గంటసేపు సూసన్ థెరీసాతో గడిపి, తనని కాపాడినందుకు కృతజ్ఞతలు తెలియజేసుకుంది. అంతసేపూ మదర్, సూసన్ అరచేతులని ఆప్యాయంగా తనగుప్పిట్లో పట్టుకునే వుంది. తను ఓమనిషిని కాక ఓ మహాత్మురాలిని చూస్తున్నానని సూసన్ చెప్పింది.

చేసాను. కానీ నిర్మాణ కమిటీ సభ్యులు మాత్రం రెండుముఖాలకి అక్కడ చోటు లేదని చెప్పారు"

"రెండు ముఖాలేమిటి? " ప్రశ్నించాడు బుష్ అర్థంకాక.

"మీరు ప్రజలకి చెప్పేది ఒకటి, చేసేది ఒకటి కదా? "

"మన రాజధానిలో అబ్రహాం లింకన్ లాంటివారి మెమోరియల్స్ ఉన్నాయి కదా! ఆ తరహాలో ఆలోచించలేదా? అడిగాడు బుష్.

"వాషింగ్టన్ డిసిలోని హాల్ ఆఫ్ ఫేమ్‌లో కొందరు అమెరికన్ మాజీ అధ్యక్షుల విగ్రహాలు ఇప్పటికీ ఉన్నాయి. అక్కడ మీ విగ్రహం పెట్టాలని సంకల్పించాం. అయితే ఆ హాల్లో ఎక్కడ పెట్టాలన్నది మా కమిటీ తేల్చలేకపోయింది."

"ఎందుకని? "బుష్ భృకుటి ముడిచాడు.

"ఎన్నడూ అబద్ధమాడని జార్జి వాషింగ్టన్ విగ్రహం పక్కన పెట్టడం సబబుకాదని వాళ్ళన్నారు. అలాగే ఎన్నడూ నిజం చెప్పని రిచర్డ్ నిక్సన్ విగ్రహం పక్కన పెట్టడం కూడా భావ్యం కాదన్నారు. ఈ రెంటి మధ్య తేడా తెలియని మీ విగ్రహం ఎక్కడ పెట్టాలో అంతుచిక్కడం లేదు"

"ఎక్కడో ఓ చోట పెట్టాలి కదా? " చెప్పాడు బుష్.

"చివరికి మీ విగ్రహాన్ని అమెరికాని కనిపెట్టిన క్రిస్టఫర్ కొలంబస్ విగ్రహం పక్కన ఉంచాలని కమిటీ నిర్ణయించింది"

"ఎందుకని? "

"ఎందుకంటే అతనూ మీలా గొప్ప రిపబ్లికన్ కాబట్టి"

"అదెలా? " అడిగాడు బుష్ విస్మయంగా.

"ఎలా అంటే.. తను ఎక్కడికి వెళ్తున్నాడో తెలియకుండా బయలుదేరాడు. అక్కడికి చేరుకున్నాక తనెక్కడున్నాడో కూడా అతనికి తెలీదు. తిరిగి బయలుదేరిన చోటుకే ఎక్కడ్నించి వచ్చాడో కూడా తెలీకుండా వచ్చాడు. పైగా ఇదంతా ఇతరుల డబ్బులతోనే చేసాడు"

"చాలా బావుంది. అదే మంచి చోటు. అక్కడే ఉంచండి" మెచ్చుకున్నాడు బుష్.

"కానీ ఓ చిన్న సమస్య వచ్చింది"

"ఏమిటది? "

"ఇంతదాకా మా కమిటీకి మీ పేరు చెబితే రాలిన ఫండ్స్ చాలా తక్కువ. అది కేవలం ఒక డాలర్ తొంభై తొమ్మిది సెంట్లు మాత్రమే" చెప్పాడు జేమ్స్.

# మనసున ఉన్నదీ...



★ మే చతురలో వచ్చిన 'రంగురాళ్లు' నవల నేటి వ్యవస్థలోని కుళ్లు రాజకీయాలు, గూండాగిరి, డబ్బు ప్రభావంవల్ల మనుషుల్లో వచ్చే మార్పులు ఎలాగుంటాయో కళ్లకు కట్టినట్లుగా చిత్రించింది. పేద, మధ్యతరగతి, ధనిక వర్గాల వ్యక్తుల ఆలోచనలు, విధానాలెలా ఉంటాయో వివరించింది. మధ్యమధ్యలో రామకృష్ణ పరమహంస చతురోక్తులు మేలుకొలుపు కలిగిస్తూ మనసుకు హత్తుకునేలా ఉన్నాయి. ట్యాంక్‌బండ్ కథ 'వీడని నీడ' ఆసక్తికరంగా సాగింది.

**– ఎ.రమేష్,** శాంతినగర్, మహబూబ్‌నగర్ జిల్లా

★ వాణిశ్రీ నవల 'రంగురాళ్లు' చాలా ఆసక్తికరంగా కొనసాగింది. చెన్నకేశవులులాంటి మంచి వ్యక్తులు మన మధ్య ఎంతోమంది ఉన్నారు. అయితే కనీసం నవలలో అయినా మంచివ్యక్తులు గెలిచినట్లు రాస్తే సామాన్యులకు మంచిపై ఆశ, నమ్మకం కలుగుతుంది. యర్రంశెట్టి సాయి అపార్ట్‌మెంటాలజీ బాగా ఉంది. 'కొత్తగాలులు' పెంచాలని మనవి. కాప్షన్ మీదే శీర్షిక కూడా బాగుంది.

**–జి.గోపాలకృష్ణ,** శ్రీకాకుళం

★ కాలాతీతంలో వచ్చిన 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' గొప్ప నవల. డిగ్రీలో మాకది పాఠ్యాంశం. ఓ సామాన్య కుటుంబంలోని కష్టనష్టాలు ఈ నవలలో తెలుస్తాయి. 'రంగురాళ్లు' నవలలో కొన్ని వర్గాల అణచివేత గురించి వివరంగా తెలియజేశారు. టాంక్‌బండ్ కథ 'వీడని నీడ' ప్రస్తుత బాంధవ్యాలను వివరించింది. జ్ఞానపీఠ గ్రహీత ఉమాశంకర్ జోషి విశేషాలూ బాగున్నాయి.

– పి.విజయలక్ష్మి, రామారావుపేట, కాకినాడ

★ మే చతురలో రామకృష్ణ పరమహంస చతురోక్తులు వేసినందుకు సంతోషం. కొత్తగాలులు బాగున్నాయి. చతురకత 'రాజకీయం'లో ఆకట్టుకుంది. 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' నవలా పరిచయం చాలా బాగుంది. మున్ముందు కూడా ఇలాంటి పాశ్చాత్య ఆణిముత్యాలను ప్రచురించాలని ఆశిస్తున్నాం. అయితే 'రంగురాళ్లు' విషాదాంతం కావడం నిరాశ పరిచింది. నేటి వ్యవస్థకు ప్రతిబింబం ఈ నవల.

**– అప్పల నరసింహ,** కొడెగెహళ్లి, బెంగళూరు

★ అనాథగా తిరుగుతూ పెరిగిన చెన్నకేశవులు కష్టాల్లో కాకలుదీరి, కార్మిక నాయకుడయ్యాడు. అద్భుతమైన పాత్ర చిత్రణ, ఆసక్తిదాయకమైన కథాగమనంతో నవల వదలకుండా చదివించింది. ముదిగొండ పోలీసుల కాల్పుల ఘటనను స్ఫురింపజేసింది. మగతోడు లేని మగువలు చంద్రకళ, సీతాలక్ష్మి, మనోరమల పాత్రల చిత్రణ ఏ మాత్రం అనైతికత, అశ్లీలం లేకుండా ఉంది. మంచి నవలను అందించిన రచయిత అభినందనీయులు.

**– పోరువల్లి వెంకటేశ్వరరావు,** హైదరాబాద్

★ చతుర నవల వాస్తవికతకు అద్దంపట్టింది. స్వార్థం కారణంగా ప్రాణప్రదమైనవాళ్లు సైతం వెన్నుపోటు పొడుస్తారన్నది సత్యమేనని 'సత్యం' పాత్ర మరోమారు నిరూపించింది. శ్రీధర్ కాప్షన్ పోటీ మేటిగా సాగుతోంది. టాంక్‌బండ్ కథలు, జ్ఞానపీఠ్ అవార్డు సంగతులు, ప్రసిద్ధనవలల పరిచయాలు ఆకట్టుకుంటున్నాయి. చతుర, విపుల రచయితల చిరునామాలు చివర్లో ఇస్తే పాఠకులకు ఉపయోగమేమో పరిశీలించండి.

**–శ్రీ పెరంబుదూరు నారాయణరావు,** హైదరాబాద్

★ 'భావన' ముఖచిత్రంగా వెలువడిన చతుర చాలా చక్కగా ముస్తాబైనది. శ్రియ చెప్పిన ఆరోగ్య విషయాలు బాగున్నాయి. గొప్ప నవలను కాలాతీతంలో అందించారు. రామకృష్ణ పరమహంస అంశాలు చాలా బాగున్నాయి.

– పెన్మెత్స సూరిబాబు, హైదరాబాద్

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



## జూన్ - 09

జూన్ 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ట్రైస్ట్రాం షాండీ నవలా రచయిత?
2. భూపతి భార్యపేరు?
3. మాలతి ఏ క్లాసులో ఉన్నప్పుడు ప్రేమ ప్రస్తావన తెచ్చింది?
4. రుక్మిణి ఎవరి భార్య?
5. సీతారామయ్య మూడోబిడ్డ?
6. సీతారామయ్య తరచూ ఏ కవిని కోట్ చేసేవాడు?
7. అబద్ధమాడని అమెరికా అధ్యక్షుడు?
8. నాగస్వర చక్రవర్తి బిరుదాంకితులు?
9. సుమిత్రానందన్‌కు జ్ఞానపీఠ అవార్డు తెచ్చిన కావ్యం?
10. త్రీ జీరో టూ అపార్టుమెంటులో హార్ట్ అటాక్ వచ్చిందెవరికి?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు ( )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.



## రంగు మహత్యం

ఆకుపచ్చరంగు, ఎర్రటి కళ్లు, కాళ్లుగల ఈ చెట్టుకప్ప ఆకు పచ్చని చెట్లు, గడ్డిలో కలగలిసిపోయి మనుగడ సాగిస్తుంది. ఒకవేళ శత్రువులు దీన్ని కనిపెట్టినా ఎర్రని కళ్లు, దట్టమైన రంగుగల పాదాలు చూసి పలాయనం చిత్తగిస్తాయట.




## కొమ్ముల కప్ప

అమెజాన్ అడవుల్లో కన్పించే ఈ కప్ప కొమ్ములు ఎనిమిది సెం.మీ. దీని ప్రత్యేకత ఏమంటే ఇతర జీవులపైన దాడి చేయడం. తనంత పెద్దజీవుల్ని సైతం పాదాల గోళ్లతో గుచ్చి, గుటకాయ స్వాహా చేస్తుందిట.

